# విషయసూచిక

## గల్పికలు, స్కెచెస్

# 1. బ్రోకరు శేఖరు

‘‘ఫీజు కట్టడానికి అర్ధరూపాయి తక్కువొచ్చింది. కొంచెం నీదగ్గిరుంటే ఇద్దూ, మళ్లీ రేపిచ్చేస్తాను,’’ అన్నాడు శేఖరు బ్రతిమాలే స్వరంతో.

‘‘అర్ధరూపాయే! నాదగ్గిర లేదే,’’ అన్నాడు గోపీ తన నిస్సహాయతని వెల్లడి చేస్తూ.

‘‘ఇహ ఇవాళ పేరు కొట్టేస్తారు.’’

శేఖరుకి దాదాపు ఏడుపొస్తోంది. ‘‘మీఅన్నయ్యని అడిగితేనో?’’

‘‘అన్నయ్యా? తన్నకుండా వుంటే చాలు, ఇచ్చినంత. నీ హాబీ వుండనే వుంది కదా బ్రోకరేజి,’’ అన్నాడు గోపీ.

‘‘ఏం పెట్టి బ్రోకరేజి?’’ అన్నాడు శేఖర్ నిస్పృహగా. గోపి తప్పకుండా సాయం చేస్తాడు అనుకున్నాడు వాడు.

ఎలాగైనా సాయం చెయ్యాలనుకున్నాడు గోపి. ‘‘ఉండు, అడిగిచూస్తాను నాన్నగారిని,’’ అంటూ లోపలికి వెళ్లిన గోపీ అట్టేకాలం వ్యర్థం కాకుండానే దవడ తడుముకుంటూ వచ్చాడు. మొహం చూసి వెళ్లిపోబోతున్న శేఖర్ని ఆపి గోపీ, ‘‘ఇంద’’ అంటూ మబ్బురంగు పెన్ను ఇచ్చేడు.

వాడిఉద్దేశ్యం గ్రహించిన శేఖర్, ‘‘మీనాన్నగారికి తెలిస్తే?’’ అన్నాడు భయంగా.

‘‘ఫరవాలేదులే. పోయిందని పొద్దున్నే చెప్పేశాను. ఇంకోటి తెస్తానన్నారు,’’ అన్నాడు గోపీ.

000

ఆ సాయంత్రం గోపీతండ్రి ‘‘ఇదుగో, ఇదైనా జాగ్రత్తగా వాడుకో,’’ అంటూ మబ్బురంగు కలం చేతులో పెడుతూంటే నిర్ఘాంతపోయాడు గోపి.

మర్నాడు శేఖర్ని "నువ్వు పెన్ను ఎవరికి అమ్మావురా?" అని గోపీ అడిగేసరికి, శేఖర్ తెల్లబోతూ, "ఎక్స్‌క్యూజ్ మీ. మీనాన్నగారని తెలీలేదురా,"అన్నాడు.

గోపీ నవ్వి, "ఫరవాలేదులే. మరి తిన్నగా అడిగితే ఇవ్వకపోతే ఏంచెయ్యాలి??" అన్నాడు.

000

(తెలుగు స్వతంత్ర, జులై 9, 1954)

# 2. రాద్ధాంతంపై సిద్ధాంతం

‘‘ఏంవోయ్ ఈమధ్య రచయితవైపోయావేం?’’

‘‘నేనా?’’

‘‘ఊఁ. మంచి ‘రాద్ధాంతం’ రాశావులే.’’

‘‘రాద్ధాంతం? అవును. రాశాను. అయితే?’’

‘‘అయితే? ఆ కథలో రాముడిబంధువులు మాయింటిదగ్గరున్నారు.’’

‘‘అవును. తెలుసు.’’

‘‘వాళ్లు చదివారు. కోపం వచ్చింది.’’

‘‘వాళ్లకా? నీకా?’’

‘‘వాళ్లకే. నీకు గర్వంట. అందుకే వాళ్లమీద అలా రాసేవుట.’’

‘‘నేను వాళ్లమీద రాయలేదే.’’

‘‘అదేలే, వాళ్లవాళ్లమీద.’’

‘‘వాళ్లవాళ్లమీద రాయలేదు. పుచ్చకాయదొంగలు.’’

000

‘‘మొన్న నీకథ చదివేనోయ్.’’

‘‘సంతోషమండీ.’’

‘‘అదేఁవిటోయ్. పేర్లేనా మార్చకుండా అలా రాసేశావ్.’’

‘‘పేర్లు మారిస్తే మటుకు మీవాళ్లు గ్రహించలేరా?’’

‘‘ఏమైనా పేర్లు మారిస్తే బాగుండేది. ... నేను నిన్నేం అనడంలేదు. కథలు రాయడం మంచిదే. లేకపోతే ఇలాటి అన్యాయాలు అందరికీ ఎలా తెలుస్తాయి? నేనన్నది మార్పుమాట.’’

‘‘అవున్లెండి. ఎప్పటికెయ్యది ప్రస్తుతమో అప్పటికామాట ఆడమన్నాడు కదా కవి.’’

‘‘అబ్బే, నిన్ను నేనేం అనడం లేదోయ్.’’

ఇంట్లోవాళ్లూ నన్నే అంటున్నారు. పైవాళ్లూ నన్నే అంటున్నారు. అంతా నాదే తప్పంటారు. అదేదో కథ జ్ఞాపకం వస్తోంది. నిద్రపోతున్న రచయిత్రికి కథానాయకుడు సాక్షాత్కరించి రచయిత్రిని నిందించాడట తనకే అన్ని కష్టాలు పెట్టినందుకు. పైగా తనకి ముగ్గురాడపిల్లలైతే ఆరుగురని రాసి రచయిత్రి అసత్యప్రచారం చేసిందని. అలాగ ఉంది ఇది. అసలువాళ్లు ఏఁవీ అనలేదు. మధ్యవాళ్లకి ఎందుకు బాధ? అసలు హెడ్డింగుపైన ఎడంచేతి వేపు మూల మూడక్షరాలలో ప్రకటించబడిన ‘‘గల్పిక’’ కనిపించలేదూ?

ముక్కోటి ఆంధ్రులలో ఏ ఒక్కడికీ పోలిక లేకుండా రాయడం కష్టమే. అందుకే ఒక సిద్ధాంతం చేసుకున్నా. ‘‘ఇహమీద ఏదీ సూటిగా తేల్చక, ముంచక, మధ్యస్థంగా నాన్చాలి’’ అని!

000

(గమనిక. దీనికి ముందు ‘‘రాద్ధాంతం’’ అని ఒక గల్పిక రాసేను. దానికాపీ నాదగ్గర లేదు. కానీ దానిమీద వ్యాఖ్యానాలు వచ్చినతరవాత ఇది రాయడం జరిగిందన్నమాట!)

(తెలుగు స్వతంత్ర సెప్టెంబరు 3, 1954)

# 3. వకుళాదేవి డైరీ

డైరీ రాయడం ప్రారంభించాను.

అబద్ధాలు ఆడకుండా ఉండడానికి ఇవాళ ఎం.ఐ. (మోరల్ ఇన్స్ట్రక్షన్) క్లాసులో మేష్టారు ఒక ఉపాయం చెప్పారు. చిన్న పుస్తకం కుట్టి అందులో ఆడిన అబద్ధాలన్నీ వ్రాసి, అది క్లాసులో ప్రతిసారీ చదవాలిట. అంటే ఇంకెప్పుడూ మళ్లీ ఇలాటి పొరపాటు రానివ్వనూ అని అన్నమాట.

అబద్ధాలపుస్తకం కుట్టి అమల్లో పెట్టాను.

విశేషాల్లేవు.

అన్నయ్యదగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది. మూడువారాల్లో వస్తున్నానని.

ఏడురోజుల్నుంచి డైరీసంగతి మర్చిపోయేను. రేపు అన్నయ్య వస్తాడు. మావదిన పినతండ్రి చిన్నకొడుకుని తీసుకొని వచ్చారు వదినని తీసుకెళ్లడానికి. ఆశ్చర్యంగా వుంది వదిన ఇంకా ఇంటికి రాకముందే తీసుకెళ్లిపోతారు కాబోలు! అలా అయితే స్టేషన్లోనే కూర్చోవలసింది ...

వచ్చారు అన్నయ్యా వదినా. ఇల్లు చిన్నది. కింద రెండుగదులూ, మేడమీద ఒక గదీ ...

ఇరుకూ, చికాకూ, పైగా వాన.

భోజనాలయేసరికి 12 గంటలైంది. అమ్మకైతే ఏకాదశి. మేం గిలగిల్లాడిపోయేం. మరి 10 గం. కొట్టేసరికి చేతులు కడిగేసే అలవాటు.

ఇవాళ కూడా పన్నెండే. అమ్మకి ద్వాదశి శోష వస్తోంది. పైగా "నాకోసం మీరంతా ఎందుకు ఉండడం, భోంచెయ్యలేదూ?" అంటూ సన్నాయినొక్కులు నొక్కే మామగారు.

ఎంబ్రాయిడరీవర్కు చేసే ఫ్రేమ్ విరిగిపోయింది వదిన సహాయంతో. అపీల్ లేదు.

అమ్మకి వంట్లో బాగులేదు. మావదిన మేనమామకోడలితరఫువాళ్ళుట వచ్చారు. వానొకటీ, ఇల్లూ ఏరూ ఏకం చేస్తూ.

మేడమీద గది వదిన ఆక్రమించుకుంటోంది.

తను క్రిందనుంటే చిన్నన్నయ్యా, నాన్నగారూ, మామగారూ, తమ్ముడూ అంతా మేడమీదికెళ్ళొచ్చు. ఈ సంగతి తనకి అర్థం కాదు. అమ్మ నన్ను చెప్పనివ్వదు. "ఒక్కరోజులో మాట పోగొట్టుకోడం ఎందుకు" అంటుంది.

వదినావాళ్ల చుట్టాలు వెళ్లిపోయారు.

వదిన పొద్దున్న కాఫీలయితే గానీ లేవదు. మధ్యాహ్నం టిఫిన్ అయితే గానీ మేడ దిగదు. కొంచెం కూడా భయంలేదు. చెప్పేవాడు లేకపోతే సరి.

"చెప్తేగానీ ఏపని చెయ్యాలో తెలీద"న్న మనిషి (వదిన) ఎదురుగుండా కనిపించిన పని కూడా చేసేదికాదు. నేను గ్లాసులు పెడితే తను మంచినీళ్లు పోస్తుంది. ముగ్గుర్నుంచి నలుగురు ఆడవారయేసరికి నాకు కూడా పని తగ్గుతోంది.

అమ్మకి జ్వరం. వచ్చే పోయే చుట్టాలకి అంతూ పొంతూ లేనట్టుంది. అందులో కొందర్ని వదినకి కూడా తెలీదుట!

నాన్నగారు రాజమండ్రీ వెళ్లారు. మామగారు కూడా అనకాపల్లి వెళ్లారు (బాగుండదని కాబోలు). ఆయనకొడుకు మాత్రం ఉండిపోయాడు.

నాకు చికాకు కలిగించేవి రెండు. మొదటిది నేను చేస్తున్నపనిమధ్యలోకి వదిన రావడం, రెండోది నా కాగితాలూ, పుస్తకాలూ తియ్యడం ... తియ్యవద్దని వదినతో చెప్పలేక చచ్చేదాన్ని.

ఆబద్ధాలపుస్తకం నిండిపోతూంది, విసుగేసి చింపేసేను. ఆ మేష్టారు వెళ్లిపోయారు మరి.

ఇవాళ అక్కతో దెబ్బలాడేను నన్ను "చెల్లెమ్మా" అనొద్దని. లేకపోతే పనిమనిషికీ, పాలమనిషికీ, వదినకీ అందరికీ చెల్లెమ్మనేనా?

నాన్నగారూ, వాళ్లూ వచ్చేశారు. అమ్మకి ఉష్ణం ఎక్కువయింది. "నేనొండుతాన్లేమ్మా, ఇవాళ" అన్నాను వండనివ్వదని తెలిసే.

"తీరుతాయిలే ఆ సరదాలూను," అంది అమ్మ. పిల్లలంటే తల్లులకి అలా అనిపిస్తుంది కాబోలు!

వదిన పొడిచేసేట్టు చూస్తూంటుంది ఎందుకనో? "ఏం, చూడకూడదా?" అంటుంది. "చూడకూడదని కాదులే" అని నసిగేసి, నవ్వేసి అక్కణ్ణుంచి లేచిపోయేను. తను గ్రిహిస్తే బాగుండును ఇలాటివన్నీ.

ఇవాళ చిన్న తమాషా జరిగింది. బాబ్జీ స్కాటు డ్రెస్సులో వీధుల్లో తిరుగుతున్నాడట. రోడ్డుమీద నిలబడి మాఅన్నయ్య మామగారు కనిపించారట. వీడేమో "స్టేషన్ ఎక్కడో తెలీదు కాబోలు. రండి చూపిస్తా" అన్నాడట. మరి యుగాలూ జగాలూ ఎవరు భరించగలరు? అంటుంది అమ్మ.

మా అమ్మమ్మా తాతగారూ అమ్మని చూడడానికి రెండురోజులు రైల్లో ప్రయాణం చేసి ఇంట్లో ఒక్కపూట ఉండేవారుట.

అన్నయ్యా, వాడిమామగారూ చెప్పకుండా సినిమాకి చెక్కేసి రాత్రి పదిగంటలకి తాపీగా భోజనానికొచ్చారు. మధ్య మేం మాడి చచ్చాం. ఇహ అప్పుడు ఉపన్యాసాలకి తగులుకున్నారు. శ్రీయుతులు "కట్నాలు పుచ్చుకోకూడదుట". బాగానే వుంది. కానీ బహుమానాలూ పెళ్లిలో చదివించే కట్నాలు కూడా పుచ్చుకోరట. మావదిన కొన్ని పుస్తకాలూ, గ్లాసులూ చూపించింది మళ్లీ! బలవంతాన ఇచ్చి వెళ్లారట. బహుశా చిన్నచిన్నవి పుచ్చుకోరు కాబోలు. డాబు, బహుమానాలు మనకి లేవనీ, కొనుక్కోలేమనీ ఇస్తారేమిటి? ఈమాటు ఏవైనా చూపించినప్పుడు అడిగేస్తాను.

అన్నయ్యా వదినా అందరూ వెళ్లిపోయారు.

ఇంకేమీ కనిపించడంలేదు డైరీకి.

000

(తెలుగు స్వతంత్ర. జూన్ 24, 1955)

# 4. నేటి విద్యార్థులు

దిక్కుమాలిన రోడ్డు అనుకుంది తొమ్మిదోమాటు ఈదారి తప్ప మరోగతి లేని వల్లిక.

నిజానికది దిక్కుమాలిన రోడ్డు కాదు. లెక్కపెట్టదగినన్ని కార్లు నడుస్తాయి ఆ రోడ్డుమీద. లెక్కలేనన్ని కాళ్లు నడుస్తాయి ఆ రోడ్డుమీదే.

ఆ రోడ్డుకి ఇరుపక్కలా గుడిసెలున్నాయి. ఆ గుడిసెల్లో పిల్లలఆటలకీ ఆడవాళ్ల నీళ్లవాడుకకీ ఆ రోడ్డే దిక్కు.

కాలేజీస్టూడెంట్లకీ, సినీప్రేక్షకులకీ, బిచ్చిషికార్లకీ ఆ రోడ్డే దిక్కు.

ఎదురుగుండా వస్తున్న మునిసిపాలిటీలారీని ఎదుర్కోడానికి ముచ్చట పడుతోంది వెనకనున్న ఓ నాటుబండీ.

గోలీలాడుతున్న పిల్లలు ఏదో పాట అందుకున్నారు.

సైకిలుమీద వెళ్తిన్న స్టూడెంటు కాలినడకన తలొంచుకుపోతున్న అమ్మాయితో వెకిలిగా "కాలేజీకెళ్తున్నాం, దీవించు తల్లీ" అన్నాడు. అన్నతరవాత ఘనంగా ఆ పిల్లమొహంలోకి చూశాడు.

వెనకసీటులోని వెధవ "మగాళ్లతో మాటాడ్డానికి భయమా?" అంటున్నాడు.

ఎన్ని కుక్కలరిస్తే నాకేం అని ధీమాగా సాగిపోయే మత్తేభంలా నడిచి పోతూంది ఆ అమ్మాయి.

చకచక నడుస్తున్న ఆ అమ్మయి సైకిలు వెళ్లిపోయాక ఓక్షణం ఆగింది. సైకిలువాలాని చూడ్డానికి కాదు, దిక్కు తోచక, ముందున్న కారూ వెనకున్న బండీ ఓ దాన్నొకటి దాటేవరకూ.

ఆగిన అమ్మాయిని చూస్తున్నాడు సైకిలుమీద వెనకసీటులోని వాడు కులాసాగా ఇకిలిస్తూ.

అమ్మాయికి కోపం వచ్చింది.

చదువుకున్నా సంస్కారంలేని వెధవలు అనుకంది కసిగా. అనుకునేలోపున కారు దాటిపోయింది. అనుకున్నాక అమ్మాయి ముందుకి సాగింది. ముందువాడు వాడే అయివుంటాడు. వాడిచెల్లెలే కాబోలు కాలేజీలో చదువుతోందిట. దాన్ని ఎవరేనా ఇలాగే అంటే వాడికెలా వుంటుందో? రాస్కెల్. మాటాడక, మాటాడక వాడితోనే మాటాడాలి.

కాలేజీ వచ్చేసింది.

కిళ్లీకొట్టుదగ్గిర ముగ్గురు వెధవలు వెధవదర్జా వొలకబోస్తూ సిగరెట్ కాలుస్తున్నారు. ఇంటిదగ్గర పస్తులున్నా పైకొచ్చేసరికి దర్జా. ఏమిటో వాగేడొకడు. మిగిలిన ఇద్దరూ నవ్వేరు. తననిగురించే కానోపు, తిని కూర్చునేదీను, తెగ వాగేదీను. ఆ చారలచొక్కావెధవ కలెక్టరాఫీసులో గుమాస్తా కొడుకుట. గేటుదగ్గిర మరో వెధవ నించుని వున్నాడు. అందరూ వెధవలే. గేటుదగ్గరివాడు మాత్రం పేలలేదు. మెల్లిగా వినయంతోనూ విధేయతతోనూ అడిగేడు, ''మీది ఆర్ట్సా సైన్సా అండీ'' అని.

వొళ్లు మండిపోతున్న వల్లికకి ఇంకా మండింది. నీకెందుకు అందామనుకుని పెదిమలు విప్పి నేల చూస్తూ, ''సైన్స్,'' అంది.

''సారీ,'' అన్నాడతను వెనక్కి తగ్గి.

ముందుకు సాగిపోతున్న వల్లిక అనుకుంది ''సారీ ఎందుకు, అణకువ చూపినందుకా'' అని. అంతటితో అయిపోలేదు. వెయిటింగ్ రూందగ్గిరకొచ్చేసరికి తనక్లాసువాడే మరొకడు ఓ కాయితం పట్టుకొచ్చేడు.

అందులో ''ఓట్ ఫర్ ...'' అని ఉండి వుంటుంది. ''సారీ'' అన్నాడతను ఆ కాయితం అందిస్తూ.

''మీరేం నాకు రికమెండ్ చెయ్యక్కర్లేదు. నాకు తెలుసు ఎవరికి ఓటు వెయ్యాలో'' అనలేదు. కానీ కాగితం విసురుగా తీసుకుని అలా అని ఉంటే బాగుణ్ణు అనుకుంది. వీళ్లకి ఓటు వెయ్యాలి. ఆడపిల్లని గౌరవించడం తెలీదు కానీ వీడికి ఓటు వెయ్యాలి. క్లాసులో గోల చేసినవాడినోరు ముయ్యలేరు కానీ నేను ఓటు వెయ్యాలి.

తలొంచుకు తనదారిన పోతున్న మనిషిని చూస్తూ ఊరుకోలేరు కానీ ... కానీ ...

ఇవన్నీ మనసులో అనుకుంది. ముఖాముఖీ అడగలేదు. తనఓటు ఎవరికీ వెయ్యలేదు. అంతమాత్రాన ఎవడో ఒకడు గెలవక మానలేదు.

వల్లిక ఓటు వెయ్యలేదని తెలిసి గెలిచినవాడిఅనుచరులు గేలి చెయ్యదలుచుకున్నారు.

ఆమె నడుస్తుంటే జీతం ఇవ్వకపోయినా పాడమని కోరకపోయినా లెఫ్టు రైటంటూ కదం పాడసాగారు. ఆమెచుట్టూ వున్న గాలినీ పక్కనున్న గోడనీ ఎదురుగా ఉన్నగేటునీ ‘‘నీ ఓటెవరికి?’’ అని అడుగుతున్నారు.

వల్లిక ఊరుకుంది. అరిచి చావనీ అనుకుంది. మరోరోజు ‘‘అదుగోరోయ్, మధుబాల’’ అన్నాడు.

వొళ్లు మండి, పళ్లు గిట్టకరిచి వెనుతిరిగి చూసింది వల్లిక.

పెద్దవిగా వున్న కళ్లు ఇంకా పెద్దవయేయి.

‘‘ఎవడ్రా ఇడియట్, ఏమిటి పేల్తున్నావు?’’ అంది.

ఆశ్చర్యార్థకాల్లా నిల్చున్న నలుగురు ఇడియట్స్‌లోనూ ఏ ఒక్కడూ ముందుకి రాలేదు నేనూ పేల్తున్నానంటూ!

000

(తెలుగు స్వతంత్ర, జులై 8, 1955)

# 5. ఓటుకోసం

‘‘నువ్వు ప్రెసిడెంటుగా ఎందుకు కంటెస్టు చెయ్యకూడదూ?’’ అంది శశిరేఖ.

‘‘అవును ఎందుకు చెయ్యకూడదూ?’’ అన్నాను ఆలోచన నభియిస్తూ.

‘‘ఫన్ కాదు. నిజంగానే చెయ్యి. నేను ప్రపోజ్ చేస్తాను’’.

‘‘నీఓటు గ్యారంటీ అని తెలుసులే. మరొక ఓటు ఏదీ?’’

‘‘మరొక ఓటు ఏమిటి?’’

‘‘నువ్వు ప్రపోజ్ చేస్తావులే. సెకండ్ చెయ్యడానికి మరొక ఓటేది?’’

‘‘ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ ఫీలవకు.’’

ఆ రోజే మధ్యాహ్నం అహల్యాదేవి రెండు రూపాయల డిపాజిట్‌తో (వాస్తకవితకోసం) సహా నామినేషన్ దాఖలు చేసేశాను. అరుణాదేవి కూడా కంటెస్టు చేస్తున్నట్టు తెలిసి కొంచెం భయంలాంటిది వేసింది. ఆమాటే శశితో అంటే ‘‘నెవర్ మైండ్’’ అంది.

కాన్వాసింగ్ భారీఎత్తున ఏర్పాటు చేసింది శశిరేఖ. ఆఖరికి ఆ దెబ్బతో ఊళ్లో అందరూ కూడా రిజల్ట్‌కోసం ఎదురు చూడసాగారు. ‘‘ఫలానా లేడీస్’’ కాలేజీకి ఎవరు ప్రసిడెంట్ అవుతారో అని. కొందరిదృష్టిలో శశిరేఖే కాండిడేట్‌గా గుర్తింపబడింది. తరవాత అలాటి ప్రమాదం జరగకుండా జాగ్రత్త పడ్డాం అనుకోండి.

ఇంకొక నాలుగురోజులు ఎలక్షన్ వుందనగా ఆదివారం మధ్యాహ్నం శశి వచ్చి, ‘‘ఓమాటు కల్పలతని కలుసుకోడం మంచిది. షికారుగా వెళ్లి వద్దాం’’ అంది.

‘‘కల్పలత ఎవరు?’’ అన్నాను.

‘‘ఫస్టియర్, లే చెప్తా, పద’’ అంది వగరుస్తూ ‘‘తనవల్ల పాతిక ఓట్లు సుళువుగా వచ్చేస్తాయి.’’

‘‘పద, స్వంతకారు కూడా వుంది,’’ అన్నాను. (నాది కాదులెండి!)

‘‘ముందు రుక్మిణిదగ్గిరికి వెళ్దాం. తనకి తెలుసు వాళ్లిల్లు.’’

‘‘రుక్మిణి మనతో వస్తుందా?’’ అన్నాను.

‘‘ఏం?’’

‘‘రుక్మిణి మన అపొసెంట్ రిలేషన్స్ కదా’’ అన్నాను.

‘‘ఆఫ్టారాల్! ఈ చిన్నవాటికి రిలేషన్స్ గిలేషన్స్ అని పట్టుక్కూర్చుంటారేమిటి? ఇందులో పెద్ద కలిసొచ్చేదేముంది కనక.’’

‘‘లేకపోతే ఏ ఎసెంబ్లీకో అయితే మనవాళ్లు అమూల్యమైన ఓటు దుర్వినియోగం చేస్తారంటావా?’’

‘‘కాదు మరీ. అక్కడ బంధుప్రీతి చూపిస్తే ఏదో లాభం,’’

‘‘ఆ మాటా నిజమేలే. ఇప్పడలాగే జరుగుతోంది. మనిషి న్యాయాన్యాయాలు ఆలోచించడు స్వలాభం చూసుకొని ఎందుకనో,’’ అన్నాను.

శశికి ఎవరిమీద విసుగేసిందో, ‘‘మనపాటి తెలివి లేక’’ అంది. పోస్టాఫీసు దాటేక మూడో సందులో పసుపుమేడట. తీరా అక్కడికొచ్చేసరికి డైలమాలో పడ్డాం. కుడివేపు మేడా? ఎడంవేపుదా?

‘‘టాస్ వేద్దాం,’’ అన్నాను.

‘‘నావన్నీ నోట్లూ, చెక్కులూ,’’ అంది శశి.

ఆఖరికి డ్రైవరుదగ్గిర ఇచ్చ పావలా అప్పు పుచ్చుకుని టాస్ వేస్తే అది ఎడంవేపు మొగ్గింది.

‘‘నువ్వు వెళ్లు. మేం కార్లో ఉంటాం,’’ అంది.

మేం అంటే తను చెల్లెల్ని తీసుకొచ్చింది. ముగ్గురం వెళ్లడమేమిటని నా చెల్లెలు కూడా వచ్చింది.

‘‘నువ్వు రా. నన్ను నేను ఇంట్రడ్యూస్ చేసుకోవడమేమిటి’’ అన్నాను.

‘‘ఇంతమంది వెళ్లడమేమిటి దండయాత్రలా?’’

తప్పనిసరిగా ఒక్కదాన్నే వెళ్లాను. గేటు తెరిచి వరండా గడిచి, హాలు చేరుకున్నా మానవుల జాడ కనిపించలేదు ఆ భవంతిలో. బిక్కుబిక్కుమంటూ వుందది.

రెండంగలలో కారు చేరుకున్నాను, "అదే కల్పలతాదేవి అంతఃపురమయితే దానికో నమస్కారం. పద, వెనక్కి పోదాం. అదేం యిల్లు? దెయ్యాలకొంపయితే. ఆ యింట్లో మనుషులు ఇన్విజిబుల్‌గా కాలిలో తిరుగుతున్నారు. వాళ్లు దయ్యాలు. నీకెలా తెలిసిందంటావా? రెండుమాట్లు పిలిచాను. "ఎవరూ?" "వస్తున్నా"నన్న మాటలొస్తున్నాయి కాని వస్తున్న మనిషిజాడ లేదు."

"నీమొహం. నేను వస్తాను పద."

"ఉహుఁ. వస్తాను కాదు. వెళ్లు. నేను మటుకు మరి రాను," అన్నాను.

శశి బలవంతంమీద కుడివేపు ఇంట్లోకి వెళ్లేను. ఎవరో ఒకావిడ సోఫాలో కూర్చొని రేడియో వింటూ, పేపరు చదువుతూ, పనిమనిషికేదో చెప్తూనే నన్ను చూసి, "ఎవరు కావాలి?" అంది.

"మిస్. కల్పలతాదేవిగారిఇల్లు ఇదేనాండి?"

"ఇది కల్పలతాదేవిగారిల్లు కాదు గాని లత ఇక్కడే వుంది. లోపలికి రా," అంటూ పనిమనిషికి లతని పిలవమని చెప్పింది బహు దర్జాగా.

నేను "మీరు" అంటుంటే, "నువ్వు" అంటూన్న ఆమె అసభ్యతకి నొచ్చుకున్నా నా అవసరం కనక అట్టే పట్టించుకోకుండా గుమ్మంలోనే నిలబడ్డాను.

"లతా నువ్వూ ఒకే గ్రూపా?"

"ఏమోనండీ. నాది ఇకనమిక్స్ మెయిన్."

"ఓహో, నువ్వూ లతా ఫ్రెండ్సా?"

"ఊఁ, ఆఁ, ఫ్రెండ్సేనండీ. అంటే ఇప్పుడు నేనెందుకొచ్చేనంటే .."

"ఏదో మాట్లాడుకోవాలి. అంతేనా?"

"పెద్ద సీక్రెట్స్ ఏమీ కావండీ."

"అయితే తరవాత ఎప్పుడైనా మాట్లాడుకోవచ్చన్నమాట."

‘‘ఇప్పుడు వీల్లేదాండీ?’’

‘‘వీలులేకేం. వచ్చేస్తుంది. జస్ట్ ఎ మినిట్. ఇంతకీ నాకు చెప్పకూడని సీక్రెట్‌లా వుంది.’’

‘‘చెప్పనిస్తే. ఏంలేదండీ. ఈ ఎలక్షన్లలో ...’’

‘‘ఏమిటి? కాన్వాసింగ్‌కా?’’

నేను కూడా అంతగానూ ఆశ్చర్యపోయాను. నిజంగా కాన్వాసింగ్ అంత ఘోర అపరాధమని నాకు తెలీదంతవరకూ.

‘‘అయితే కమ్యూనిస్టువా?’’

‘‘కాదండీ.’’

‘‘పార్టీలతో నాకేం ప్రమేయం లేదండి.’’

‘‘ఐ సీ. ఎవరు కాఫీ ఇస్తే ...’’

తల తిరిగింది. కల్పలతా వద్దు, కామధేనువూ వద్దు, ముందీవిడని వదుల్చుకుంటే చాలు అనిపించింది.

‘‘నామాట విని ఇంటికెళ్లిపో. చదువుకునేవాళ్లు చదువుకన్నట్టుండక ఇవేం బుద్ధులు? బాగుపడే ఉద్దేశం లేదూ? కొలిస్తే జానెడు లేనివాళ్లకి ఇదేం జబ్బు - పార్టీలూ, ప్రచారాలూను. పెద్దవాళ్లేమో చచ్చీ చెడీ డబ్బు తెచ్చి చదివి ఏదో ఉద్ధరిస్తారనుకుంటే మీరేమో ప్రపంచాన్నే మరమ్మత్ చేయ సంకల్పిస్తున్నారులా ఉంది. నీకు ఎన్నేళ్లు? నీకు మార్కులెన్ని?’’’

ఆ తర్వాత తాడెక్కడో వదిలేసి, కార్లో నుండి, ‘‘ఇంటికి’’ అన్నాను నీరసంగా. కార్లో శశికి అంతా చెప్పాను.

‘‘కాలేజీ ఎలక్షన్స్ అని చెప్పలేదూ?’’ అంది.

‘‘టైమివ్వందే ఎలా చెప్పను?’’ అన్నాను.

ఆ సాయంత్రం అరుణాదేవి మాఇంటికొచ్చింది. మర్నాడు కాలేజీకి మామూలుగా వెళ్లాను.

శశి నావేపు కోరగా చూస్తూ దూరంగా కూర్చుంది. తనదగ్గిరికెళ్లి “విత్‌డ్రా చేసుకుంటున్నా” అన్నాను నవ్వుతూ.

“ఏడవలేకపోయావ్,” అని తను ముఖం చిట్లించి అంటుంటే నాకు నవ్వాగలేదు.

శశి ఒకనిముషం వూరుకుని అంది “నిన్న మనం వెళ్లింది ఎవరింటికో తెలుసా?”

“ఊఁ.”

“అరుణాదేవి ఇంటికి.”

ఒక్కనిముషం తనంటే ఏహ్యాభావం ఏర్పడింది. కవి అంటాడు ముందు దగా, వెనక దగా, కుడిఎడమల దగా దగా అని.

ముఖాముఖీ నాతో చెప్పి వుంటే. ...

000

(తెలుగు స్వతంత్ర ఆగస్టు 12, 1955.)

# 6. ‘‘ఋణానుబంధ రూపేణ ...’’

‘‘అయితే ఆ మిషను ఏమైంది మామయ్యా?’’ అన్నాను భయపడుతూ, భయపడుతూ.

ఆయన మామయ్య కాదు గానీ పెద్దవాళ్లని పేరు పెట్టి పిలవకూడదు కనక ...

‘‘చంపీశావ్, నేను మర్చేపోయాను’’ అన్నారు మామయ్య.

ఏంచెప్పను? ‘‘అఖిలభారత కుట్టుయంత్రాల’’చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన ఒక మహద్యంత్రాన్ని పట్టుకుని, ‘‘మర్చేపోయేను’’ అంటుంటే.

తనసొమ్ము కాదు గనకనే తీసుకెళ్లి ఎవరో చచ్చిపోయిన దివాన్‌గారి జవాన్‌కి (చచ్చిపోయింది జవాను) ఎరువిచ్చి తిరిగి చూడకుండా ఊరుకోగలిగేడు!

000

రెండు సంవత్సరాలక్రిందట --

తిథివారనక్షత్రాలన్నీ సమకూడిన ఒకానొక శుభసమయంలో టైలరు నాజాకెట్లు పాడుచేసి తీసుకొచ్చాడు.

‘‘ఒక మిషను కొనేద్దాం అమ్మా,’’ అన్నాను.

‘‘కొనేద్దాం,’’ అంది అమ్మ.

రెండురోజుల అనంతరం ‘‘మంగళవారం శంకరం మిషను తెస్తాడు,’’ అని చెప్పింది.

నేను సోమవారం వెళ్లి జాకట్ పీసెస్ తెచ్చేశాను.

మంగళవారం నేను స్కూల్‌నించి వచ్చేసరికి మిషను ఇంట్లో వుంది! నాపుట్టినరోజుకేనా అంత సంబ్రమం కలగలేదు! ఆతృతగా మూత తీశాను!

కళ్లు తిరిగాయ్!

‘‘సెకండ్ హాండా?’’ అన్నాను సహం చచ్చి.

"అయితే ఏం? మిషన్ చూడు," అన్నాడు శంకరం గంభీరంగా.

మరోమాటు చూశాను. దానికి షటిలూ, బాబినూ లేవు. హాండ్‌వీల్ వుంది కానీ దీనికి ఎటాచ్ చెయ్యాలి. కొన్ని స్క్రూస్ లూస్‌గా వున్నాయి. కొన్ని ఊడి రావడమే లేదు. మిషన్ అనిపించుకునే ఒక ఇనపడొక్కులో అంతకన్న ఉండగల లోపాలేమిటో నాకు తెలీదు.

ఎలాగైతేనేం, ఆ యంత్రాన్ని బాగుచేయడానికి ఇచ్చాం. పదిరోజులవుతుంటే, అది మనది కాదనీ, ఆ మిషన్‌గలవారు ఢిల్లీ వెళ్లిపోతున్నారనీ (అక్కడ రిపేర్ చేసేవాళ్లు లేరనీ!) యమర్జంటుగా కావాలనీ మంగళవారం ఇచ్చేయమనీ ఆ రిపేరర్‌కి చెప్పాం. ఆదుర్దా మరి!

"అలాగేనండీ" అన్నాడతను వ్యాపారలక్షణంగా.

పైన వివరించబడిన "మంగళవారం" మూడుమాట్లు గతించింది. నాజాకెట్ పీసెస్ అయితే పురుగులు కొట్టేశాయి కూడాను.

"చూడమ్మా చిట్టితల్లీ! స్కూల్నించి వచ్చేప్పుడు ఒకమాటు అడగవే, దార్లోనే కదా ఉంది," అని బతిమాలితే, చెల్లి మరీ ఎగిరింది, "నేను వెళ్లను ఆ షాపుకి. ఆ రాస్కెలు మనమాట వినిపించుకోడూ! దొరగారూ, తమర్నేనండీ అని చెప్పాలి. కలకత్తానించి సామాను రావాలంటాడు."

"కలకత్తా ఏమిటే? మాతో జర్మనీ అని చెప్పాడు."

"ఏమో నాకేం తెలుసూ!" అంది.

పచ్చి అబద్ధం. అమ్మతో నేఁ చెప్తుంటే అది వినడం నేను చూశాను. ఏం చెయ్యను? కాలగతి లెమ్మని ఊరుకున్నాను. అప్పటికి మిషనుమీద అభిమానం మూడువంతులు చచ్చింది.

"మంచి గొడవే తగిలించేవోయ్," అంది అమ్మ శంకరాన్నిచూడగానే.

"నేనేం చేశానండీ?" అన్నాడు తెల్లబోతూ.

"ఆ రిపేరరు చూడు ఏం చేస్తున్నాడో."

"ఇంతా చేస్తే అది పని చేస్తుందా?" అన్నాను నేను.

"చూస్తూ వుండు. అది ఎంత మంచి మిషన్ తెల్సా?"

‘‘చాలా మంచిది. అసలు అలెగ్జాండర్‌కి పురుషోత్తముడు పంపిన ఉత్తమకానుకల్లో ఇదొకటి.’’

‘‘ఇదేమాట గుర్తుంచుకో. ఆదివారం మిషన్‌ తెస్తాను,’’ అంటూ శంకరం వెళ్లిపోయాడు. సూర్యచంద్రులు గతులు తప్పకుండా ‘‘అన్నప్రకారం’’ ఆదివారం మామిషను మాకిచ్చేశాడు.

భోజనాలు సగం ముగించి గబగబ మిషనుదగ్గర చేరాం అంతా. అక్కకి కత్తిరింపులు వచ్చు కనక (నాకు రావు గనకనూ) అది కత్తిరించడానికీ, నేను కుట్టడానికీ ఒప్పందం అయిపోయింది.

‘‘నేను ఇది తిప్పుతానే,’’ అంటూ తయారయింది ముద్దులచెల్లి.

‘‘వీల్లేదు. వెళ్లు. ఆరువేలతొమ్మిదివందలఎనభైమూడుని అయిదులక్షలఅరవైమూడు వేలు పెట్టి హెచ్చించి తీసుకురా,’’ అన్నాను మందలింపుగా.

‘‘అమ్‌..మ్‌...మ్‌... మా’’ అంటూ అది కెనడియన్‌ ఇంజనులా కూత పెట్టింది.

‘‘స్‌...స్‌...స్‌ ముయ్యి నోరు. నడు అవతలికి. లెఖ్ఖలు చెయ్యకపోతే నాన్నగారితో చెప్తాను. తెలుస్తోందా?’’

‘‘అయితే నాకు రుమాళ్లు కుట్టిస్తావా?’’

‘‘నీకెందుకూ రుమాళ్లు?’’

‘‘అన్నీ మాసిపోయేయి.’’

‘‘నాన్సెన్స్‌. నీదగ్గర మాయడమేమిటి? రంగు మారుతుందంతే. నిప్పుల్లో వేస్తే కాలవు. నీళ్లల్లో వేస్తే నానవు నీ రుమాళ్లు.’’

‘‘అం ...మ్‌....మ్‌..’’ రెండో ప్రసారంతో అక్క బాధ పడింది.

‘‘అబ్బబ్బ కుట్టిస్తాననకూడదా. నువ్వెళ్లు చంపకం, వూరికే చంపక. నేను కుట్తాను,’’ అంది.

‘‘చూడు కుట్టినవి’’ అన్నాను రెండు అక్కముందు పడేస్తూ.

‘‘రెండింట్లోనూ మూడోది బాగా వచ్చినట్టుంది’’.

‘‘అబ్బే. ఇదీ ఇక్కడ కుట్టు బాగానే వచ్చింది,’’ అంది క్రింద మడిచిన అంచు చూపిస్తూ.

''అవును సుమా,'' అన్నాను. అక్కడ అసలు కుట్టు పడనేలేదు!

''ఆమాత్రం చేతకాదూ,'' అనేసరికి నాకు అభిమానం నిజంగానే దెబ్బ తింది.

''ఊఁ. గీతలు గీసుకుని చకచక కత్తిరించేసినట్టే? ఇవతల మడత చూసుకోవాలి. అవతల బాబిన్‌లో దారం చూడాలి. లైను తప్పకుండా చూడాలి. సూది దగ్గర దారం చూస్తే నాన్‌కోఆపరేట్ చేస్తూంది. Needle and thread raceకి బాగా ప్రాక్టీసు అవుతోంది. ఎన్ని పాట్లు ఈ బొక్కిమిషనుతో. కత్తిరింపులకేముంది, మూడేళ్లపిల్ల చెయ్యగలదు కత్తెర అందిస్తే,'' అన్నాను. ఎంత కొత్త పార్టులు వేసినా అది సెకెండ్ హాండే మరి!

000

మూడు నెలలు గడిచిపోయేయి.

ఒకరోజు మామూలుగానే స్కూలికి వెళ్లేను. స్కూలు అయిపోగానే మామూలుగా తిరిగిరాగానే మామూలుగా కనిపించే మిషను కనిపించలేదు.

''చంద్రం వచ్చాడు. అతనికూతురు అదేదో పరీక్షకెళ్తోందిట.''

''అదేదో పరీక్షకి ఆవిడెవరో వెళ్తే మనమిషను ఎందుకు?''

''నాలుగురోజులు వాడుకొని ఇచ్చేస్తానన్నాడు,'' అంది అమ్మ.

ఆవేళ (ఆవేళనించీ) మిషను అవుసరమయిన పనులెన్ని నాకు తటస్థించేయో లెఖ్ఖ లేదు. గత రెండు నెలలనుంచీ కనిపించని గలీబులూ, జాకెట్లూ, రుమాళ్లూ ఒకటేమిటి అన్నీను. అదే కాబోలు మానవనైజమంటారు.

బర్మాషెల్ కేలండరుప్రకారం ఎనిమిదినెలలు గడిచేయి కానీ మామయ్యలెక్క ననుసరించి నాలుగురోజులు అవలేదు. (ఇటువంటి విషయాల్లో ఆయనది బ్రహ్మకల్పం అనుకుంటా!). ఆ తరువాత రెండుసార్లు కనిపించాడు కానీ ఈ విషయం ఎత్తితే ''రేపు పంపించేస్తాన్లేవే'' అనేవాడు మొహం చిట్లించి.

ఏదో పనిమీద ఢిల్లీ వెళ్లిన శంకరం ఆ రోజే వచ్చాడట. మర్నాడు మాయింటికి వచ్చాడు.

''అన్నట్టు మిషనేదీ? వర్కింగేనా?''

''వర్కింగ్ కాదు. వాక్ అవుట్ అయింది.''

"ఏమయింది?"

"మా చంద్రంమామయ్య లేడూ? ఆయనేమో కూతురు కుట్టుపరీక్షకెళ్తోందని ఇది తీసుకెళ్లి ఎవరో చచ్చిపోయిన దివాన్‌గారిజవాన్‌కి ఎరువిచ్చాడట."

"అదేమిటి?" అన్నాడు శంకరం ఏం అర్థం కాక.

"ఏమీ లేదు. ఇక్కణ్ణుంచి తీసుకెళ్లిపోయాడు. అదీ ముఖ్యవిషయం. ఇప్పుడేమో అంతటి జవాన్‌గారికి ఎరువిచ్చి తిరిగి పుచ్చుకోవడమేమిటని గప్‌చిప్‌గా ఊరుకొన్నాడు," అన్నాను కసిగా.

"ట్రాజెడీయే చేశారు మొత్తానికి," అన్నాడు శంకరం వెనక్కి జేరబడుతూ.

"ఏం?" అంది చంపకం.

"అది మాది కాదు. మాఅమ్మ తల్లి ఎండ్ పినతల్లికి కామన్ ప్రాపర్టీ. అదే - ఆ బాబిన్, షటిలూ అన్నీ పినతల్లిదగ్గిర ఉండిపోయేయి చిన్నఫైట్‌లో."

నాకర్థం కాలేదు. ఫైట్ జరిగితే కేవలం షటిలూ, బాబిన్ ఊడదీసి పట్టుకుపోవడం ఏమిటి? ఆమాటే అంటే అతనికీ అర్థం కాలేదు.

"అదంతా నాకు తెలీదు. ఇంజినీరుని కనక బాగుచేసుకో అని మనకి ప్రెజెంట్ చేసేసింది. ఇంతకీ ఇప్పటి కథాభాగం ఏమిటంటే ఆవిడఅమ్మాయేమో అది కావాలంటోందిట. అక్కడ బాగుచేసుకుంటాం పంపించమని వ్రాసింది."

"ప్రెజెంట్ చేసినది తిరిగి తీసుకోవడమేమిటి?" అన్నాను, అంతకన్నా ఏమీ చెప్పలేక.

"ప్రెజెంట్ అంటే అదే రిపేరు చెయ్యమని," అన్నాడు నవ్వుతూ.

"అయితే ఇవాళ సాయంత్రం ఆయన వస్తారు. అడుగుతా," అన్నాను ఏదో ఒకటి చెప్పాలి కనక.

సాయంత్రం నిజంగానే మామయ్య వచ్చారు. అర్జంట్ పనిమీద అమెరికా వెళ్లి ఇప్పుడే వస్తున్నారుట.

అడగనా వద్దా అని ఆలోచిస్తున్నాను. శంకరంకి ఏం జవాబివ్వాలని కాదు, శంకరం వాళ్లమ్మమ్మకి ఏం జవాబు చెప్పుకుంటాడనీ కాదు నాబాధ - ఎవరో నామరూపాలు

తెలియనివాళ్లయంత్రం తెచ్చి మేం బాగు చేయిస్తే, మరొకరెవరో వాడుకుంటున్నారే! ఏమనాలి దీన్ని?

000

(తెలుగు స్వతంత్ర ఆగస్టు 26, 1955).

# 7. అసహజం

తను "చదువుకున్నది". తను చదువుతోంది. నడతలో, నడకలో, మాటలో, నీటులో తను "చదువుకున్నది". మనిషికీ మృగానికీ - చదువుకున్నవాళ్లకీ చదువుకోనివాళ్లకీ మధ్య గల తేడా తనలో స్పష్టంగా ప్రతిబింబోస్తోందని తన అభిప్రాయం. తనకి అభిప్రాయాలు వున్నాయి. సర్వమానవసౌభ్రాతృత్వంమీద నమ్మకం వుంది. జీవితం అంటే నిర్దుష్టమైన నిర్వచనం వుంది. తను మాట తూలదు. ఎవరైనా మాట తూలితే సహిస్తుంది. మనిషికి మేధస్సుంది. కనక మనిషి అసందర్భంగా, అసంబద్ధంగా అప్రాకృతంగా మాటాడవలసిన అవుసరం లేదు అని తన అభిప్రాయం.

సాన పట్టనిదే వజ్రమైనా ప్రకాశించదు కనక, పందిరి లేనిదే లతలు ననలుతొడగవు కనక, బంగారప్పళ్లెరానికైనా గోడచేరుపు అవుసరం కనక, ప్రతిమనిషీ మనిషి కావడానికి ప్రాథమికవిద్య అవసరం. అందుకనే విద్యలేని పనిపిల్ల అమాయకంగా మాటాడినప్పుడు తనకి జాలి వేస్తుంది. దానికి లాజికల్‌గా మాటాడడం నేర్పాలని తను పాటుపడింది కాని ఆ యత్నం ఫలవంతం కాలేదు.. దానికి కారణం సామాజికవ్యవస్థలో రావలసిన మార్పు ఇంకో రెండు తరాలదాకా రాదు అని తెలిసిపోయింది తనకి. అంచేత తను ఆ పనిపిల్లకి అక్షరజ్ఞానం కలిగించే ఉద్దేశానికి ఉద్వాసన చెప్పింది. కాని ఆ పనిమనిషి ఎంత పనికిరానిమనిషో తెలియజెప్పవలసిన రోజు వచ్చింది ఓరోజున. తను స్వచ్ఛమైన తెలుగులో "తూర్పోళ్ల యాస"తో సహా చెప్పినా ఆ పిల్ల అర్థం చేసుకోలేదని ఋజువు చేసుకునేదినం ఆసన్నమయింది.

ఆ ఫలానా రోజున కాలేజీలో ఒక సభ జరగబోతోంది. అన్నిసభల్లా రెండు పూలకుండీలూ, ఒక టేబులు క్లాతూ, మూడు పూలమాలలూ ఉంటే తప్ప జరగని సభ అది. కార్యనిర్వాహకవర్గం అదృష్టవశాత్తు లేక స్వశక్తిసామర్థ్యాలవల్ల అన్నీ సేకరించగలిగారు కానీ పూలకుండీలు దొరకలేదు. ఆ రెండు అమూల్యమైన వస్తువులకొరకూ విశాలమైన ఆ

మహాపట్టణంలో వెతుక్కుంటూ తిరిగే టైము లేదు కనక, అన్నిటికంటె దగ్గరలో అందుబాటులో తన ఇంటిలోనే లభ్యం కనక తనఇంటికి జాయింట్ సెక్రటరీ దాసు వచ్చేడు.

తను కూడా ఆ సభకి హాజరు అయి సభని జయప్రదం గావిస్తే బాగుంటుందని కూడా సూచించేడతను. అంత మర్యాదగానూ అసమ్మతిని తెలియజేసింది తను. నిజానికి తనకి మనసులో రావాలనే వుంది కానీ వొంట్లో బాగులేదు. చాలా విచారించదగ్గవిషయం. పూలకుండీలు మాత్రం సంతోషపూర్వకంగా ఆ సభకి అప్పివ్వగలదు. కాని తనదగ్గరున్నవి ఇత్తడివి. చింతపండుతో తోమి, బ్రాసోతో పాలిష్ పెడితే తప్ప అవి రాణించవు. తన పూలకుండీలకి పూర్తిగా న్యాయం చేకూర్చడంవిషయంలో సహజంగా సంపూర్ణాంగీకారం తెలిపాడు ఆ జాయింట్ సెక్రటరీ. పదినిముషాల కాలాన్ని వెచ్చించడానికి అతడు సిద్ధమే.

అంతసేపు అతను నించోడం తన మర్యాదకే భంగం అని అప్పుడే తోచింది. చాలా బలవంతం చేస్తే తప్ప అతను కూచోడానికి సమ్మతించలేదు. అతను చాలా మర్యాదస్తుడిలా కనిపించాడు తనకి. ఒక కప్పు కాఫీ ఇస్తే బాగుంటుందని కూడా తట్టింది. అక్కడ మొదలయింది చిక్కంతా.

కాఫీ పెట్టడానికి ఇంట్లో పాలు నిండుకున్నాయి. తను అంత తొందరపడి ఆ సదుద్దేశాన్ని అతనితో చెప్పకపోతే, ఆ మానవుడు వద్దు వద్దని ఎంత మొత్తుకుంటున్నా తను వినకుండా, నో, నో, యూ మస్ట్ టేకంటూ అనకపోతే తనీ చిక్కులో ఇరుక్కోకపోను. కాని జరిగివుండవలసినదాన్నిగురించి వగచి ఏంప్రయోజనం? పెరటిదారిన అతిదగ్గరగా వున్న అయ్యరుహోటేలుకి పనిపిల్లని పంపడం తప్ప చేయగలిగిందేముంది?

పనిమనిషి కాఫీతో వచ్చేవరకూ అతన్ని ఊరికే కూచోపెట్టడం బాగుండదు కనక సంభాషణకి ఉపక్రమించింది. దాసుకి మనసు సంభాషణమీద కాక కాలేజీలో సభాంతరాళమందు ఇంకను జరగవలసిన పనులమీదున్న కారణాన తనొక్కతే మాటలాడుతున్నందున అయిదు నిముషాల్లోనే అన్ని సబ్జెక్టులూ సర్వే అయిపోయేయి. లోపల్నుంచి కాఫీ మటుకు రాలేదు.

తనే మళ్లీ ప్రస్తావన మొదలెట్టింది. "మనుషుల్లో ఎంతటి చిత్రమైనవాళ్లు ఉంటారో. మా సర్వెంటు మెయిడుకి వున్న మొండితనమూ, తలతిక్కా, కృత్రిమనాగరికతా, కుతర్కమూ చూస్తే భూమండలం అంతా వెతికినా మళ్లీ దానిలాటిది దొరుకుతుందనుకోను. ఏదైనా చెప్తే అర్థం చేసుకో నిరాకరిస్తుందంతే. ఆమనిషి తత్త్వం ఆలోచించండి. సరిగ్గా ప్రతిరోజు నేను పొద్దున్నే చదువుకోడానికి కూర్చున్నక్షణానే స్నానానికి నీళ్లు సిద్ధం చేస్తుంది. సాయంత్రంవేళ సరీగ్గా నా బాటనీ రికార్డులు ముందేసుక్కూర్చునేవేళకి చీపురు పట్టుకు తయారవుతుంది ఊడుస్తానంటూ. సవాలక్షసార్లు చెప్పాను ఎవరైనా వచ్చినప్పుడు చీపురుకట్టొకచేతా మాసిన అట్ట మరోచేతా పట్టుకు తయారవొద్దని. కాని ఆ అవతారంలో దర్శనమివ్వడం సరదాయేమో దానికి."

దాసు ఏదైనా అనకపోతే బాగుండదన్నట్టు, "బహుశా చుట్టాలొచ్చేవేళా, మీగది శభ్రపరిచేవేళా అనుకోకుండానే ఏకమవుతామో," అన్నాడు.

తన ఊహకి ఆ పాయింటు అందలేదు. "వచ్చినచుట్టాలు వెళ్లేవరకూ ఆగలేదూ?"

"దానికి ఇంట్లో మరేం పని ఉండదా?" అన్న ప్రశ్న తట్టింది కాని దాసు ప్రశ్నించలేదు.

"ఏదైనా చిన్నపని దానిచేత చేయించాలంటే ఎక్స్ట్రా ఇచ్చుకోవాలి."

దాసు మరొకసారి నిందితురాలిని బలపరిచే ప్రయత్నం చేయకుండా ఉండలేకపోయాడు. "డబ్బుకి చాలా ఇబ్బంది పడుతోందేమో."

"ఓహ్, నాన్సెన్స్" అనేసి నాలుక్కరుచుకుంది తను.

దాసు వీధిగుమ్మంవేపూ, గోడగడియారంవేపూ మార్చి మార్చి చూశాడు. మీటింగు అయిదు గంటలకి మొదలు పెట్టాలి నిర్ణీతసమయాన్ననుసరించి.

గోడమీద గడియారం అయిదుగంటలు కొట్టింది.

తనకి హఠాత్తుగా తట్టింది ఒక క్లాస్‌మేట్‌తో మాటాడడానికి "మా పనిమిషి" అనే విషయం ఏమంత మెచ్చతగ్గవిషయం కాదని. సిగ్గుతో మొహం కందిపోయింది.

"అమ్మగారూ" అంటూ లోపల్నించి కీచుగొంతు వినిపించింది. ఆ స్వరానికి ఇద్దరూ - వేరు వేరు కారణాలకే అయినా - తృళ్లిపడ్డారు. తను లేచి ఆ పనిపిల్ల అలా అసహ్యంగా

అరిచినందుకు బుద్ధి చెప్పడానికీ, కాఫీ తేవడానికీ లోపలికి వెళ్లింది. ఆ పిల్ల ఫ్లాస్క్ అందిస్తూ,, తడబడుతూ, వగరుస్తూ  చెప్పింది - దగ్గర్లో వున్న మూడు హోటళ్లకీ ఆ శుభదినాన శలవనీ, నాలుగో అతిదగ్గర హోటలు వూరికి రెండోచివర వుందనీ. దానికి వున్న ఒక్కగుండెతోనూ అమ్మగారి ఆజ్ఞకి విరుద్ధంగా రిక్తహస్తాలతో రావడం అసాధ్యం.

తను దాని కంఠస్వరం విషయంలో ఒకటి రెండు మాటలు అని, రెండుకప్పులలో కాఫీతో డ్రాయింగురూములోకి వచ్చింది. మందహాసం చేస్తూ ఆలస్యానికి క్షమిస్తారనుకుంటానంది.

దాసు మొహమ్మీద పెచ్చులూడిన పాతగోడలాటి నవ్వొకటి విరిసి మాయమయింది. ఒక్కగుక్కలో కప్పు కాఫీ నోట్లో పోసుకుని, ఆతిథ్యానికి కృతజ్ఞతలు చెప్పి రేస్‌లో రన్నర్‌లా గుమ్మం దాటేడు.

ఆ తరవాతిక్షణంలో చిన్నరకం దొమ్మీ అయినట్టు అయి, "ఆహ్", "ఇదేమిటి", "నువ్వు" "నువ్వు" వంటి రకరకాల శబ్దాలన్నీ కలిసికట్టుగా వినిపించేయి. తను కళ్లు గట్టిగా మూసుకుంది. రెండు చేతులూ రెండు చెవుల్నీ పరిరక్షించాయి. ఒక్క నిముషంసేపు అలా నిలబడిపోయింది స్థాణువై. తనచెవుల్ని తను నమ్మగలిగితే, "నువ్వు ఇక్కడికెందుకు వచ్చావు?" అని అడుగుతున్న మనిషి తన దాసి.

"నువ్విక్కడ పని చేస్తున్నావా?" అని అడుగుతున్న మనిషి జాయింట్ సెక్రటరీ దాసు.

మూడోనిముషంలో తను గుమ్మందగ్గిరికి వచ్చేవేళకి కిందపడిన పనిమనిషిని లేవదీసే ప్రయత్నంలో వున్నాడు దాసు. "అది" పగిలినగాజు పెంకులు ఏరే ప్రయత్నంలో వుంది. దాసు కూడా గాజుపెంకులు ఏరుతున్నాడు వంగి.

"హే భగవాన్, అరెరె, మీకెందుకు శ్రమ. అది తీస్తుందిలెండి. నే చెప్పలేదూ దాని పొగరు. మీకు తెలుసులా ఉంది ఈ మనిషిని."

దాసు గాజుపెంకులు అన్నీ తీసేసినట్టు పూర్తిగా నమ్మకం కుదిరాక, మెల్లిగా తలెత్తి, "తెలుసు. అది నాచెల్లెలు" అన్నాడు.

తను గతుక్కుమంది. కాలేజీలో సర్వసాధారణంగా తన క్లాసుమేట్సు ఎందుకు అతనిచేత బెంచీలు మోయిస్తారో, సార్థకనామధేయుడని ఎందుకు అవహేళన చేస్తారో ఇప్పుడు పూర్తిగా అర్థమయింది.

మర్నాడు ఆ అమ్మాయి పనిలోకి రాలేదు. తను ఎదురు చూసినట్టు జీతండబ్బుల కోసమూ రాలేదు. ఆ సాయంత్రం దాసు మామూలుగా పూలకుండీలు ఇచ్చేయడానికి వస్తే కూచోమని చెప్పడానికి తను నేర్చుకున్న విద్యలన్నీ, తన నాగరికత అంతా, సంస్కృతి అంతా, తన మేనర్స్ అన్నీ కలిసి తనచేత ఒక్క పలుకు కూడా పలికించలేకపోయాయి. అతని చెల్లెలికివ్వవలసిన రెండురూపాయలూ అతనికి ఇవ్వాలో ఇవ్వకూడదో తను నేర్చుకున్న సభ్యత చెప్పలేదు.

దాసు కృతజ్ఞతలు చెప్పి వెళ్లిపోయాడు.

తరవాత దాసు కాలేజీలో కనిపించినప్పుడు అతన్ని మీరు అనలేకపోయింది. నువ్వు అనే ధైర్యం లేకపోయింది.

కథ అసహజంగా ఆగిపోయింది.

000

(1955 ప్రాంతాల్లో విశాఖవాసులు మసూనా (మండా సూర్యనారాయణగారు) కొంతకాలం నడిపిన విశ్వవీణ పత్రికలో ప్రచురింపబడింది.).

# 8. మాతోటలో

‘‘ఇదుగో ఇదే ఆఖరు, మరి నీ ఇష్టం,’’ అంది అత్తయ్య అయిదోమారు మొక్క అందిస్తూ.

ఇదివరకు నాలుగు మొక్కలు ఆవిడచేత్తో ఇచ్చినవే అదే వరసక్రమంలో భూస్థాపితం చేసేశాం. తగుమాత్రం బాధ పడ్డాం కూడాను అలా జరిగినందుకు. అంచేత వేసంగిలో ఏమైనా సరే దక్షిణగాలి మా సంపెంగమొక్కమీదుగా వీచాలి అని మేం గట్టిగా నిశ్చయించుకున్నాం. ఎందుకైనా మంచిదని మాబాబు మరొకమొక్క కూడా తెచ్చాడు. రెండూ కలిపి నాటాలి, ఒకవేళ ఒకటి చస్తే ఏది చచ్చిందో తెలీకుండా (రెండూ చస్తే తగుపే లేదు.)

ఏదైనా మేకింగులో వున్నప్పుడు చూడకూడదు అంటుంది మా అక్క.. అందుకే కాబోలు పెద్దవాళ్లు వంటిల్లు మొగవాడు చూడకూడదు అంటారు. ఏమైనా మా ‘‘తోటపని’’లో నావంతు మటుకు సూపర్విజను. ఎప్పుడైనా తోస్తే మాట సాయం చేస్తా. అంతే. గొప్పులు తవ్వడం, నీళ్లు పోయడం, పురుగు పట్టకుండా చూడడం, పట్టేక చూడడం - ఇవన్నీ అక్క వంతు. అసలు నిజానికి నాపనే కష్టం అని మా అమ్మ చెబుతూ వుంటుంది. మరి మా అక్కది కాయకష్టమూ, నాది తలతో పనీను. ఈ సందర్భంలో నేను బోలెడు కథలు చెప్పగలను. ఇప్పుడెందుకు గానీ ...

మా ఇంట్లో  బొప్పాయిచెట్లు బ్రహ్మజెముడు డొంకల్లా పెరుగుతాయి మాకు ఇష్టంలేదు కనక.  జామిచెట్టూ, సన్నజాజి చచ్చినా పెంచలేకపోయాం. కారణం భూసారం అంటుంది మాఅమ్మ. మా అక్క హస్తమ్మీద ‘‘మాచెడ్డ నమ్మకం‘‘ మాకు.

మొత్తంమీద సంపెంగచెట్టు బాలాప్రాయంలో బాలారిష్టాలు గడిచి ‘‘నూనూగు మీసముల నూత్న యౌవనం’’ ప్రవేశించేసరికి అయిదేళ్లు పట్టింది. మాపక్కింటి మామయ్యగారింట్లో కొత్తగా పుట్టిన చిన్నారిపాప అక్షరాభ్యాసం చేసుకుంది. హైస్కూల్లో అల్లీ బిల్లీ తిరిగిన నేను యూనివర్సిటీ స్టూడెంటునయ్యాను. మా సంపెంగ మొగ్గ తొడగలేదు.

అందరూ "తొడుగుతుంది, తొడుగుతుంది" అన్నారు. స్వాతివానకి ముత్యపుచిప్పలు ఎదురు చూస్తాయంటారు. మేం మటుకు సంపెంగ మొగ్గకోసం పడ్డ వేదన అనుభవైకవేద్యం.

మేం అంటే మా ప్రియమైన సంపెంగికి దిక్పాలకులం అన్నమాట. మొక్కకి పశ్చిమాన సాయంత్రంవేళ డాబామీదా, అపరాహ్నం ఆ పక్కనే ఉన్న చిన్న కొట్టుగదిలోనూ నా స్థిరనివాసం. పోతే తూర్పుదిక్కున మా అప్పాయమ్మా, దక్షిణదిక్కున పక్కవాళ్ల అప్పాయమ్మా ఓ కన్ను వేసి వుంచారు. మొక్కకి ఉత్తరదిశన కొత్తగా అక్షరాభ్యాసం చేసుకున్న పాప నోల్ మోనార్కు. అటువేపు మేం ఎవ్వరం చూడరాదు అన్నది షరా.

మొక్క తాలూకు పేరు మట్టుకు మా అక్క సంరక్షణంలో సదా వృద్ధి పొందుతోంది.

రోజూ పొద్దున్నే చూసేదాన్ని  అందినకొమ్మనల్లా వంచి. ఎక్కడా కనుచూపుమేరలో - అదే ఆ కొమ్మ చివుళ్లలో - మొగ్గలాటిది కనిపిస్తుందేమోనని. కనిపించేది కాదు. దేముడు బొత్తిగా లేడనిపించింది ఆఖరికి. కానీ, పసిపిల్లలు ప్రత్యక్ష దేముళ్లు అంటుంది మా అమ్మ. నిజమే కాబోలు. లేకపోతే డాబామీంచి నాకు కనిపించని మొగ్గ పక్కపెరట్లో ఆ పాపకెలా కనిపించింది? ఆ రోజు మాయింట్లో పండుగ చేసుకున్నాం. అదే, మామొహాలు చూసినవాళ్లు అలా అనుకుంటారు.

చంద్రుడిలో మచ్చలాగ మాలో చిన్న సందేహం మెరిసింది. ఆ ఒంటరి మణిపూస ఏ ఒక్కరికి చెందాలి? అది చిటారి కొమ్మన గగనంలోకి దృష్టి సారించింది చూపరులని ఊరిస్తూ. అక్కది నిష్కామకర్మ. నాది "పుష్పవిలాపం" రచయిత మనసు. పాప మటుకు అది తన హక్కుభుక్తములుగా భావించింది. మిగిలిన ఇద్దరు దిక్పాలకులూ - మా అప్పాయమ్మా, పక్కింటి అప్పాయమ్మా - కొంచెం ధైర్యం తక్కువరకం వాళ్లు.

"తొలిపంట దేముడికివ్వాలి," అంటుంది మామ్మ.

"ముందసలు అది పూర్తిగా పుయ్యనియ్యండి," అంటుంది అమ్మ.

మేం దాన్ని పుయ్యవద్దంటే కదా!

అయిదోరోజు సాయంత్రానికి మొగ్గ విడే లక్షణాలు కనిపించేయి. మామనసులు కేరింతాలు కొట్టేయి.

“అయితే దాన్ని కొయ్యడం ఎలా?” అన్నాను. పుష్పంమీద గోరానితే నా మనసు గిలగిల్లాడుతుంది అని ఇప్పటివరకూ ఎవరూ గ్రహించలేదు. కానీ ఏమైనా నా సందేహం ఓడు కాలేదు.

మర్నాడు తెల్లవారుఝామునే లేచి, స్నానాదికాలు ముగించి సంపెంగచెట్టుకింద సమావేశమయ్యాం. నేను మంచి పొడుగైన వెదురుకర్ర పందిరిలోంచి అమ్మ చూడకుండా లాగేశాను. పాప వాళ్లన్నయ్య పుస్తకాలడ్రాయరులోంచి చిన్నచాకు - చోరద్రవ్యమే - తీసుకొచ్చింది. మాబాబు దొసెకర్ర తయారు చేశాడు. ఆరున్నరా, ఏడయేసరికి పొలోమని చెట్టుమీద పడ్డాం అందరం. గగనమార్గాన గాలిలో కులాసాగా ఉయ్యాలలూగుతూ ఉంటే ఆ మొగ్గని పట్టుకోడం మాకు తలకు మించిన పనయింది. సగం సగం విడుతూ నీరెండలో నిగనిగలాడుతూంటే నాకు నిజంగా పుష్పవిలాపం జ్ఞప్తి కొచ్చింది.

“నాది కూడా కవిహృదయమేమో,” అన్నాను సాలోచనగా, జాలిగా చూస్తూ.

అందరూ విరగబడి నవ్వేరు.

హమ్ అంటూ బాధగా మూలిగేను. అందుకే కదూ “అరసికాయ కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ,” అని మొత్తుకున్నాడు ఆయనెవరో ..

“మమ్మల్నిలా నాశనం చేస్తే మీకేమిటి లాభం?“ అన్నాయి చాకుకి తగిలి రాలిన రెండు రేకులు.

“మీబాధ నాకర్థం అయిందిలే“ అన్నాను మూకగా వాటివేపు చూస్తూ.

మొత్తమ్మీద శ్రమపడి రేకులు రేకులుగా పువ్వంతా రాలగొట్టేం. నిజానికి ఈ కిరాతకృత్యంలో నేను మనసా పాల్గొనలేదు. అంతమాత్రంచేత పువ్వు రాలగొట్టిన కీర్తిలో నా పాలు నాకు రాకుండా పోలేదు.

మర్నాడు పొద్దున్నే పాప వచ్చింది. నాకింకా నిద్రమత్తు వదల్లేదు.

“అక్కల మూలు పూలు కాతేయి” అంది.

మూడు! గ్లోరియస్!

"ఎక్కడ?" అన్నాను.

"మూలు కాతేయి అక్కల" అంది చేతులు తిప్పుతూ.

"మరి మీ తపోతా తెత్తు పూతిందా?" అన్నాను నవ్వుతూ.

"తపోతా తెత్తు పూత్తుందేమితి?" అంది నన్ను నిలదీసి.

"అబ్బో చాలా తెలుసే" అన్నాను అట్టే పెంచకుండా.

వారంరోజులు తిరిగేసరికి మా చంపకవృక్షం జత పువ్వులు అందించే స్థితికొచ్చింది. పంపకం నావంతు. బాగుండదని ముందురోజు మా అక్కకిచ్చేను. రెండోరోజు పాపకిచ్చాను. తరవాతి ఛాన్సు మామ్మది అంటే నిర్గుణస్వరూపుడయిన దేముడిది. వంటింట్లో దేముడిపట్టు వెనక సంసారం సాగిస్తున్న మూషికమహారాజుది. ఆ తరవాత అహం బ్రహ్మాస్మి.

ఆరెంజిరంగు చీరెమీద అద్దాలు కుట్టిన నల్లబ్లౌజు వేసుకున్నాను. నల్లని ముఖమల్ చెప్పులూ, కళ్లకి కాటుకా, తల్లో సంపెంగపూలు - ఒకటీ రెండూ కాదు నాలుగు పెట్టుకుని బస్సెక్కుతుంటే ఎంత గర్వంగా అనిపించిందనీ ... .. అదే అంత గర్వం కూడదు. కాకపోతే ఏమని చెప్పను? కుంజరయూధము దోమ కుత్తుక నొచ్చితే ఎలాటి ఫీలింగులు కలిగేయో నాకు తెలీదు కానీ నా సంపెంగిపూలమీద ఒక్క అమ్మాయి అయినా కామెంటు చెయ్యకపోవడం నా ఆత్మగౌరవానికి గొడ్డలిపెట్టు. అంతకంటే ఘోరం డిపార్ట్‌మెంటులో ప్యూను అడగడం.

‘‘మీ ఇంట్లో పూసేయాండీ?’’ అన్నాడు మొహం చింకి చేటంత చేసుకుని.

‘‘ఊఁ,’’ అన్నాను మామూలుగా.

‘‘నాకు తెచ్చియ్యరండీ?’’ అన్నాడు మళ్లీ అవే హాసరేఖలు మొహంమీద మెరుస్తూంటే.

తృళ్లిపడ్డాను. హైరోడ్ క్రాపు పెట్టించుకున్న ఒకానొక మొగజీవికి సంపెంగిపూలెందుకూ?

‘‘నువ్వేం చేస్తావు?’’ అన్నాను నవ్వుతూ.

‘‘మా పిల్లకిస్తానండీ,’’ అన్నాడు తెగ సిగ్గు పడిపోతూ.

వెయిటింగ్రూంలో ఆడపిల్లలందరూ ఒక్కమారు గొల్లుమన్నారు. నేనింక అక్కడ వుండడం క్షేమం కాదని మెల్లిగా జారుకున్నాను పుస్తకాలు సర్దుకుని.

ఆ సాయంత్రం ఇంటికొచ్చేసరికి అక్కచేతిలో ఓ కార్డుముక్క కనిపించింది.

“రేపు పువ్వులు కోయ్యడానికి ఆర్డర్లు లేవుట,” అని పాప చెప్పింది. ఇది కొత్త అలవాటు మాయింట్లో.

“ఎందుకని?” అన్నాను కొంచెం ఆశ్చర్యపోతూ.

“మా ఫ్రెండు కలకత్తా వెళ్తోంది. స్టేషనులో కలుసుకోమని రాసింది,” అంది కార్డుతో విసురుకుంటూ.

“దానికి పూలగుత్తీ వైజయంతీమాలా పట్టుకెళ్తావా?” అన్నాను హాస్యంగా.

“ఏం పట్టుకెళ్లకూడదా?” అంది లాయరులాగ.

“నాకేం. పట్టుకెళ్లు, అసలు పువ్వులు పంపించి నువ్వు మానేయ్”

“తనకి సంపెంగి అంటే చాలా ఇష్టం.”

“బాగుంది. సంపెంగిపువ్వులన్నా గొడ్డుఖారం అన్నా సరదా పడనిదెవరు నేనూ అమ్మా తప్పించి,” అన్నాను గుంటూరు ఫ్రెండుని తలుస్తూ, అమ్మని చూస్తూ.

“ఊఁ బాగుందే నీ సరసం. కల్లా కపటం లేకపోతే కన్నతల్లితో సరసం ఆడమనీ,” అంది అమ్మ, మావాదోపవాదాలు పండు మిరపకాయపచ్చడిలా అనిపించి కావచ్చు.

మెయిల్ మరో అరగంటకి వస్తుందనగా తాజాగా అప్పటికప్పుడు కోసి, తడిగుడ్డలో జాగ్రత్తగా చుట్టి పట్టుకెళ్లేం ఆ పువ్వులు నేనూ, అక్కా.

ఆ కంపార్ట్‌మెంటు వాళ్లకోసం స్పెషల్‌గా వేసేరుట. చుట్టలూ, ముష్టివాళ్లూ, మురికిగుడ్డలూ - అదే చివరి బోగీ. గాంధీ ఇలాటి పెట్టెల్లోనే ప్రయాణం చేసినట్టు పెద్దవాళ్లు చెప్తుంటే చాలాసార్లు విన్నాను. అప్పట్లో థర్డు క్లాసులో ఫానులు కూడా వుండేవి కాదుట. ఎంత కష్టపడి ఉండాలో ఆలోచించు అన్నారు పైన చెప్పిన పెద్దవాళ్లు. మరి ఇలాటి సహప్రయాణీకులు ఆ రోజుల్లో ఆయనకి దొరికారా ఎప్పుడయినా? నేను అడగలేదు. అలా అడగడం అవిధేయతకింద వస్తుంది కదా!

“ఈ సంపెంగిపూల వాసనలు ఈ చుట్టపొగలమధ్య వింత పరిమళాలు వెదజల్లుతున్నాయి ఉగాదిపచ్చడిలాగ,” అంది మాఅక్క స్నేహితురాలు.

''జీవితం అంటే అదే మరి,'' అంది పైగా. నిజమేననిపించింది నాకు. ఇంతటి గుణపాఠం నేర్పిన మా సంపెంగ చెట్టుకి మనసులోనే ధన్యవాదాలర్పించేను.

పదిరోజులు తిరిగేసరికి నా వైపు కొమ్మలు పూత అయిపోయింది. ఇది కాదు పని అని మా ప్లాస్టర్ ఆఫ్ పారిస్ కృష్ణపరమాత్మతో చెప్పాను  ముప్పై ఒక్క పువ్వులు పూస్తే నాకు పదిహేనూ ఆయనకి పదహారూ అని. ఎలాగైనా దేవుడు మంచివాడే. లంచం పుచ్చుకుని పని చెయ్యనివాళ్ల మాటేమిటి?

సరిగ్గా ముప్పై ఒక్క పువ్వులు పూయించి దేముడు దేముడిననిపించుకున్నాడు. కాని అన్ని పురాణాల్లోలాగే ఇక్కడ కూడా క్లిక్కు పెట్టేడు. గోపాలుడు ఎంతైనా గడుసువాడు. తీరా కొయ్యబోతే సరిగ్గా పదహారు పువ్వులే అందేయి.

''ఇంత 'లేని వాడివై' వున్నావేమయ్యా శ్రీకృష్ణా! నీ లీలలు మాలాటి అల్పులకి అవేద్యం కదా!'' అన్నాను నా పదిహేను పువ్వులూ నేను తీసుకుని, ఒక పువ్వు ఆ బొమ్మముందు వుంచి. మామ్మ ఉరిమి చూసింది.

నేను నాస్తికురాల్ని కానని చెప్పినా నమ్మదావిడ.

ఇంతలో డాబామీద ఏదో చప్పుడు వినిపించి గబగబా పరుగెత్తాను. అనకాపల్లి బాణాకర్రలాటి గడకర్ర ఒకటి తీసుకుని అక్క అక్కడ నిలబడి వుంది.

''మందారనూనెలో వేసుకోవచ్చు కనీసం ఒక పూవయినా కొయ్యగలిగితే,'' అంది నాతో.

సరేనని మరొకమాటు మామూలుగా పువ్వుపాళంగా కొయ్యాలని చూసేం. రాలేదు. సరే పూర్తిగా విడిపోతే మర్నాడు చెట్టు వూపి రాల్చెయ్యొచ్చు అనుకున్నాం. అదీ కుదరలేదు. పైన చెప్పిన గడకర్ర తీసుకుని గట్టిగా నొక్కాను తొడిమదగ్గర. మెల్లిగా రేకులమీద కొట్టేను. తరవాత గట్టిగా కొట్టేను.

''ఏమిటర్రా ఏ జన్మలోనో మీరు కిరాతకులయి పుట్టినట్టున్నారు,'' అమ్మ కిందనించి కేకలేస్తోంది. ''సంపెంగ వేడి చేస్తుంది. తలనొప్పి వస్తుంది ...''

ఈ రాక్షసలీలమీద ఏ కరుణశ్రీ అయినా మళ్లీ పుష్పవిలాపం పార్ట్ టూ రాయొచ్చు.

## 9. గారాబం

''ఉళళళళళ ... హాయీ ... చిన్ని మాపాపాయిని కాయి శ్రీరంగశాయీ ...''

తడిక అవతలినుంచీ తారస్థాయిలో వినిపిస్తోంది జోలపాట. బండివాడు సామానంతా ఇంట్లో పెట్టేడో లేదో చూసుకుని వాడికి డబ్బులిచ్చి పంపించాను. కురుక్షేత్రంలో ధర్మరాజులా, ఐ.పి. దాఖలు చేసిన గృహస్థులా, వాడిన తోటకూరకాడలా సామాన్లమధ్య నిలబడ్డాను. నాలో నాకే సన్నగా నవ్వొచ్చింది. చిన్నప్పుడు మాఅమ్మ నాకు జోలపాట పాడిందో లేదో కానీ మైనారిటీ తీరేవేళకి వినే అదృష్టం పట్టింది.

''చిన్ని మాపాపాయి వచ్చింది శ్రీలక్ష్మి రావే ..

ఆదిలక్ష్మీ రావే అమ్మాయితో ఆడా ...''

దగ్గిరగా వున్న పెట్టెమీద కూర్చుందామన్న ఆలోచన కూడా రాలేదు. ఇంటికి రాగానే లభించిన ఈ స్వాగతానికి ఉబ్బితబ్బిబ్బై, ఆ గాత్రానికి అక్షరాలా కొయ్యబారి నిలబడిపోయాను. నాకు ఇంకా జ్ఞానం రాని రోజుల్లో సంగీతం మొదలుపెట్టాను. మర్నాడే మాఅన్నయ్య నాదగ్గరకొచ్చి, ''నీసంగీతం చరమదశనందుకుంది. ఇహ సాధన అవుసరం లేదు. ఇదుగో బిరుదు,'' అన్నాడు. గ్లేజు పేపరుమీద అందంగా దిద్దిన అక్షరాలు నాకళ్లు మెరిపించాయి. ''గానకాకి'' అని ఉంది దానిమీద. గుప్పెడు నువ్వులూ, పురిషెడు నీళ్లూ అందుబాటులో ఉంటే నిల్చున్నపాళాన దాన్ని మాపక్కింటి స్వరలక్ష్మికి ధార పోసి ఉండేదాన్ని. కాని జరిగివుండవలసినవాటిని తల్చుకుంటూ కూర్చుంటే లాభం ఏమిటి? వాచీ ఉరిమి చూసింది ''కాలేజీకి వెళ్లవా?'' అన్నట్టు.

ఉసూరుమంటూ పెట్టెలొక్కొక్కటే పక్కకి లాగడం మొదలు పెట్టాను. టైమ్ టేబుల్ ఏమిటో? ఏయే పాఠాలయేయో, ఏం చదువుకుని వెళ్లాలో ... అంతా గొడవగా ఉంది. పైగా సినిమాలో నేపథ్యసంగీతంలా తడికవెనక ఆ మ్యూజిక్కూ! ఇక్కడ నేనేదో చదివి వెలగబెట్టేస్తానని మాఅమ్మా వాళ్లూ పంపించారు.

ఉళళళ ... జోలా ...

జోలారి పండెరుపు దొండపండెరుపు ...

అమ్మాయి తానెరుపు తనవారిలోనా ..

అసలు వీళ్లు ఈఊరికి, ఈయింటికి వచ్చి ఎన్నాళ్లయింది? ఈ పేటలో వాళ్లంతా ఎలా ఊరుకున్నారు? ఒక విన్నపం వంటిదేదీ తయారు చేసుకోలేదూ? లేక ఈ మహాఇల్లాలు ప్రజలకోరికను మన్నించలేదా? - ఛ. ఛ. ఈ ఆలోచనలు తెగేట్టు లేవు. వాచీ చూశాను. అరగంటలో స్నానపానాలూ, కాలేజీ చేరుకోవడమూ - అన్నీ జరిగిపోవాలి. హడావుడిగా తువాలూ, సబ్బూ తీసుకుని బాత్‌రూంకి అడుగులు లెక్కపెట్టాను. సరిగ్గా యాభైరెండు పడ్డాయి. ఈ ఇంటికి సరిహద్దుల్లో ఏ మూలకి వెళ్లినా పెంపుడుకుక్కలా వెంట పడేట్టుంది ఆ సంగీతం.

ఓసోసి కుక్కా ఒడ్డెవారి కుక్కా

మాయింటికీ రాబోకే మాకు శనివారమ్మా...

శభాష్ అనుకున్నాను. కాదు, పైకే అన్నాను. నిజంగా ఇంత ఇదిగా జంటకవుల్లా, జోడెద్దుల్లా, కార్యకారణభావంలా, సంగీతమూ సాహిత్యమూ సాగిపోవడం చాలా అరుదు. ఆవిడ ఎవరో కానీ ... జానపదసాహిత్యంలో మంచి అభిరుచి కలిగినదానిలా కనిపిస్తోంది. కాదు, "వినిపిస్తోంది".

ఇంతసేపు జరిగిన విషయసేకరణ అంతా జోలపాటలమీదే. ఇది కనీసం తెలుగుక్లాసుకైనా పనికి రాదు. తొమ్మిదీ ఏభై అయింది. కాలేజీకి చేరడం ఎలా? ఏదో కందిరీగలపుట్ట కదిలించినట్టు, ఎక్కడో తుఫాను రేగినట్టు, భూమి కంపిస్తున్నట్టు, ఏ ప్రళయమో సంభవిస్తున్నట్టు, గుండెల్లోంచి ఒకటే ఆందోళన.

ఎలాగో గదికి తాళం వేసి రోడ్డెక్కాను. రోడ్డుమీద నడుస్తున్నానే కానీ ఆ జోలపాట జలపాతంలా వినిపిస్తూనే ఉంది. మధురుమయిన గీతం మళ్లీ మళ్లీ మనసులో మెదిలినట్టు. హఠాత్తుగా నాకో అనుమానం కలిగింది. ఇంతసేపూ ఆ జోలపాటే వినిపించింది. నిజంగా ఆ పాప నిద్రపోయి వుంటే మేలుకొలుపు పాడొచ్చు ఆవేళకి. కానీ ఒక్కమాటయినా ఆపిల్ల

''కుఁయ్''మన్నట్టు వినిపించలేదు. అసలు అక్కడ ''మనిషిపిల్ల''వంటి పదార్థమేమయినా వుందా అని. ...

మధ్యాహ్నం కొంచెం తలనొప్పిగా వుండి, ఓ గంట క్లాసు మానేసి గదికొచ్చాను. నూలుదారాలతో గొంతుకురి బిగించి, గుండెలోపల సూదులు గుచ్చితే ఎలా వుంటుందో అలా ఉంది మనసు.

మాచిట్టితల్లి ఏది? మాకన్నతల్లి ఏది?

మాబంగారం ఏది? మావెలిగారం ఏదీ? ..

ఇంకా ''బూడిదకచిక ఏదీ? మాకొరివికారం ఏదీ?'' అంటే ఇంకా బాగుంటుంది అనుకున్నాను.

మారాజావారు ఏంచేస్తున్నారు? బహుమానాలెవరిక్కావాలోయ్?

పరుగెత్తుకు రావాలోయ్, ఏంతెచ్చారో చెప్పుకోవాలోయ్ ...

ఆ పురుషకంఠం విని తృళ్లిపడ్డాను. నాకేం బోధపడలేదు.

''మాకు ఈ ఉత్తుత్తి బహుమానాలేం అక్కర్లేదు. నైలాన్ గౌను కావాలి. తెప్పించమని చెప్పవే'' అంటూ ఆవిడ రొకాయిస్తోంది.

''ఇప్పటికే అయిదున్నాయి. అమ్మాయిని పన్నీరుపోసి, పువ్వులమీద పెంచుతావా ఏం?'' అన్నాడతను.

''పెంచుతే పెంచుతాను,'' అంది ఆవిడ రూక్షణంగా.

''అబ్బోస్ .. మీరు గమాస్తాగారి పాపాయిలండీ. చిట్టి చిట్టి లచ్చి ... ఉష్ ష్.. నవ్వంతా దాచేసుకుంటావా?''

నవ్వడానిక్కూడా అసహ్యం అనిపించింది నాకు. నిజంగా ఆ ముద్దు చెయ్యడమేమిటి? ముద్దు చెయ్యడానికైనా ఓ తీరూ తెన్నూ ఉండొద్దూ? ఇలా పెంచిన పిల్లలేగా చివరకి ఎందుకూ పనికిరాని మొద్దులయేది? అప్పుడేమో మరో దారికోసం పాకులాడతారు - వాళ్లని నాలుగు కొట్టడం, తిట్టడం, తమ్ము తాము తిట్టుకోడం, - నిజంగా ఆమాత్రం ఇంగితజ్ఞానం లేదా? లేక వాళ్లకి గుర్తుండదా? మళ్లీ కాలేజీసంగతి జ్ఞాపకం వచ్చింది. గబగబ తాళం వేసి కాలేజీకి

బయల్దేరాను. రిక్షాలో వెళ్లకపోతే టైముకి అందను. పిల్లలపెంపకం మాట దేవుడెరుగు గానీ లెక్చరర్ క్లాసులోకి రానివ్వకపోతే నేను పాడుకోవాలి జోల.

సాయంత్రం కాలేజీనించి వచ్చేసరికి మళ్లీ అదే గోల ..

అత్తా ... అత్తా .. త్తా త్తా త్తా పిలుస్తుంటే పలకరేమండీ, పలకరేమండీ .. వినిపించటంలేదూ .. త్తాత్తా..''

''అంటున్నది నువ్వా? అదా?'' లోపలినించి ప్రశ్న.

''అమ్మన్న రాజావారండీ వినిపించటంలేదూ? భలేవారే. అదేమ్మా .. త్తా త్తా ...'' అంటోంది మొదటి ఆవిడ.

వాళ్లు చేస్తున్న గారాబానికి నాకు చిరాకూ, అసహ్యమూ, వేసింది. వాళ్ల మనస్తత్త్వాన్ని తెలుసుకోలేక ఆలోచనల్లో మునిగిపోయాను.

''దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్,'' అంటూ నవ్వుతూ లోపలికి వచ్చారు నాచిన్ననాటి టీచరు రమాదేవి. అప్పటికి గానీ ఈ ప్రపంచంలోనే వున్నసంగతి నాకు గుర్తు రాలేదు. ఆలోచనలతో నామొహం నాకే వికృతంగా కనిపిస్తోంది.

''ఏమీ లేదండీ,'' అన్నాను. అలాటి సమయంలో ఆవిడ నన్ను చూసినందుకు సిగ్గు పడుతూ.

''ఏమండీ, పాలు కాచేరా? పాలవేళ అయినట్టుంది. రాజావారి కడుపు ఏడుస్తోంది,'' తడిక అవతల ఆవిడ అంటోంది.

''వినండి,'' అన్నట్టు రమాదేవిగారివేపు చూశాను.

''నాకు తెలుసు వాళ్లని,'' అంది ఆవిడ రహస్యంగా.

కీచు, కీచుమని వినిపించింది ఏదో మరబొమ్మకి కీ ఇచ్చి వదిలినట్టు అవతలినుండి.

''ఒచ్చే, ఒచ్చే, ఓంటమ్మా, నిన్నెవరూ చూడరూ, ఏలుత్తున్నావా, .. ఏడవకు, ఏడవకు వెర్రి నాఅమ్మాయీ, ఏడిస్తే నీకళ్ల కారు నీలాలూ ..'' బుజ్జగింపుగా పాడుతోంది ఆవిడే. మధ్య మధ్యలో మళ్లీ కీచుమని వినిపించింది.

“సిగ్గులేకుండా అలాగ గారాం చేస్తారేం,” అంటూ నా అసంతృప్తిని వెల్లడించేను సన్నని గొంతుతో.

రమాదేవిగారు నవ్వేరు.

నాకు చచ్చేంత సిగ్గేసింది. ఆవిడదృష్టిలో నేనింకా ఫోర్తుఫారం చదువుతున్న పదమూడేళ్ల అమ్మాయినే.

“ఎలాగ?” అన్నారు ఆవిజ నామాటకి జవాబుగా.

నాకు కోపం వచ్చింది. నేను మాట్లాడలేదు.

“ఆ తలుపు వేసివుందా?” అన్నారావిడ వంటింటివేపు చూపిస్తూ మళ్లీ.

“ఆఁ” అన్నాను, ఎందుకో అర్థం కాక.

“అయితే అలా వెళ్దాం, రా,” అన్నారావిడ లేస్తూ.

నేను జవాబు చెప్పేలోపున ఆవిడ రోడ్డుమీద వున్నారు. ఒకనిముషం తటపటాయించి, గదికి తాళం వేసి వెళ్లేను.

మేం ఎంతోదూరం వెళ్లలేదు. ప్రక్క గుమ్మమే. మధ్యలో తడిక లేకపోతే, అంతా ఒకే ఇల్లు.

“ఏమమ్మా కమలా! ఏం చేస్తున్నావు? అమ్మాయితో ఎక్కడా తీరిక లేనట్టుందే,”అంటూ రమాదేవి చాపమీద కూర్చున్న వ్యక్తిని పలకరించారు.

ఆవిడ మమ్మల్ని చూడగానే లేచి నిలబడి, ఎంతో ఆప్యాయంగా “రండి, రండి,” అంటూ ఆహ్వానించింది.

రమాదేవి నన్ను శాస్త్రోక్తంగా ఆవిడకి పరిచయం చేశారు. “మారాజావారిని చూడరూ,” అంటూ మమ్మల్ని లోపలికి ఆహ్వానిస్తూ, ఆవిడ పక్కగదిలోకి దారి తీసింది. నాకెందుకో కొంచెం చలివేస్తున్నట్టు అనిపించింది. అది ఆనందమో, ఆశ్చర్యమో, ఆతృతో …

మౌనంగా వాళ్లిద్దరినీ అనుసరించాను.

ఆ గది గాలీ వెలుతురూ లేక మసక మసకగా వుంది శ్రావణమేఘాలు ఆవరించినట్టు. ఒకమూలన ఉయ్యాలతొట్టిలో తెల్లని శాటిన్ దుప్పటిమీద తెల్లని నైలాన్ గౌను కనిపించింది. లైటు వేశారు. ఆ యింటి మణిదీపం కనిపించింది. రెండేళ్లు వెళ్తాయిట!

నేను ఆ "అమ్మాయి"ని ఎంత వింతగా చూస్తున్నానో, ఆ అమ్మాయి నన్ను అంత వింతగానూ చూస్తోంది. నాకు మతి పోయినంత పనయింది. ఉండి, ఉండి ఆ "అమ్మాయి" కీచుమంటున్నది.

"కొత్తత్తని పలకరిస్తున్నారేంటోయ్ అమ్మాయిగారూ," అంది ఆ మాతృదేవి మురిసిపోతూ.

రమాదేవి నవ్వుతున్నారు.

ఉయ్యాల్లో చిన్నారి నవ్వుతోంది 'ట'!

ఇంటికొచ్చేక రమాదేవిగారు చెప్పేరు. రెండేళ్లక్రితం పుట్టినబిడ్డ పురిటిలోనే పోయిందనీ, అప్పటినుండీ మతి చలించి ఆమె అలా మైకాబొమ్మతో కాలం గడుపుతోందనీ. ఆమె ఎలాగో ఒకలాగ బతికివుంటే చాలని, భర్త కూడా అభ్యంతరం చెప్పరనీ.

నేను కొద్దిరోజులకే ఆ గది ఖాళీ చేసి మరోగదికి మారిపోయాను. ఆమెని తలుచుకున్నప్పుడు మాత్రం నాకు చిరాకు కలగదు. జీవితంలో తృప్తికోసం ఏదో ఒక ఆలంబన కావాలి కదా అనిపిస్తుంది.

000

(సైనిక్ సమాచార్. కలకత్తా. 1959)

# 10. ముగ్ధ

సుబ్బలక్ష్మితో అచ్చనకాయలాడుతూ కూచుంటే టైమెంతయిందో నాకే తెలీదు. సుబ్బలక్ష్మి వాళ్లమ్మ సంజదీపం పెట్టడం చూసి చేతిలో రాళ్లు చెప్పున వదిలేశాను. అప్పుడు గుర్తొచ్చింది ఆకలి. రేపొస్తానని సుబ్బలక్ష్మికి చెప్పి ఇంటికి వస్తూంటే ఆలస్యమయినందుకూ, కొత్తపరికిణీ మాపుకున్నందుకూ అమ్మ ఏమంటుందోనన్న భయం జ్ఞాపకం వచ్చింది.

"అదుగో వచ్చింది," అన్నారు గుమ్మంలో నిలబడ్డ నన్ను చూపించి నాన్న. అమ్మ రేపటికూరకి కాబోలు గోరుచిక్కుడుకాయలు ఈనెలు తీస్తోంది నట్టింటిగుమ్మంలో కూచుని.

"గుంటూరులో బాబాయిదగ్గర వుండి చదువుకుంటావుటే?" అంది అమ్మ నావేపు చూడకుండా.

"నాకు మళ్లీ ట్రాన్స్‌ఫర్ అయింది. నాతోపాటు నువ్వు కూడా వూరూరా తిరుగుతుంటే చదువు ఏం సాగుతుంది? గుంటూరులో బాబాయిదగ్గిర ఉండి చదువుకో యస్సెల్సీ అయేవరకూ," అన్నారు మంచీ చెడు వివరస్తూ.

"అక్కడ బామ్మకూడా ఉందిగా. మేం కూడా అప్పుడప్పుడు వచ్చి చూసి పోతూంటాంలే," అంది అమ్మ.

"మీయిష్టం," అనేసి కొత్తపరికిణీ మాసినట్టు వాళ్లు పసి గట్టకముందే పక్కగదిలోకి వెళ్లిపోయా.

మర్నాడు అమ్మ పెట్టె సర్ది, జాగ్రత్త అని నాలుగుమార్లు చెప్పింది. బండి ఎక్కేవరకూ బామ్మదగ్గరకే గదా వెళుతున్నది అని సరదాగానే వున్నా. బండి ఎక్కేవేళకి చప్పున దుఃఖం - పిలిచిన పలుకు తల్లి - వచ్చేసింది. కాని ఎవరైనా ఎక్కడికైనా వెళ్తున్నప్పుడు ఏడవకూడదని బామ్మ చెప్పింది. పరికిణీలో మొహం దాచుకుని బండిలో కూచున్నాను. "రామలక్ష్మణుల"మెడలో గంటలు ఘల్లున మోగాయి. వెధవఉద్యోగం అనిపించింది. లేకపోతే ఏమిటి? అప్పుడు నాచిన్నప్పుడు అమ్మ, నాన్న, బామ్మ, బాబాయి, అందరం ఎంతో చక్కా కలిసి ఉండేవాళ్లం. అప్పుడూ ఇలాగే నాన్నకి ట్రాన్స్‌ఫరయిపోయింది.

గుంటూరులో నాన్నగారు నన్ను వదిలేసి వెళ్లిపోయారు. జాగ్రత్తగా ఉండమనీ, బుద్ధిగా చదువుకోమనీ, అల్లరి చెయ్యొద్దనీ, అచ్చనగాయలు ఆడొద్దనీ - చెప్తూన్నంతసేపూ గంగడోలులా ఊపాను తల.

"బామ్మ ఉందిగా," అన్నారు ఆఖరిమాటగా.

"ఊఁ" అన్నాను.

నాన్నగారు వెళ్లిపోయారు.

"అట్లా నిలబడిపోయావేం? ఇక్కడ కాఫీ చప్పగా చల్లారి తగలడుతోంది," అంటూ వంటింట్లోంచి పిన్ని స్వరం ఖణేల్మంది - మా "రామలక్ష్మణుల"మెళ్లో గంటల్లా. ఏదో బెంగగా వుంది. మెల్లిగా మాటాడరాదూ అనిపించింది.

కాఫీ తాగేసి, స్నానానికని బట్టలు తీసుకుని స్నానాలగదివేపు వెళ్లేను. అక్కడ సిమెంటు తొట్టెలో కొళాయినీళ్లు వున్నాయి చల్లగా. మావూళ్లో వెచ్చవెచ్చగా బావినీళ్లు నేనే తోడుకుని పోసుకునేదాన్ని. కొళాయినీళ్లు నాకు నచ్చలా. ఎండాకాలంలో వేడిగా వుంటాయి, చలికాలంలో చల్లగా వుంటాయి - నామొహంలా. ఈవేళకి బింబో ఏంచేస్తుంటాడో, లేగదూడతో ఆడుకుంటుంటాడో, అమ్మ ముగ్గులు పెడుతుంటే నేనూ అంటాడు ఆడపిల్లలాగ.

"ఎంతసేపు ఆ జలక్రీడలు, అక్కడ్నుంచి వచ్చేదేమైనా వుందా? అక్కడే కాపురముంటావా?" పిన్ని మళ్లీ కేకేసింది.

"వస్తున్నా బట్టలారేసుకుని వస్తా."

"బట్టలు చాకలికి వెయ్యొచ్చుగా. బడికి వేళవుతూంది. కాస్త పాఠాలు చూసుకోరాదూ?"

అదేమిటో పిన్ని మాటాడుతుంటే గుండెలు దడదడలాడతాయి.

"తడిపేశాగా. ఆరేసుకుని వస్తా," అన్నాను బుట్టలా లేస్తున్న లంగా రెండు చేతులతో నొక్కి పెడుతూ.

"ఎందుకు తడిపేవు? నన్నడిగితే చెప్పేదాన్నిగా."

నాకు కోపం వచ్చింది. నాబట్టలు నేను ఉతుక్కుంటే తనకెందుకు? నేనేం ఇంకోళ్ల బట్టలు ఉతుకుతున్నానా? నాబట్టలు ఇంకోళ్లని ఉతకమన్నానా?

"ఉతుక్కోకపోతే చాలవు. నాకు నాలుగుజతలే వున్నాయి."

పిన్ని వెనుతిరగ్గానే బట్టలు త్వరత్వరగా ఆరేసి ఇంట్లోకి వచ్చేశాను. పిన్ని అన్నం వారుస్తోంది. మడి కట్టుకోలేదు. మరి బామ్మకెట్లా? పరుగెత్తుని వీధివరండాలోకి వెళ్లాను.

"బామ్మా! పిన్ని మడి కట్టుకోకుండానే వంట చేస్తూంది," అన్నా వగరుస్తూ. ఇక్కడ అన్నీ విచిత్రంగానే వున్నాయి. ఏవేళప్పుడు చూసినా అధ్యాత్మరామాయణమో సీతారామాంజనేయమో చదువుకునే బామ్మ సినీరమ చూస్తూంది! నేను ఆశ్చర్యంతో చచ్చిపోతానేమో అనిపించింది.

"పిన్ని మడి కట్టుకోలేదు," అన్నాను తిరిగి.

"అవును. చన్నీళ్లస్నానం పిన్నికి పడదు. ఇంతకీ నీకు బడికి పోయే ఉద్దేశం లేదాయేం?" అంది బామ్మ సన్నగా నవ్వుతూ.

"ఏంటి బామ్మా! అమ్మకి పడలా? పిన్ని అమ్మకంటే చిన్నదా యేం?" బామ్మ కూడా ఇంత అన్యాయంగా ఎందుకు మాటాడుతుందో నాకు అర్థం కాలేదు.

నాక్కోపం వస్తుంటే బామ్మకి నవ్వొస్తూంది. "అమ్మతరఫున వకాల్తా పుచ్చుకుని నువ్వు పోటాడేట్టున్నావే. పో, పో. నీ తెలుగుపుస్తకం తీసుకరా," అంది.

విక్రమార్కుడిసింహాసనం పాతినచోట నిలబడితే గొల్లవాడికి కూడా ధర్మబుద్ధి పుట్టిందిట. ఈ బాబాయి ఇంట్లో వాళ్లందరూ ఒక్కరకంగానే మాట్లాడుతున్నారు. స్కూలుకి టైము అయేవరకూ నాకిచ్చిన చిన్నగదిలో పుస్తకాలు సర్దుకుంటూ కూర్చున్నా. బైటికి రాబుద్ధి కాలేదు. అమ్మ ఏం చేస్తోందో? కొత్త బడి ఎట్లా ఉంటుందో ...

"బజారుకి వెళ్లాలంటే వినిపించుకుచావరు. మళ్లీ గంట కొట్టేసరికి తయారవుతారు తింటానికి వంటింట్లో. ఏం తగలేసేది కంచంలో ..."

పిన్ని ఇట్లా మాట్లాడుతుంటే సుడిగాలికి చెఱుకుతోట ఫెళఫెళ్ళాడినట్లుంటుంది. అదేమిటో! ఎక్కడో గయ్యాళిగంపకి మల్లే వుంది. ఆవిడచేతిలో బాబాయి ఒఠ్ఠి కీలుబొమ్మ.

పిన్ని అన్ని మాటలు అంటుంటే బాబాయి ఒక్కమాట కూడా అనడు. బామ్మ కూడా ఏమీ అనదు.

నాచిన్నప్పుడు నాన్నకి ట్రాన్స్ఫర్ అయినప్పుడు నాన్న బామ్మని ఎంతగా బతిమిలాడారు మాతో వచ్చేయమని. ''పెద్దకొడుకుదగ్గర చచ్చిపోతే కాశీలో చచ్చిపోయినట్టు''ట. బామ్మ ససేమిరా రానంది. ''ఈవూరు నాకు కన్నతల్లిలాటిది. ఈగడ్డమీద పుట్టాను. ఈగడ్డమీదే ఒరగాలి'' అంది. అసలు సంగతి అది కాదు. బామ్మకి బాబాయి అంటే ఇష్టం. లేకపోతే అమ్మ పిన్నికంటె ఎంత బాగా చేస్తుంది సేవలు.

''ఏవమ్మో సీతీ! వచ్చి ముద్ద మింగి పో. వేళవుతోంది.''

సీతాదేవీ! అనకూడదూ? సీతీట, సీతీ .. సుబ్బీ అన్నట్టు.

కంచంవైపు చూస్తే ఏం తినాలో నాకే తెలియలేదు. దోసకాయ పప్పూ, గోంగూర పులుసూ, దబ్బకాయ ఊరగాయా - ఇందులో తినేదేమిటి నాతలకాయ. పైగా అన్నిట్లోనూ నన్ను తినేసే ఖారం. ఈవిడకి పుట్టింటివాళ్లు రెండెకరాల మిరపతోట ఇచ్చేరుట. ఈవిధంగా అందరికీ తెలియజేస్తుంది కాబోలు ఆ వైభోగం!

''తినవే. త్వరగా కానియ్. మీఅమ్మకి మల్లే కాకలు తీరినచెయ్యి కాదు. నీ రుచులకి చాలవు కాబోలు.''

అబ్బబ్బ, ఆ తిట్లు మానేస్తే కడుపునిండా తిండి పెట్టినంత ఫలం. చిన్నప్పుడు ఓ కథ చదివేను. ఓ పంతులుగారి భార్య పులుసుకుండ ఆయననెత్తిన పగలగొట్టి ఏగానీ తెమ్మందిట. నేను కూడా ...

''ఏమిటా నవ్వులు కంచంలో చెయ్యేసుకుని? పిన్నివంట నవ్వుగా వుందేం?''

''నాకు పెరుగు పొయ్యి,'' అన్నా అన్నం అంతా పక్కకి నెట్టి, మొహం మొగలిపొదలా చేసుకుంటూ.

''దానికి వేపుడుకూరలు తప్ప దిగవ్,'' అంది బామ్మ, పులుసు కలుపుకుంటూ.

''వేపుడుకూరలూ, ఆవకూరలూ తిని గుంటూరులో బతికేనా? ఆ అన్నం ముందుకి తియ్. పులుసు సయిస్తుంది,'' అంది పిన్ని అథార్టీ చేస్తూ.

‘‘నాకాకల్లేదు.’’

‘‘ఏఁవొచ్చిందీ ఆకల్లేకపోవటానికి? అయినా ఇది ఎవరిపోలిక? అట్లా పండు మిరపకాయల్లే మొహం పెట్టుక్కూచుంటుంది.’’

‘‘నీపోలిక కాదులే.’’

వీపు ఫెళ్లుమంది. ‘‘పెద్దా చిన్నా లేదూ? నోటికెంతొస్తే అంతా?’’

‘‘ఊరుకో అమ్మా!’’ అన్నాడు బాబాయి.

‘‘పోనీలెండి. చిన్నపిల్ల దానికేం తెలుసు. అయినా నిజమే చెప్పిందికదా,’’ అంది పిన్ని నవ్వుతూ, తనేదో అక్కడికి మహా మంచిదయినట్టూ, బామ్మ కానట్టూ.

గుడ్ల నీళ్లు కుక్కుకుంటూ వెళ్లి చెయ్యి కడుక్కున్నాను.

స్కూలు కూడా నచ్చలేదు. కొత్తపిల్లని కదా. ఒక్కరైనా పలకరించలేదు. వాళ్లలో వాళ్లు మొహాలు చూసుకోటమూ, నామొహం చూట్టమూను.

స్కూలు వదిలిపెట్టగానే ఇంటికి వచ్చేశాను ఎవ్వరితోనూ మాటాడకుండా. ద్వారాన్నానుకుని నిల్చున్నా. మావూళ్లో అమ్మ, బామ్మ ఎవరున్నా బడిబట్టలు మారిస్తే కానీ ఇంట్లోకి రానివ్వరు. మరి పిన్ని ఏమంటుందో?

‘‘అట్లా నిలబడిపోయావేం? టిఫిను చల్లారిపోతూంది. త్వరగా కాళ్లు కడుక్కుని రా.’’

‘‘మరి బట్టలు మార్చుకోవద్దూ?’’ నానోటితోనే చెప్పడం ఇష్టం లేకపోయినా తప్పింది కాదు.

పిన్ని మళ్లీ ఘొల్లుమంది. ‘‘అయితే, అక్కడే వీధిలోనే మారుస్తావా? నాపెట్లో ధర్మవరం చీరె వుంది. రెండు చేస్తే ఓణీలు వేసుకోడానికి పనికొస్తాయి. అది మడత పెట్టుకుంటే రేపటికి పనికొస్తుంది.’’

పిన్నిదంతా ఒక తంతుగా వుంది. అవ్నీ తాకితే ఇహ మళ్లా మార్చడం ఎందుకు? ‘‘మానాన్న నాకు కొత్తవి తెస్తార్లే,’’ అన్నాను.

‘‘ఓయబ్బో, పౌరుషమూ ...’’ అంది పిన్ని దీర్ఘాలు తీస్తూ.

ఇంతలో బాబాయి కూడా వచ్చేరు. ఇద్దరికీ రెండు ప్లేట్లలో పకోడీలు తెచ్చింది. జీడిపప్పు లేదు సరికదా వాటిల్లో ఉల్లిపాయలు వేసింది. బామ్మ ఎట్లా తింటుందని? "నాకివేమీ వద్దు," అన్నాను.

"ఏం?" పిన్నీ, బాబాయి ఒకేసారి ప్రశ్నించేరు.

"బామ్మ తింటే నేనూ తింటాను," అన్నాను కాలిబొటనవ్రేలితో నేల రాస్తూ. పిన్నీ, బాబాయి - ఇద్దరూ పకపక నవ్వేరు.

"ఓయబ్బో, నీకున్న ప్రేమ నాకెందుకుంటుంది? నీకు బామ్మయితే నాకు బామ్మా?" అంది పిన్ని.

"నీకు అత్తగారు కాదా?" ఇప్పుడు చెప్పు అన్నట్టు ఎదురుప్రశ్న వేశాను.

పిన్ని ఇంకా నవ్వుతూనే వుంది. "నా బంగారుతల్లీ, బామ్మ ఫలహారం మూడింటికే అయిపోయింది కానీ తిను."

పెద్దవాళ్లతో మాటలేమిటి? బాబాయి చెప్పినట్టు పొద్దున సరిగా అన్నం తినలేదేమో ఆకలి మాడ్చేస్తోంది. మెదలకుండా పకోడీలన్నీ తినేసి నాగదిలోకి వెళ్లిపోయాను. నాకెంత ఆలోచించినా అర్థం కాలేదు. బామ్మ ఉల్లిపాయ పకోడీలు ఎలా తింటుంది? పిన్ని పోట్లాడి తినిపించిందేమో. అంతపనీ చేసేట్టుగానే వుంది ఆవిడవాలకం చూస్తే.

"ఏయ్, సీతా! లే. లే. ఇంకా చదువుకుంటున్నావేమో అనుకున్నా పిలిస్తే పలక్కపోతే. అట్లా నిద్ర పోకపోతే వచ్చి అడిగితే అన్నం పెట్టేదాన్నిగా. లేచి నాలుగు మెతుకులు తిని పడుకో, రా."

మత్తుగా తూలుతున్న నన్ను చెయ్యి పట్టుకుని తీసుకెళ్లి కంచందగ్గిర కూచోబెట్టింది పిన్ని. బాబాయి అప్పటికే కంచంముందు కూచుని వున్నాడు. "అన్నం తినేసి పడుకోలేకపోయావా?" అన్నాడు నన్ను చూచి.

నేను మాట్టాడలేదు. తింటున్నంతసేపూ నిద్ర వస్తూనేవుంది. పిన్ని గోలగా ఏదో చెప్తోంది. అట్లాగే భోజనం అయిందనిపించి పక్క పరుచుకుని పడుకునేవేళకి నిద్ర తేలిపోయింది. ఇక చచ్చినా రాదు నిద్ర. అటూ ఇటూ పొర్లుతుండగానే పది గంటలు కొట్టటం

వినిపించింది. పిన్ని బామ్మకి రాత్రికి పూరీలు చెయ్యలేదు. పాపం బామ్మ ఏమీ తినకుండానే పడుకుంది. రోజూ ఇంతేనా?!

నెమ్మదిగా లేచి వంటింటివేపు వెళ్లాను. పిన్నీ, బాబాయీ పక్కగదిలో నిద్రపోతున్నారు. బామ్మ వరండాలో పడుకుని వుంది. సొమ్మసిల్లిపోయిందేమో.

బుడ్డిదీపం వెలిగించి, వంటింటితలుపులు చారవేశాను లైటు ఎవరికీ కనిపించకుండా. కానీ ఏడబ్బాలో గోధుమపిండి ఉందో నిప్పు చెయ్యటానికి అగ్గిపెట్టె ఎక్కడ వుందో? చప్పుడు చెయ్యకండా వెతుకుతున్నా. అన్ని సామాన్లూ దొరికేటప్పటికి నాలుగుగంటలు అయివుంటుందనిపించింది నాప్రాణానికి. గ్లాసుతో బిందెలోనుండి నీళ్లు తీస్తుంటే ఠంగుమంది. ‘‘చచ్చా’’ననుకున్నా. తలుపుచాటున నక్కాను.

‘‘పాడు ఎలకలు, ఒక్కరోజు తలుపు వెయ్యటం మర్చిపోతే చాలు,’’ అంటూ పిన్ని బయట గొళ్లెం పెట్టేసింది. నేను వంటింట్లో ఇరుక్కున్నా.

ఇప్పుడు పూరీలు చేసినా బామ్మకి అందేదెట్లా? బామ్మకి తెలీదాయె .. పోనీ బామ్మని పిలుద్దామంటే పిన్నిగానీ లేస్తుందేమో. పిన్నికి తెలిసిందంటే నాకిక్కడే కపాలమోక్షం ఖాయం. మావూళ్లో అమ్మ హాయిగా నిద్రపోతూ ఉంటుంది కాబోలు. అటూ ఇటూ చూస్తుంటే పెరటితలుపు కనిపించింది. ఫరవాలేదు. ఆ తలుపు తీసుకుని ప్రక్క సందుగుండా వరండాలోకి పోవచ్చు.

పూరీలపిండి కలిపి ప్రక్కన పెట్టి కిరసనాయిలు కుంపట్లో పోశాను. నిప్పు అయి నూనె కాగేలోపున పూరీలు వత్తేస్తే వేయించటం నిముషం కూడా పట్టదు. కిరసనాయిలు సీసా నిండుగా వుంది కాబోలు కాస్త ఎక్కువే పడ్డట్టుంది, అయితేనేం లే, త్వరగా నిప్పు అవుతుందనుకుని అగ్గిపుల్ల గీశాను.

భగ్గుమంది మంట.

‘‘అమ్మో, మంటలు నాఎత్తున ...’’

కళ్లిప్పి చూసేటప్పటికి పిన్ని ఒడిలో వున్నాను. తనకొంగుతో విసురుతోంది. బామ్మ ఒకప్రక్కన కూర్చుని ఉంది. కానీ ... పిన్ని?

భయంగా చూస్తూ బామ్మవైపు ఒరిగాను.

"ఏం చేస్తున్నావిక్కడ? ఇందాకా ఎలుకపిల్లవి నువ్వేనా?" అంది పిన్ని నెమ్మదిగా నవ్వుతూ.

"బామ్మకి రాత్రికి నువ్వు పూరీలు చెయ్యలేదుగా. అందుకని నేను చేస్తాను అని," అన్నాను వస్తున్న ఏడుపు ఆపుకుంటూ. చలిజ్వరం వచ్చినట్టు వణుకు వస్తోంది.

"ఇంత అమాయకప్పిల్లవయావేం?" అంది పిన్ని బుగ్గ గిల్లుతూ.

పిన్నికి కోపం ఎందుకు రాలేదో నాకు అర్థం కాలేదు.

"సరేలెండి. అర్థరాత్రి అంకమ్మశివాలని. బాగుంది. పదండి. పడుకోండి. కాస్తలో ప్రమాదం తప్పింది. పద, నాదగ్గిర పడుకుందువు గానీ నువ్వు," అని బామ్మ బాబాయినీ, పిన్నినీ పంపించేసి, నన్ను చెయ్యి పుచ్చుకుని వరండావేపు తీసుకెళ్ళింది.

బామ్మ ప్రక్కన పడుకోగానే నాకు అమ్మ జ్ఞాపకం వచ్చింది.

"మనవూరు వెళ్లిపోదాం, రా బామ్మా! మనం ఇక్కడ ఉండొద్దు. పిన్ని మంచిది కాదు."

"ఛా, అట్లా అనొచ్చా? పిన్ని చాలా మంచిదమ్మా. నాఅలవాట్లు పిన్నికి తెలీవు. పైగా అర్భకురాలు. ఎన్నని చేస్తుంది చెప్పు? నేనూ పెద్దదాన్నయిపోయాను. అందుకని అవన్నీ వదిలేసుకున్నాను. నీకు అవన్నీ అర్థం కావు," అంది బామ్మ నాముంగురులు సవరిస్తూ.

బామ్మ చెప్పింది అర్థం చేసుకోటానికి కొద్దిసేపు ఆలోచించాను. పున్నమిచంద్రుని వెన్నెల బామ్మముఖంమీద పడుతోంది. బామ్మ సన్నగా నవ్వుతోంది.

"నువ్వు చాలా మంచిదానివి బామ్మా," అన్నాను బామ్మవైపు తిరిగి పడుకుంటూ.

000

(విశ్వవీణ. నవంబరు 15, 1959).

# 11. అపేద్యాలు

తలొంచుకుని తండ్రి రాసిన ఖండకావ్యం తాలూకు ప్రూఫు చూస్తోంది శారద.

శారదని చూసి ఆగిపోయాడు చలపతి ఒక కాలు గుమ్మంలోనూ ఒక కాలు గుమ్మంపైనా ఉంచి - రన్నింగ్ రేస్‌లో ఛాంపియన్‌లా.

కొనకంటిలో మనిషి మెదిలినట్టయితే, "ఎవరోలే" అనుకుని, కావలిస్తే వాళ్లే పిలుస్తారు అన్నధోరణిలో దృష్టి మరల్చలేదు శారద.

చలపతి సందిగ్ధంగా ఓ నిముషం నిలబడి, "మామయ్య లేరా?" అని ప్రశ్నించాడు మందరస్వరంతో.

శారద తలెత్తి, "ఓహో" అంది కొత్తగా గుర్తు పట్టినట్టు. అలా అనడంలో కాస్త తడబడుతూ, "నువ్వా?" అనేసి చప్పున "నాన్నగారు లేరు. ఇప్పుడే వస్తానని చెప్పి వెళ్లి చాలా సేపయింది. వచ్చేస్తారు," అంది గబగబ.

చలపతి, "పోనీలే. మళ్లీ వస్తాను" అన్నాడు వెనక్కి తిరగబోతూ.

"కూర్చోకూడదూ ఒక్క అయిదు నిముషాలు" అంది కానీ అతగాడ్ని అక్కడ అలా ఆకట్టడంలో తనబళ్లో ఏమీ లక్షలు కురియవు. ఆ మాట అతను గ్రహించేలా, "నాన్నగారు రాజమండ్రి వెళ్తున్నారు రాత్రికి. రెండు మూడు రోజులదాకా రారు," అంది మళ్లీ.

చలపతి కూర్చోడానికే నిశ్చయించుకుని ఓమూల పడి ఉన్న పాతపత్రిక ఒకటి తిరగేయసాగాడు. కొనకళ్లలోంచి శారదరూపం లీలగా కనిపిస్తూంది. శారద అపరంజిబొమ్మ. పువ్వులాటి మనిషి.

"ఏదైనా పనిమీద వచ్చేవా?" శారద యాదృచ్ఛికంగా ప్రశ్నించింది. కాని అందులో వింతైన కౌతుకం వ్యక్తమవుతూంది.

అప్పుడే శారదకెలా తెలిసింది? ఆ మాటే అడుగుదామనుకున్నాడు, కానీ "దొంగాడా, కరవకు" అన్నట్టుంటుంది.

"ఏమీ లేదు." ఎంత నిర్లక్ష్యంగా అందామని ప్రయత్నం చేసినా ఏదో వెలితిగానే వినిపించింది.

"అంతేనా?" అంది శారద గుండెమీంచి బండ దింపినవతుగా.

"హేళన, హేళన," అనుకున్నాడు చలపతి. అంతకన్న "ఆ మాట చెప్పడానికి ఇంతదూరం రానక్కర్లేదు, ఇంతసేపు నిరీక్షించనక్కర్లేదు, ఇంకేమేనా పనుందా?" అనడిగితే బాగుండేది. "మాతమ్ముడు దురదృష్టజీవి" అన్నాడు గతం అప్పుడే జ్ఞాపకం వచ్చినట్టు.

శారద పెదిమలమీద లీలగా మెరిసిననవ్వు ఆ వ్యాక్యాన్ని నిరసించింది. "ఇదే నిర్ధారణ?" అంది.

000

శారదకి జ్ఞానం వచ్చేసరికే తనకి తల్లి లేదని తెలుసుకుంది. మెల్లిగా ఇల్లు చూసుకుంటూ ఫోర్తుఫారంవరకూ చదివింది. ఫోర్తుఫారం చదువుతున్నరోజుల్లోనే ఓరోజు ఇంటికి రాగానే తండ్రితో, "నేనింక స్కూలికి వెళ్లనండీ," అంది.

ఆయనకి అర్థం కాలేదు. "ఎవరైనా ఏమేనా అంటే చెప్పు. గుండేసి కొట్టేస్తాను," అన్నారు.

శారద మాటాడలేదు. మర్నాడు స్కూలికి వెళ్లలేదు. వారంరోజులు పోయేక, తండ్రి దశరథరామ్మూర్తిగారు "పోనీ, ప్రైవేటుగా మెట్రిక్కి కట్టు," అన్నారు.

శారద అంగీకరించలేదు. మనుచరిత్రలో నాలుగు పద్యాలూ, మహాభారతంలో నాలుగు పద్యాలూ, కందుకూరివ్యాసం ఒకటి - ఇందులో మళ్లీ రెండు పద్యాలు "అనింపార్టెంటు" - ఎందుకొచ్చిన చదువిది? - ఇదీ సూక్ష్మంగా ఆ పిల్ల అభిప్రాయం. అంతకంటే ఒక క్రమంలో ఇంట్లో చదువుకోడమే మేలు. అయితే ఆ క్రమం ఏమిటి అంటే అది ఆ అమ్మాయిబుర్రలో ఎప్పటికి ఏది సరి అనిపిస్తే అదీ. శారద అడిగిన నిఘంటువూ, అమరకోశమూ ఏదడిగితే అది తెచ్చేవారు ఆయన. తనకి తోచినట్టు అర్థం చేసుకునేది. అర్థం కాకపోతే ఊరుకునేది. కొన్నాళ్లు పోయేక మళ్లీ తీసేది. ఆ విధంగా ఆంధ్రసాహిత్యంతో శారద పరిచయం వృద్ధి చేసుకుంది.

అయినా చలపతీ, అతని తమ్ముడు సుందరం దృష్టిలో శారద ఘోర్తుఘారం అయినా పాసు కాలేని మూర్ఖురాలు!

శారదకి పదిహేడేళ్లు వచ్చేక, ఓ రోజున దశరథరామ్మూర్తిగారు ''తాంబూలాలిచ్చి'' వచ్చినట్టు చెప్పేరు. మరేమీ పైసంబంధం కాదు. చిన్నప్పట్నుంచీ అనుకుంటున్నదే, మేనరికమే, సుందరం. ఇహ శారదని విడిగా అడగవలసిన అవుసరం ఏమిటి? ఇప్పుడు మటుకు చెప్పవలసిన అవుసరం ఉండి గాదు ఆయన చెప్పింది. ఊరికే యాదాలాపంగా చెప్పేరు. చెప్పేక శారద ఏమంటుందో ఆయన ఎదురు చూడలేదు. శారద ఏమీ అనలేదు.

మర్నాడు ఆ ఊళ్లో రెండిళ్లలోనూ ఇరవైనాలుగు గంటలు గడిచేసరికి నలభైఎనిమిది గంటలు పట్టింది. లేదా ఆ రెండిళ్లవాళ్లకీ అలా అనిపించింది. ఒకటి పెళ్లికొడుకు వారిది. రెండోది పెళ్లికూతురువాళ్లది. మూడోరోజు తెల్లవారలేదు. ఇంకో గంటకు తెల్లవారుతుందనగా చలపతి వాళ్ల పక్కింటికుర్రాడు సైకిలుమీద బాణంలా దూసుకువచ్చేడు.

చలపతితండ్రి హఠాత్తుగా గుండెనొప్పి వచ్చి కళ్లు మూశారు. విన్నవాళ్లు, ''ఒకొక్కరి జన్మవిశేషం. కోడలు గృహప్రవేశం, అత్తగారి అగ్నిప్రవేశం సామెత ఉండనే వుంది కదా,'' అన్నారు. ఈ మాటలు శారదపరంగా అన్నవి. ''ఆ ఆస్పత్రి చల్లని ఆస్పత్రి. క్షేమంగా వెళ్లి లాభంగా వస్తారు డాక్టర్లు. జబ్బుతో లోపలికి వెళ్లిన మనిషి మటుకు తన రెండు కాళ్లమీద నడిచి పైకి రావడం చూడలేదు,'' అని ఆస్పత్రిని దుమ్మెత్తి పోశారు కొందరు. మొత్తమ్మీద శారదకి కావలిసిన మామగారు ప్రపంచపు నాటకరంగంమీద తనపాత్రకి భరతవాక్యం పలికేసి ఊరుకొన్నారు. అయితే ఆయన ఎట్టి అసమయంలో చేశారో, దానివల్ల కలిగే దుష్ఫలితాలేమిటో ఆలోచించలేదనే చెప్పాలి.

పెళ్లిమాట మళ్లీ ఎవరూ ఎత్తలేదు. చావింట్లో పెళ్లి పనికిరాదు. కన్యాదానమైతే ఓ పక్షానికి ఆలోచించొచ్చు కానీ పరిగ్రహణం అసలే పనికిరాదు ఏడాదివరకూ.

శారద ఎట్టి దురదృష్టజీవో - పుట్టగానే తల్లి పోవడం, చదువొంట బట్టకపోవడం, తండ్రి కవిగా పైకి రాలేకపోవడం - మొదలయినవన్నీ ఈ పెళ్లి చెడడంతో పైకి వచ్చేయి. ఆ అమ్మాయి నష్టజాతకురాలు అన్నారు. ఏడాది అయేక దశరథరామ్మూర్తిగారు కబురు

పెట్టినప్పుడు చలపతి కూడా ఇంచుమించు అదే భాషలో మాటాడి ఆఖరిమాటగా, ''అమ్మది అదోరకం, నమ్మకాలూ అవీనూ. మనం చెప్పలేం,'' అన్నాడు.

ఆయన, శారద తండ్రి, నిశ్చేష్టుడయి నిలబడిపోయారు. ఇందులో ఎవరూ నిందార్హులు కారు. ఆయన వెనుదిరిగి వెళ్లిపోతుంటే, చలపతి గేటుదాకా వచ్చి, ''ఏమీ అనుకోకండి'' అన్నాడు.

దశరథరామ్మూర్తిగారు అవేళ అలా భంగపడి ఇంటికొస్తూండగా చూసిన ఒక సంస్కృతం మేష్టారు ఇందుకే కదా హిమవంతుడు పార్వతిని పరిగ్రహించమని శివుని కోరడానికి సందేహించాడు అనుకున్నారు. ఆరోజు తండ్రిని పలకరించడానికి శారద భయపడింది. ఆ తరవాత వారంరోజులు ఆయన శారదమొహం చూడలేకపోయారు. ఆ తరవాత పెళ్లి సంబంధాలు చూశారు.

కట్నం ఎంతిస్తారు?

ఏమీలేదు. ఆస్తి అంతా మొత్తం వెయ్యిరూపాయలు. అంతే.

పిల్ల చదువుకుందా?

లేదు. చూడ్డానికి చక్కగా ఉంటుంది. కానీ ఆడపిల్లని పెళ్లి చేసుకోడం చూడ్డానికి కాదే!

పనిపాటలు వచ్చు.

పనిపాటలు రానివాళ్లెవరు ఈరోజుల్లో?

ఎవరో ఓ పెళ్లికొడుకు వచ్చి ''ఈఅమ్మాయినే కదూ అప్పుడు సుందరానికి ఇద్దామనుకున్నారు'' అనేసి వెళ్లిపోయాడు.

దశరథరామ్మూర్తిగారికి ఏం చెయ్యాలో తెలీలేదు.

ooo

''రాజమండ్రీ ఎందుకు వెళ్తున్నారు?'' అన్నాడు చలపతి మాట మార్చాలనో, ఎదుటిమనిషిని మంచి చేసుకోవాలనో.

శారద అవమానభారంతో కృంగిపోతూ, ''ఏమో,'' అంది. ఆ ఒక్కమాట, ఆమెవైపు ఒక్క చూపు చాలు సగటు మనిషికి సంగతేమిటో అర్థం చేసుకోడానికి.

ఆయన ఏదో సంబంధంగురించి విచారించడానికి వెళ్తున్నారు.

శారదని ఆ క్షణంలో ఓదార్చాలనిపించింది చలపతికి. "విచారించి మనసు పాడుచేసుకోకు, శారదా! జరిగేవి ఎలాగూ జరక్కమానవు."

శారదకన్నులలో నీరు సుడులు తిరిగింది. తనపట్ల జరగకూడనివి జరుగుతున్నాయి. ఆ క్షణంలో శారద చప్పున నోరు జారింది. "నాన్నగారు ఇంత క్షోభ పడడానికి కారణం ఉద్యోగంనించి రిటైరయినా బాధ వదిలించుకోలేకపోవడానికి కారణం మీ మూర్ఖత్వం," అంది ఎటువంటి పరిస్థితుల్లోనూ మాట తూలని శారద.

చలపతికి మొహమ్మీద చురక వేసినట్లయింది. అతను లేచి వెళ్లి, కూజాలో నీళ్లు గ్లాసులో పోసుకుని, మళ్లీ వచ్చి కూర్చున్నాడు.

శారద ఈ చర్య కనిపెట్టిందో లేదో ఆమె హృద్గతభావాలేమిటో చెప్పడం కష్టం. ఏదో తట్టి, అక్కడ్నించి లేవబోయింది కానీ ఈ లోపలే చలపతి అందుకున్నాడు. "నీకు మీనాన్నగారిమీద ఎంత గౌరవముందో నాకు మానాన్నగారిమీద అంత గౌరవమూ ఉంది."

ఉంటే ఆయన ఇచ్చినమాట ఎందుకు నెరవేర్చరో శారదకి అర్థం కాలేదు.

"మూఢనమ్మకాలని నువ్వూ నేనూ ఇక్కడ కూర్చుని కొట్టిపారేయొచ్చు. హేళన చెయ్యొచ్చు. కానీ తరతరాలుగా వస్తున్న సాంప్రదాయాన్ని త్రోసిరాజనడం - కనీసం మన ముందుతరంవారికి అంత తేలిక కాదు," చలపతి క్షణం ఆగాడు.

శారద మాట్లాడలేదు. లేవాలని రెండోమారు చేసిన ప్రయత్నం కూడా విఫలమయింది.

చలపతి మళ్లీ అందుకున్నాడు. "పోనీ, నేను చేతకానివాణ్ణి. అసమర్థుడిని. అమ్మ నీకు పరాయిది కాదు కదా. నువ్వే నచ్చచెప్పకూడదూ?"

"ఇప్పుడే వస్తా," చలపతి మరోమాట అనేలోపున శారద అంతర్థానమైపోయింది. అతను మాటాడిన అవివేకపు మాట, అసందర్భపుసలహా శారదకి వెన్నులో పొడిచినట్టయింది. తనకన్నా విద్యావంతుడూ, అనుభవజ్ఞుడూ, పెద్దవాడూ అయిన చలపతి ఇటువంటి సలహా ఇవ్వగలడని తను అనుకోలేదు. ఇతడంటే తనకి ఒకానొకప్పుడు గౌరవం.

‘‘ఇప్పుడే వస్తా’’నన్న శారద ఎప్పటికీ రాకపోవడంతో చలపతి వంటింటిగుమ్మంలోకి తనే వచ్చి, ‘‘మరి నే వస్తా,’’ అన్నాడు.

శారద విందో, వినే ఊరుకొందో తలెత్తలేదు.

చలపతి తటపటాయిస్తూ అన్నాడు, ‘‘నీకు అన్యాయం జరిగింది. ఆ విషయం నాకు తెలుసు. కాని అమ్మ ఎప్పుడూ అంటూ ఉంటుంది పదహారు పళ్లలో ఒక పల్లు విషం అని. నువ్వు ఏమన్నా నిన్ను క్షోభ పెట్టిన పాపం మమ్మల్ని కట్టి కుడుపక మానదు. అంతే నే చెప్పదలుచుకున్నది, వస్తా.’’

శారదకి మనసులో మండింది. మొదటిమారు దెబ్బ తగిలినప్పుడు కలిగినంత బాధ రెండోమారు తగిలినప్పుడు ఉండదు. ‘‘ఎందుకు బావా! మిమ్మల్ని మీకుటుంబాన్ని దూషించి, దుమ్మెత్తి పోసి, నేన్నొల్లుకునేది ఏముంది?’’ అంది నిరామయంగా.

చలపతి రెండడుగులు వేసి మళ్లీ ఆగిపోయాడు. అతనొచ్చిన పని?

‘‘నిన్నొకటి అర్థించడానికి వచ్చాను,’’ అన్నాడు.

శారద మాటాడలేదు.

‘‘అది నీవల్ల అవుతుంది,’’ అన్నాడు.

‘‘’’సాంప్రదాయానికి విరుద్ధమయినది కాకపోతే …’’ ఎంత దాచినా మాట మొన వాడకుండా వచ్చింది.

తీక్ష్ణమయిన ఎండదెబ్బ తిన్నవాడిమొహంలా అయింది చలపతిమొహం. ‘‘ఇలాటిమాటలు ఎన్నయినా సహిస్తాను ఒక్కగాని ఒక్క కొడుక్కోసం,’’

‘‘కిష్టుడిమాటా?’’

‘‘వాడిమాటే. మొదట్నుంచీ వాడెంత తెలివైనవాడో నీకూ తెలుసు. యూనివర్సిటీఫస్టు వస్తుందని ప్రాణాలు ధారపోసి చదివేడు మూడేళ్లూను. తీరా పరీక్షలవేళకి ఒళ్లు చెడి విత్‌డ్రా అయేడు. ఈ ఏడు నాన్నగారు పోవడంతో మతి చలించినంతపనైంది.’’

శారద భావరహితమయిన మొహంతో వింటోంది.

‘‘ఇప్పుడు ఫస్ట్ క్లాస్ కాదు కదా సెంకడ్ క్లాసుకి పధ్నాలుగు మార్కులు తక్కువొచ్చేయి. ఈ సంగతి తెలియగానే వాడేం చేస్తాడో ఊహించడానికి కూడా భయంగా ఉంది,’’ చలపతి దీనాతిదీనంగా మొహంపెట్టి అన్నాడు ఈ మాట.

శారదకి అతనిఅర్థం బోధపడింది. కానీ ఒకనాడు పొరుగింట్లో ఉండి, ఆయన అభిమానానికి పాత్రురాలయిన తను ఇప్పుడు ఆ అభిమానాన్ని ఇలా మార్కులు అడిగి ఖర్చు రాయించవచ్చునా? ఇది తగినపనేనా? నిజమే. ఈ పని తనవల్ల అవుతుంది. కానీ నీచంగా లేదూ?

తరతరాలుగా వస్తున్న ‘‘సాంప్రదాయం కాదేమో కానీ నీతిదూరంగా లేదూ?’’

చలపతికి ఈమారు కోపం వచ్చింది. ముక్కూ మొహం తెలీని పరాయివాడెవడో ‘‘నీకొడుకు ధీశక్తిగూర్చి మాకేం తెలుసు?’’ అన్నట్టుగా మాటాడుతూంది మేనత్తకూతురు. అక్కడికీ తమాయించుకుని అన్నాడు, ‘‘నేనేమీ కోరరాని కోరిక కోరడంలేదు. ఎంతోమందికి తగినవారు అని తోస్తే మార్కులు కలిపి క్లాసు ఇవ్వడం అందరికీ తెలిసినసంగతే కదా,’’

‘‘అయితే నేనెందుకు కలగజేసుకోడం?’’ అంది శారద - నీకొడుకు తగినవాడని తోస్తే నీకొడుక్కి వాళ్లే ఇస్తారు అన్న భావం వ్యక్తం చేస్తూ.

చలపతి ఈ సంభాషణ పూర్తయినట్టు గ్రహించాడు. ‘‘ది ఎండ్’’ అన్నట్టుంది ఆమెస్వరం.

‘‘ఇహ వస్తానని చెప్పడం కూడా వెక్కిరించినట్టుంటుంది. ఇప్పటికి మూడుమార్లు చెప్పానామాట. నాజీవితంలో నేనెవర్నీ ఏదీ అడగలేదు నోరు విప్పి. చిన్నదానిపైనా నీచేత పడ్డట్టు ఇన్ని మాటలు ఎవరిచేతా పడనూ లేదు. నువ్వు ఇందాకా చెప్పావు కదా మిమ్మల్ని క్షోభ పెట్టేమని. అది అనుభవంలోకి రావడానికి ఇంతకన్న ఇంకేమీ ఉందనుకోను. నువ్వు మాకేమీ సాయం చెయ్యక్కర్లేదు. మనం ఇహ కక్షలు సాధించుకోడానిక్కూడా ఏమీ లేదు. అదే నయం,’’ అనేసి చరచర వెళ్లిపోయాడు చలపతి.

ఆవేళ శారద రాత్రివంట మొదలుపెట్టేసరికి ఏడు దాటింది. నిప్పు చేస్తూండగా దశరథరామ్మూర్తిగారు వచ్చేరు.

‘‘మీకోసం చలపతి బావొచ్చాడు,’’ అని చెప్పింది.

‘‘ఎందుకు?’’ అన్నారాయన. ఈమధ్య ఆ యింటికీ ఈ యింటికీ మధ్య రాకపోకలు తగ్గిపోయాయి.

‘‘ఏమో’’ అంది కుంపట్లో చింతబొగ్గులు చిటపట్లాడుతుంటే వెనక్కి జరుగుతూ.

మర్నాడు సుందరం రోడ్డుమీద కనిపిస్తే అడిగేరు దశరథరామ్మూర్తిగారు చలపతి ఏదైనా పనిమీద వచ్చాడా అని.

సుందరానికి అర్థం కాలేదు. శారద ఎందుకు చెప్పలేదు? ‘‘ఏమీ పనిమీద వచ్చేడనుకోను,’’ అన్నాడు.

000

పది రోజులయింది. సుందరానికీ డిప్యూటి కలెక్టరుగారమ్మాయి జానకికీ పెళ్లి నిశ్చయమయినట్టే అందరు నిశ్చయం చేసుకున్నారు. ఆవేళ ఫెళ్లున కాస్తున్న ఎండ ఒక్కమారుగా ఉరిమింది. అరె! చినుకులు పడుతున్నట్టున్నాయే అనుకునేలోపునే వాన హోరున కురవసాగింది. జల్లు విసిరి కొడుతోంది. వస్తాదుల్లాటి మనుషులు ఎదురుగాలిలో వెనక్కి కొట్టుకుపోయేట్టున్నారు.

తండ్రి వీధిలోంచి ఇంకా రాలేదని శారద భయపడుతూ కిటికీదగ్గరకి వచ్చింది. వరండాలో వ్యక్తి ఒక్కక్షణం ఆగి, ‘‘నేను,’’ అన్నాడు.

శారద కూడా ఓ క్షణం ఊరుకుని, ‘‘నువ్వా?’’ అని తలుపు తీసింది.

వజవజ వణుకుతూ లోపలికొచ్చేడు సుందరం. పూర్తిగా తడిసిపోయేడు. శారద లోపల్నుంచి తువాలూ, లుంగీ తెచ్చి ఇచ్చింది. మళ్లీ లోపలికి వెళ్లి తండ్రికోసం ఫ్లాస్కులో ఉంచిన కాఫీ గ్లాసులో పోసి తీసుకొచ్చింది.

‘‘మామయ్య ఇంట్లో లేరా?’’ అనడిగాడు సుందరం, ఇంతవరకూ తామిద్దరిలోనూ ఏ ఒక్కరూ మాటాడలేదని జ్ఞప్తికి తెచ్చుకుని.

‘‘లేరు. ఎక్కడ చిక్కుపడిపోయారో ఈ వానలో. రెండురోజుల్నుంచీ ఒంట్లో బాగులేదు కూడాను,’’ అంది.

అదన్నమాట మొహం వాడినట్టుండడానికి కారణం అనుకున్నాడు సుందరం. మళ్లీ అతనికి ఏం మాటాడాలో తెలీలేదు.

శారదకి అక్కడ ఉంటే బాగుంటుందో లోపలికి వెళ్ళిపోతే బాగుంటుందో తెలీలేదు.

"కిష్టుడికి క్లాస్ వచ్చింది నీధర్మమా అంటూ," అన్నాడు కృతజ్ఞతాభావం వెల్లివిరియగా.

"నాదేముంది? విధినిర్ణయం అలా వుంది కాబోలు," అంది శారద.

సుందరానికి హఠాత్తుగా తాను శారదపట్ల అన్యాయంగా ప్రవర్తించాననీ, అయినప్పటికీ సాక్షాత్తూ భూదేవివలె ఓరిమిగల శారద తమని మన్నించి, పైగా ఉపకారం చేసి తన సహృదయత ప్రకటించుకుందనీ తట్టింది. ఆమాటే వెంటనే శారదతో చెప్పి, క్షమించమని వేడుకుని జారిపోబోతున్న ఈ మాణిక్యాన్ని చేజిక్కించుకుంటే బాగుండు అని అనుకున్నాడు. కానీ ఆ మాట చెప్పడం ఎలా?

"మామయ్య రాజమండ్రీ వెళ్లివచ్చారు కాబోలు," అన్నాడు ప్రస్తావనగా.

"ఆఁ, వచ్చేరు," ఒక్కమాట విరుపులో సమాధానం చెప్పేసి, లోపలికి వెళ్లిపోయింది.

సుందరం వంటించివేపు నడవడమా, వీధివేపు నడవడమా అన్నసందిగ్ధంలో కొంచెంసేపుండి, రెండడుగులు వంటింటివేపే వేసి, "నేఁ వెళ్తున్నా," అన్నాడు.

"ఆఁ" అంది శారద సావిడివేపు ఒకడుగు వేసి.

"ఒకమాట. పొరపాటులో నిన్నేదో అనడం జరిగింది. ఆ మాటలో నిజం నువ్వే ఆలోచించు," అన్నాడు.

శారద నిరసనగా నవ్వింది ఆ పెదిమవిరుపులో ఎన్ని అర్థాలయినా చెప్పుకోవచ్చు. "ఒకమారు ఒప్పుకుంటావు కానీ ఎన్నిమార్లు ఒప్పుకుంటావు విద్యాగంధం లేని పశువుని" అని ఉండొచ్చు. "ఇంత నిలకడలేని మనిషివా?" అని కావచ్చు. ఏదైతేనేం శారద పెదిమ కదల్చకుండానే సుందరం అక్కడినుండి కదిలిపోయాడు - మంచికో చెడుకో.

000

"సుందరం ఏమిటి? డిప్యూటీ కలెక్టరుగారి అమ్మాయిని చేసుకోనంటున్నాడుట," ఎవరో దశరథరామ్మూర్తిగారిని అడిగారు.

''ఆహా'' అన్నారాయన.

''అలా ఆహాఁ అంటావేమిటోయ్ ఆకాశంలోకి చూస్తూను. మన శారదనే తప్ప ఇంకెవర్నీ చేపట్టనని శపథం పట్టేడని ఊరు గగ్గోలెత్తుతూంటేను,'' అన్నాడా శ్రేయోభిలాషి.

నిజానికి జరిగినకథ ఇదీ. సుందరం ఆవేళ ఆ వానరాత్రి శారదని చూశాక తాను పొరబడ్డాననీ, ఆ పొరపాటు దిద్దుకోవాలనీ రూఢి చేసుకున్నాడు. ఆ పైన ఇంటికి వెళ్లగానే జానకిని చేసుకోననీ, శారదని చేసుకుంటాననీ, వివరాలు అడగవద్దనీ ఒకేవాక్యంలో చెప్పి ఊరుకున్నాడు. చలపతి కసిరి చూసినా లాభం కనిపించలేదు. పోగా చలపతి ఏ మొహంతో మామయ్యగారింటికి వెళ్లడమా అని ఆలోచిస్తుండగానే ఊరివారే ఆయనదగ్గిరికి మోసేరు ఆ వార్త.

దశరథరామ్మూర్తిగారు ఆ వార్త విని ఊరుకున్నారు. తరవాత శారదతో అని చూశారు. ''ఛూశావా, సుందరం చేసిన పొరపాటు దిద్దుకోవాలనుకుంటున్నాడుట,'' అని.

''కలెక్టరుగారూ వాళ్లూ తాంబూలాలు కూడా పుచ్చుకున్నారు,'' అంది శారద. తండ్రికి తనఅభిప్రాయం సూటిగా చెప్పలేక. తండ్రిమొహంలోకి సూటిగా చూడలేకపోతూంది. తననుంచి ఆయన ఎటువంటి మనస్తాపానికి గురి అవుతున్నారో చూస్తూన్నా తనేమీ చేయలేదు. ఏం జన్మ అనిపిస్తోంది.

''తాంబూలాలకేమిటి? మనం ఇచ్చిన తాంబూలాలూ పుచ్చుకున్నారు, వేసుకున్నారు,'' హేళనగా నవ్వేరాయన.

ఈయనకి మతి గానీ పోతూందేమో! శారద రివటాకులా కంపించింది.

''నన్నోడి తన్నోడేనా? తన్నోడి నన్నోడెనా?'' అని ప్రశ్నించిన ద్రౌపది తలపుకొస్తోంది. ''కాఫీ తీసుకొస్తానుండండి,'' అంది శారద లోపలికెళ్తూ.

దశరథరామ్మూర్తిగారు, తన మనోవేదనకి కారణమైన కూతురు ఎదుటినుండి తొలగిపోగానే, తనకి అలవాటయిన భగవద్గీతాపఠనంలో మునిగిపోయేరు.

ఆయనకి మరి కాఫీ రాలేదు.

అదేరోజు మునిమాపువేళ పనిమనిషి అప్పలమ్మ కొడుకు సుందరంచేతిలో ఒక చిన్న చీటి పెట్టి వెళ్లిపోయాడు.

“పొరపాటు దిద్దుకుంటానంటూ అదే పొరపాటు మళ్లీ చేయడం తెలివైనపని కాదని నాకు తోస్తోంది. ఇంతదాకా రావడమే పొరపాటు. జానకిని క్షమాపణ కోరుకోడం సమంజసం కదూ.”

సుందరానికి ఈ చీటీ ఎవరు పంపేరో అర్థం అయింది. అతను నిర్ఘాంతపోయాడు.

000

సుందరానికీ జానకికీ అట్టహాసంగా పెళ్లి అయింది. పెళ్లికి దశరథరామ్మూర్తిగారినీ, శారదనీ రమ్మని నొక్కి నొక్కి చెప్పారు చలపతి దంపతులు.

ఊరునించి ఊరు వెళ్లడం కనక పెళ్లికి వెళ్లలేదు కానీ మగపెళ్లివారింట్లో గృహప్రవేశానికీ, సత్యనారాయణవ్రతానికీ వెళ్లి పెళ్లికొడుక్కి కట్నం చదివించి వచ్చేరు దశరథరామ్మూర్తిగారు.

ఆర్భటం హోరుగాలీ అంతా ముగిశాక, పెళ్లికొడుకు వీలు చిక్కగానే పెళ్లికూతుర్ని అడిగిన మొదటిప్రశ్న, “అయితే నీకు శారదని ఎలా తెలుసు?” అని.

దీనికి వధువు జవాబు అయోమయపుచూపులు. “శారదెవరూ?”

“తెలీదన్నమాట” అని ఆశ్చర్యపడి, ఎందుకలా అడిగానా అని విచారపడి సుందరం నాలుక్కరుచుకున్నాడు.

“అదే తెనాలిలో సర్వరుగా పని చేస్తూ చచ్చిపోయాడే నటరాజన్ అని” అనేసి, “ఇవాళ సినిమాకి వెళ్దామా?” అని అడిగాడు తరవాత ఏ ప్రశ్నకీ తావివ్వకుండా.

000

“ఒకసారి పత్నీసమేతంగా మాయింటికి రా,” అని శారద ఎప్పుడూ సుందరాన్ని ఆహ్వానించలేదు.

“ఇదీ జరిగిన సంగతి. ఈమే శారద,” అని సుందరం ఎప్పుడూ జానకికి చెప్పలేదు.

తనచుట్టూ రోజూ కనిపిస్తున్న వందలాది ప్రజల్లో “శారద” ఎవరో, సుందరం అడిగినప్రశ్నకి కారణం ఏమిటో జానకి తెలుసుకోలేదు.

# 12. జీవాతువు

‘‘అరుంధతి వెళ్ళిపోయింది.’’

‘‘పోయిందా?’’ అన్నాను తుళ్ళిపడి.

నాగమణి పెకిలిగా నవ్వింది. ‘‘మ్. వెళ్ళిపోయింది,’’ అంది.

ఎందుకు వెళ్ళిపోయింది? ఎలా వెళ్ళిపోయింది? ఎక్కడికి వెళ్ళిపోయింది?

నాగమణిని అడిగి లాభంలేదు. నాగమణి సరైన జవాబు చెప్పదు సరి కదా పైపెచ్చు అవాకులూ చెవాకులూ పేల్తుంది. నేను అడగను. కానీ నాగమణి ఊరుకోదు.

‘‘అత్తాకోడళ్ళు పేచీ పడ్డార్ట.’’

000

ఐదేళ్ళపాటు అత్తింటివారిని అడ్డాల్లో బిడ్డల్ని సాకినట్టు సాకిన అరుంధతి ఎక్కడికి ఎలా ఎందుకు వెళ్ళిపోయిందో నాకర్థం కాలేదు. ఒక నిర్దుష్టమైన సంస్కారాన్ని అలవరుచుకుని ఆచరణలో పెట్టి నలుగురిచేతా శభాషనిపించుకున్న అరుంధతి చవకబారు హోటల్లో సర్వరులా అత్తగారితో పేచీ పెడి వెళ్ళిపోయిందంటే ... ఆ మాట నాకర్థం కాలేదు.

‘‘ఏమైనా బరువు మోస్తున్నట్టు నటించడం, కొమ్మెత్తేవేళకి భుజం తప్పించడం - అదీ ఒక నేర్పే,’’ అంది నాగమణి.

నాగమణికి మహా భారతం చూపించి ‘‘ఏమిటిది?’’ అనడిగితే ఎర్రట్ట బొండు బుక్కు అని చెప్పగలదు. కుడిచేతి రెండు వేళ్ళూ ఎడంచేతి రెండు వేళ్ళూ చూపించి ‘‘ఎన్ని?’’ అంటే ‘‘రెండు రెళ్ళు’’ అంటుంది. కాకపోతే ‘‘నీ రెండు చేతులకీ నాలుగు వేళ్ళున్నాయా?’’ అనడుగుతుంది. నాగులకి చెవుల్లేవని జనవాక్యం. నాగమణికి చెవులూ, బుర్రా కూడా లేవు.

గబ గబ నాపని ముగించుకుని వెయిటింగురూంకి వెళ్ళిపోయేను.

000

అరుంధతితో నాకు పరిచయం రెండేళ్ళకిందట అనుకుంటాను. ఒక గది అద్దెకి తీసుకుని చదువుకుంటూండేదాన్ని.

ఆవేళ ఆదివారం. ఎండ నిప్పులు చెరుగుతూంది. క్లాసుకి సంబంధించిన పుస్తకం ఒకటి పుచ్చుకుని మంచం, పక్కా అన్నీ ఏర్పాటు చేసుకుని పడుకున్నాను చదువుకుందాం అన్న సదభిప్రాయంతోనే. నిద్ర కాకపోయినా ఎండపొడకి కళ్ళు మూసుకుపోతున్నాయి నాప్రమేయం లేకుండానే. ఇంటివారికోడలు పాపని పిలవడం వినిపిస్తూంది దూరంగా పారా హుషార్ అన్నట్టు.

"పాప మీఇంట్లో ఉందాండీ?" అంటూ చేరవేసిన తలుపు ఓరవొంపుగా తోసుకు తొంగి చూస్తూ ప్రశ్నించింది ఒకావిడ.

"లేదండీ," అన్నాను మత్తుగా, మంచుమీంచి లేవకుండానే.

"ఇంతట్లోకే ఎక్కడికి వెళ్ళిపోయిందో," అన్న మాటలు నేపథ్యంలో లీలగా వినిపించి అంతమైపోయేయి.

మళ్ళీ "పాపా … పాపా …" అంటూ మూడో నాలుగో ప్రసారాలూ ఆవిడ ఇంకెవరితోనో ఏదో అన్నట్టు ఇంకో కొత్త స్వరమూ ..

"క్షమించండి. పాప మీగదిలోకి రావడం నేను చూసేను."

తుళ్ళిపడి లేస్తూ, "ఫరవాలేదులెండి, రండి," అన్నాను.

అరక్షణంసేపు - నిద్ర తూలగొడుతూంది. గుమ్మంలో నిలబడిన వ్యక్తి నిద్రమత్తు తేలగొడుతూంది. లేత ఊదారంగు వాయిల్ చీరా, మంకెనపువ్వురంగు జాకట్టూ, మొహంలో స్నిగ్ధచ్ఛాయలూ .. ఎక్కడైనా చూసేనో? చూసేననుకుంటున్నానో?

"మంచి నిద్ర చెడగొట్టినట్టున్నాను," ఆ స్వరంలో క్షమాపణలు ధ్వనించేయి.

"ఆఁ, లేదండీ," అని లోపలికి రమ్మని, "పాప లోపలికి రాడం నేను చూడలేదండీ," అన్నాను మొదటి ప్రశ్నకి సమాధానంగా. అంటూ మంచం దిగి చుట్టూ చూసేను.

"భయపడక్ఖర్లేదని మీరు చెప్పండి," అందావిడ మంచంకిందకి సౌంజ్ఞ చేసి చూపిస్తూ.

అటు చూసేను. మంచంకిందనించి కవటాకుల్లాటి చిన్నిపాదాలు రెండు దర్శనమిచ్చిందాకా నాకు బోధపడలేదు ఆవిడమాటలు. నవ్వుతూ ఆ రెండు పాదాలూ పుచ్చుకు మెల్లిగా లాగేను. నావెనక ఎవరున్నారో పాప చూడలేదు.

"స్, స్. ప్రైవేటు మేష్టరు," అంది పాప లక్కపిడతలాటి నోటిమీద మావిడిచివుళ్ళలాటి వేళ్ళు కదిలిస్తూ.

"ఏమిటీ?"

"ప్రైవేటు చెపుతుందిట," క్లాక్ టవరుమీంచి దూకుతుందిట అన్నంత బెదురుతో.

"నాక్కూడానా?"

పాప నావేపు అయోమయంగా చూసింది.

"చదువుకోకపోతే ఎలా?" అంది పాపతల్లి కఠినంగా.

"ప్రైవేటు నాకు చెప్పండి. పాపకక్కర్లేదు," అన్నాను పాపవేపూ ఆ ప్రైవేటుమేష్టరువేపూ చూస్తూ. తీరా అనేసింతరవాత ఎందుకలా అన్నానా అనిపించింది.

"నేను ప్రైవేటు చెప్పను," అందావిడ. అసలు ఉన్న "మిస్చీఫ్" అంతా ఆ పదంలోనే ఉంది. అది ఆవిడ గ్రహించింది.

"చెప్తావు," అంది పాప పొడిచేసేలా చూస్తూ.

"చెప్తారు అనాలి," అంది పాపతల్లి పాపతలమీద ఓ చిన్న మొట్టికాయ వేసి.

పాప బుంగమూతి పెట్టుకు నిలబడింది.

గురుత్వం వహించను వచ్చిన ఆ మానవురాలు "వస్తానండీ," అంది వెనుదిరగబోతూ.

"సర్లెండి. తరవాత చూద్దాం," అంది పాపతల్లి.

ఆవిడ నాదగ్గర కూడా శలవు తీసుకుని వెళ్ళిపోయింది.

"అంటీ ముట్టనట్టు అలా దూరంగా నిలబడితే ఇవాళ కాదు రేపైనా దీన్నెలా దారికి తీసుకొస్తుంది? పాఠాలెలా చెప్తుంది?" అంది పాపతల్లి చేతులూ కళ్ళూ తిప్పుతూ.

"ఆవిడే చెప్తుంది, పాపే వింటుందిలెండి," అన్నాను.

మర్నాడు నేను కాలేజీనించి వచ్చేసరికి ఎదురుగుండా సోఫాలో పాపా, వాళ్ళ ప్రైవేటు మేష్టరూ కనిపించేరు ముందుగదిలో. ఆవిడ నన్ను చూసి మందహాసం చేసింది. అంతే.

ఆవిడపేరూ, వివరాలూ కనుక్కోడానికి నేనెప్పుడూ ప్రయత్నించలేదు. కానీ పాప మటుకు ఆవిడంటే ఊః ఇదయిపోయేది. ప్రైవేటు మొదలు పెట్టి మూణ్ణెల్లయినా అయిందో లేదో పాపవాళ్ళనాన్నకి బదిలీ అయిపోయింది. అరుంధతి, అదే పాప ప్రైవేటుమేష్టరు, చాలా విచారించింది.

ఆ తరవాత పదిహేను రోజులనాడు హఠాత్తుగా మళ్ళీ అరుంధతి ప్రత్యక్షమయేసరికి ఆశ్చర్యపోయేను.

"పాప బాగా అలవాటయిపోయందండీ. సాయంత్రాలు ఏమీ తోచడంలేదు," అంది గుమ్మంలో నిలబడి.

"నిజమేనండీ. రండి," అన్నాను లోపలికి ఆహ్వానిస్తూ.

రెండు, మూడు రోజుల్లో పాప పుట్టినరోజు వస్తోందిట. నాకు తెలీసే తెలీదు. ఎడ్రెస్ ఇస్తే తను ఎంబ్రాయిడరీ చేసిన గౌను పాపకి పంపిస్తుందిట.

గౌను చూపించింది నాకు. మంచి పనివాడితనం ఉంది అందులో ఏదో మొక్కుబడికోసం చేసినట్టు కాక. ఒకవేళ ఆ కమనీయ కళాఖండం వెనక ఏద్దైనా కన్నీటిగాథ దాగిఉందేమో - అనుంగు చెల్లి, అలవాటైన అన్నకూతురూ ... ఇంకెవరైనా ... నా ఆలోచనలకి నాకే చిరాకేసింది.

"పంపించండి," అన్నాను గౌను తిరిగి ఇచ్చేస్తూ. అప్పుడడిగేను అరుంధతిని, "మీరేం చేస్తున్నార"ని.

ఇంటర్మీడియట్ పాసయి సెకండరీ గ్రేడ్ ట్రెనింగయిందిట. ఉద్యోగంకోసం చూస్తోంది. "నేను బి.యే.కి కడతానండీ," అంది నాపుస్తకాలు ఒకొకటే తీసి చూస్తూ.

"మంచిదే. అయం ముహూర్తో సుముహోర్తోస్తు."

"మీరు నాకు సాయం చేస్తారా?"

"సాయమా?"

“ఏం?”

“ఏం ఏమిటండీ? నాదే ముప్ఫైతొమ్మిది పర్సెంటు నాలెడ్జి. పరీక్ష గట్టెక్కుతుందో చెట్టెక్కుతుందో అని నేన్భూస్తున్నాను. నేను మీకు చెయ్యగల సాయం నోరు మూసుక్కూచోడమే.”

“నేను హాస్యానికనడంలేదు. మీచదువు అయిపోగానే మీ నోట్సు మరెవరికీ ఇవ్వకండి,” అంది సీరియస్‌గా.

“ఇచ్చినా పుచ్చుకునేవాళ్ళు తరవాత తిట్టుకుంటారు. అంతకంటే ముందుమాట నాచదువు అయిపోవాలంటే యూనివర్సిటీవాళ్ళు బి.ఎ. ఎత్తేయాలి. ఇప్పుడు ఇంటర్మీడియట్ ఎత్తేసి కొందరి చదువులు పూర్తి చేసేసినట్టుగానే.”

అరుంధతి నవ్వుతూ “భలేవారండీ మీరు,” అనేసి వెళ్ళిపోయింది. పైచదువులు చదివించనూ లేక, పెళ్ళీ చెయ్యలేక తల్లిదండ్రులు ట్రైనింగుకి పంపించేరు కాబోలు అనుకున్నాను. పెద్ద కుటుంబం కాబోలు. అదే నిజమైతే ఇంకా బి.ఎ.కి కట్టి, బి.ఇడి.కి కట్టి … ఎప్పుడు అవుతాయి ఇవన్నీ. వెనకవాళ్ళని ఉద్ధరించేదెప్పుడు? మనిషి కూడా ఖర్చుదారులా కనిపిస్తోంది.

అరుంధతివిషయంలో నేను ఒక నిర్ణయానికి రాకుండానే తెల్లారిపోయింది. పుస్తకాలవిషయంలో మాత్రం ఒక నిర్ణయానికొచ్చేను. చేతిలో డబ్బు చీరెలమీద పెట్టి, పుస్తకాలు ఎరువు అడిగేవాళ్ళంటే నాకు భయం. అలాటి అప్పులు ఇచ్చినవాళ్ళకే కానీ పుచ్చుకున్నవాళ్ళకి జ్ఞాపకం ఉండవు.

అరుంధతి బి.ఎ. చదివే ఉద్దేశం ఇనప్పెట్టెలో పెట్టి, మునిసిపల్ గర్ల్స్ స్కూల్లో సెకండరీ గ్రేడ్ టీచరుగా చేరిందని తెలిసినప్పుడు మాత్రం మనసులో ఏమూలో కలుక్కుమంది.

“అందరిలాగే మీరు ఆశ్చర్యపోతున్నారా?” అంది ఓరోజు స్కూలికి నడిచివెళ్ళే వెళ్ళేవిషయమై.

“ఆశ్చర్యం కాదు కానీ ..,” అన్నాను నసుగుతూ.

"మా నాన్నగారు బరంపురంనించీ కాకినాడ నడిచి వెళ్ళేరంటే నేను నమ్మేను. నేను ఇక్కడ్నించి స్కూలికి నడిచి వెళ్తున్నానంటే ఆశ్చర్యపోయేవాళ్ళూ, ముక్కున వేలేసుకునే వాళ్ళూ, మూర్ఛ పోయేవాళ్ళూనూ," అంది తను.

తను చెప్పిందాంట్లో నిజం లేకపోలేదు. బస్సుకోసం పడిగాపులు పడే టైములో, బస్సులో చోటుకోసం పడే యాతనలో, కాలేజీ అప్‌లో బస్సు చేసే రొదతో అనుభవించే బాధలో నూరోవంతు ఉండదు నడిచివెళ్ళడంలో. అయినా అదేమిటో నడక అనగానే ఏమిటోగా ఉంటుంది!

"ఏమోలెద్దురూ. ఎవరేం అనుకున్నా నాకు మాత్రం నడవడమే హాయిగా ఉంది."

నిజమేనేమో. పొద్దున్న తొమ్మిదిగంటలకి చేసిన భోజనం, పగలల్లా క్లాసులూ, మళ్ళీ దాదాపు మూడు మైళ్ళు నడిచిన అరుంధతి వసి వాడలేదంటే తనకి హాయిగా ఉండే ఉండాలి.

"వస్తానండీ," అంది లేచి నిలబడి.

"కూచుందురూ, వెళ్ళొచ్చు. తొందరేమిటి?" అన్నాను చేయి పుచ్చుకు ఆపడానికి ప్రయత్నిస్తూ.

"లేదండీ. ఆరున్నర అయేసరికి మా అత్తగారికి ఫలహారం అయిపోవాలి."

"అత్తగారా!?" అనేసి చప్పున నాలుక్కరుచుకున్నాను. అప్పటివరకూ తన మెడవేపు పరీక్షగా చూడలేదు నేను.

నామొహంలో ఏమిటి తనకి నవ్వు తెప్పించిందో చెప్పలేను కానీ, "ఒకళ్ళు కాదు, ఇద్దరూ," అంటూ నవ్వుతూ వెళ్ళిపోయింది అరుంధతి.

000

అరుంధతి వెళ్ళిపోయింది. అరుంధతిని పెళ్ళి చేసుకున్న ఆ పురుషపుంగవుడు రెండు యమ్మే డిగ్రీలూ, ఒక లా డిగ్రీ తెచ్చుకున్న బృహస్పతి. అతనికి కన్నతల్లి కాక మరొక పెంపుడుతల్లి - ఇతగాడిని పెంచుకున్న తల్లి - ఉంది. కన్నతల్లికి ఈ బుద్ధిమంతుడు కాక ఇద్దరు కూతుళ్లూ, ఇద్దరు మొగపిల్లలూ ఉన్నారు. అరుంధతి పెళ్ళినాటికి ఇంటర్మీడియట్

పాసయింది. పెళ్ళయిన మూడో నెలనించీ అతను ఒకటే గొడవ "నువ్వు ట్రెనింగ్ చెయ్యకూడదా?" అంటూ.

"ఆ మాటల్లో ఆంతర్యం నాకు అప్పట్లో తెలీసేలేదు," అంది అరుంధతి కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ.

అరుంధతి ట్రెనింగయిన వారంనాడు తననీ ఇద్దరు తల్లులసంపదనీ భరించవలసిన మగాడు పరారీ!

అరుంధతి నిశ్చేష్టురాలయి నిలబడిపోయింది.

"జరిగినసంగతేమిటో నీకు తెలీకుండా ఉంటుందా? నిజం చెప్పు," అని ఆవిడనే నిలవేసేరు అత్తగారూ, ఆడబడుచూను. పెంపుడుతల్లి కూడా ఆమాటే అంది.

ఆ పరిస్థితుల్లో తాను చేయగలిగిందేమీ లేదు. పోదాం అంటే అరుంధతికి పుట్టిల్లంటూ ఏమీ లేదు. తల్లి లేదు. తండ్రికి ఇవన్నీ అనవసరమైన అనుబంధాలుగా తోచేయి. పినతల్లీ, పినతండ్రీ అరుంధతికి కన్నెచెర విడిపించి చేతులు కడుక్కున్నారు. ఇహ ఏదో ఉద్యోగం చేసి వచ్చిన నాలుగురాళ్ళతోనూ అత్తా, ఆడబడుచులమధ్య కాలం గడుపుకోడమే మిగిలింది.

"నలుగురు పిల్లలకి ప్రైవేట్లు చెబుదాం అనుకుంటున్నాను," అని అరుంధతి అన్నప్పుడు నాకేమనాలో తెలీలేదు. ఈ ఆరునెలల్లోనూ తోటకూరకాడలా వాడిపోయింది. అవ్యాక్తానందంతో మెరిసే కళ్లు ఆర్ద్రంగా తిరిగేయి. స్నిగ్ధసౌరభాలను వెదజల్లే పెదవులు పుచ్చిన చిక్కుడుకాయలా ముడుచుకుపోయాయి.

"సాయంత్రంవేళల్లోనూ, మధ్యాహ్నం ఒంటిగంటా రెండుగంటలమధ్యా వీలుంటుంది," అంది తనే మళ్ళీ.

రూపాయి, రూపాయికీ రక్తపుబొట్టు రాలుస్తున్నది. మొదటికే మోసం రావచ్చు అనుకున్నా నాలో నేను. "ఆరోగ్యం కూడా చూసుకోవాలి కదా. మీరు పడుకుంటే గ్లాసుడు మంచినీళ్ళు కూడా ఇవ్వరెవ్వరూ లెఖ్ఖకి చాలామందే ఉన్నా," అన్నాను.

"అలా ఆలోచిస్తే అందరం పడుకోవాల్సొస్తుంది అనతికాలంలోనే," అంది అరుంధతి నవ్వుతూ. ఆ నవ్వులో మునపటి జీవం లేదు.

అవును. తను తెచ్చే నెలసరి ఆదాయం బియ్యపుబస్తాకి సరిపోతుంది. "మధ్యతరగతి బడ్జెట్, ఒక కుటుంబంలో భర్తా, భార్యా, ఇద్దరు పిల్లలు ఉన్నారనుకుందాం," అంటూ వేసే ఊహాలోకపు బడ్జెట్ కుదరదిక్కడ. ఆ ఇంట్లో ఖచ్చితంగా నలుగురు పెద్దవాళ్ళూ, ముప్పొద్దులా మూడు కంచాలు చెల్లించే ఇద్దరు పిల్లలూ ఉన్నారు. అందరికీ అన్నీ కావాలి. అసలత్తగారికి పొద్దున్నే ఫలహారం, మధ్యాహ్నం భోజనం, సాయంత్రం కాఫీ కావాలి. పెంపుడత్తగారికి తొమ్మిదికల్లా భోజనం, మధ్యాహ్నం టీ, రాత్రి చపాతీలు కావాలి. పెద్దాడబడుచు నియమనిష్ఠతలో తనపాట్లు తనే పడుతుంది. చిన్నాబడుచు స్కూలికెళ్తుంది కాలక్షేపానికి. మొగపిల్లలిద్దరిదీ - చద్దన్నం తింటాను, వేడన్నం తింటాను, మామగారితో మళ్ళీ తింటాను అన్న తంతు.

"వీళ్ళందరితో ఎలా నెగ్గుకొస్తున్నారు?" అని నేనంటే,

"పోనిద్దురూ. ఎలా ఉన్నా రోజు గడిచిపోతుంది కదా," అంది అరుంధతి తేలిగ్గా.

ఎలా ఉన్నా రోజులు గడిచిపోతాయా?

ఆ తరవాత నెలా, నెలాపదిహేనురోజులపాటు అరుంధతి కనిపించలేదు. పరీక్షలు దగ్గరకొస్తున్నాయన్న హడావుడిలో నేనూ అంతగా పట్టించుకోలేదు తన విషయం.

000

చలేస్తోందని కిటికీ తలుపులూ, వీధి తలుపూ బంధించేసుకుని కూర్చున్నా. 1868 కన్వెన్షనూ, సూయజ్ క్రైసిసూ, ... ఏమిటో వెధవ గొడవలు. ఒకడు ఒక తెలివితక్కువ పని చెయ్యడం, మరొకడు మరొక తెలివైన పని చెయ్యడం, తన్నుకోడం, కొట్టుకోడం, వాటికి కారణాలేమిటీ అంటూ ఈ లెక్చరర్లు మమ్మల్ని చంపుకు తినడం ...

ఎవరో తలుపు తట్టినట్టనిపించి, ఖేడివ్ ఇస్మయిల్‌ని అప్పుల్లో వదిలేసి లేచి తలుపు తీసేను.

అరుంధతి!

"ఇంత రాత్రప్పుడు ... ఇలా .." అన్నాను ఆశ్చర్యపోతూ. అప్పుడు టైము ఐదు నిముషాలు తక్కువ తొమ్మిది.

''ఒక యాభై రూపాయలుంటే సర్దగలరేమోనని వచ్చేను,'' అంది సూటిగా చూస్తూ.

ఆ మాట నాకు అర్థం కావడానికి ఐదు నిముషాలు పట్టింది. ''పెట్టెలో బట్టలు సర్దుకోడమే రాదు నాకు,'' అన్నాను నవ్వుతూ.

''నేనూ అదే అనుకున్నాను,'' అంది తను చప్పున.

ఇంతవరకూ అక్కడ సీరియస్‌నెస్ లేదనే అనుకుంటున్నాన్నేను. ''ఎక్కడినించి వస్తున్నారు? ఏమిటి కథ?'' అన్నాను.

తను మహిళామండలి సెక్రటరీగారింట్లో ఇద్దరు పిల్లలకి ట్యూషను చెప్పి వస్తూందిట. రోజూ పొద్దున్నే ఇద్దరు పిల్లలు ఏడునించి ఎనిమిదివరకూ ఇంటికొచ్చి పాఠాలు చెప్పించుకు పోతారు. వాళ్ళకి పాఠాలు చెప్తూ వంట చేసుకుంటుంది. తొమ్మిదిన్నర ప్రాంతాల్లో ఓపినంతమటుకు ఫలహారాలవాళ్ళకి ఫలహారాలూ, భోజనాలవాళ్ళకి భోజనాలూ సిద్ధపరచి, తనూ రెండు మెతుకులు కతికి స్కూలికి వెళ్తుంది. మధ్యాహ్నానికి ఇంటినించే ఫ్లాస్కులో కాఫీ తీసుకెళ్తుంది. మళ్లీ సాయంత్రం ఓ గంటసేపు మహిళలకి జాకట్లు కత్తిరింపులు నేర్పుతుంది. ఇంటికెళ్ళి వంటా వార్పూ చూసుకోడం, మళ్ళీ ఏడున్నరకి ఇంటినించీ ఎనిమిదిన్నరవరకూ సెకండు ఫారం చదివే ఇద్దరు పిల్లలకి ట్యూషను. ఇవి రెండూ కమిషనరు అనుమతి తీసుకు చెప్తున్నవి. పొద్దున్న చెప్తున్నవి రహస్యం.

అరుంధతి ఆ ఇంట్లో ఏ స్వర్గసుఖాలు చవి చూస్తోందో? ''ఎందుకింత తాపత్రయం మీకు?'' అనడిగేను. నూరేళ్ళజీవితం ముప్పై యేళ్ళలో ముగించుకుంటే ఒరిగేదేమిటి? ఎవర్ని మెప్పించడానికి?

''ప్చ్,'' అంది. మళ్ళీ నావేపు ఒక చూపు చూసి, ''చూద్దాం,'' అంది. ఆ చూపు ఎలాటిదో చెప్పలేక ''ఒక చూపు'' అన్నాను.

''మా చిన్నాడబడుచు పుట్టినరోజు వచ్చే శుక్రవారంనాడు. చీరెలూ, సారెలూ తక్కువయితే వీల్లేదు నాలుగు వేళ్ళూ నోట్లోకి పోకపోయినా,'' అంది అరుంధతి వెలితిగా నవ్వి.

“ఏం మాటలండీ,” అన్నాను. అంతకన్నా ఏమనను? పరీక్ష ఫీజుకని దాచిన మొత్తంలోంచి ఐదు పదులు తీసి అరుంధతి చేతిలో పెడుతుంటే తన వదనం కృతజ్ఞతతో జ్వాజ్వల్యమానమయింది. చూడనట్టు నటించేను.

“ఈ డబ్బు నేను మీకు తిరిగి ఇవ్వలేకపోతేనో?” అంది సహం బాధగా, సగం వేళాకోళంగా.

“శిక్ష పడుతుంది.”

“ఏమిటా శిక్ష?”

“ఏముందీ… మీ ప్రియబంధువులతో ఎడబాటూ, ఈ గదిలో కారాగారమూను.”

“మంచివారు కదూ. ఆమాట ముందే చెప్తే మరో పాతిక పుచ్చుకుందును.”

“ముందు మీరు అప్పు తీర్చనని ప్రకటించాలి కదా,” అన్న నామాటలు గాల్లో కలిసిపోయేయి.

000

అరుంధతి చిన్నాడబడుచు పుట్టినరోజు వేడుక ఎంత ఘనంగా జరుగుతుందో ఊహించుకుంటూ ఆ రాత్రంతా గడిపేను. మర్నాడు అరుంధతి కొత్త చీరె తెచ్చి చూపిస్తుందనీ, లేకపోతే పుట్టినరోజు మహోత్సవం చూడ్డానికి నన్ను పిలుస్తుందనీ అనుకున్న నా ఆశలు వమ్ము అయేయి. ఎలా చూసినా ఈ పని సమర్థనీయంగా లేదు. ఒకవేళ తనకి ఒంట్లో బాగులేదేమో! ఆదివారం వెళ్ళి కనుక్కుందాం అనుకున్నాను.

000

శనివారం పొద్దున్న నాగమణి చెప్పిన వార్త ఇదీ - ఆరుంధతి వెళ్ళిపోయింది - కర్పూరం హరించిపోయినట్టు.

నేనిచ్చిన యాభై రూపాయలు జ్ఞాపకం వచ్చేయి. వెంటనే అలాటి ఆలోచన వచ్చినందుకు నన్ను నేనే చీవాట్లు వేసుకున్నాను. అయితే అరుంధతి ఎందుకు వెళ్ళిపోయినట్టు?

సాయంత్రం కిటికీదగ్గర కూచుని సన్నజాజి పూలు మాల కట్టుకుంటుంటే మగపిల్లలిద్దరూ కనిపించేరు. పిలిచేను ఒకమారు ఇటు రమ్మని. పెద్దవాడు ఒకడుగు ముందుకి వేసేడు. చిన్నవాడు అన్నగారి చెయ్యి పుచ్చుకు వెనక్కి లాగేడు.

గూట్లోంచి బిస్కెట్ పొట్లాం తీసి, "ఇదుగో, మీ వదిన ఇవ్వమంది," అన్నాను.

ఇద్దరికళ్ళూ ఆశగా మెరిసేయి. ఇందుకే అమాయకత్వం చూస్తే నాకు జాలేస్తుంది. ఆ పిల్లలిద్దరూ అంగుళం, సెంటిమీటరు చొప్పున జరుగుతూ నాకు గజం దూరం వచ్చేసరికి అరగంట పట్టింది.

"మీవదిన ఎప్పుడు వస్తుంది?"

"ఇంక రాదు."

"ఎందుకు వెళ్ళిపోయిందీ?"

"ఏమో."

అంతకంటే ఏమీ తెలుసుకోలేకపోయేను.

కానీ ఇలాటి విషయాలు దాచినా దాగవు.

"అబ్బో అదెక్కడ? రాత్రీ పొగలూ ఆ తిరగడాలూ అదీను ... అప్పుడే అనుకున్నాను," అన్నారొకరు.

"బావుంది. ఛస్తుందేమిటి మరి. మంచిపనే చేసింది," అన్నారు మరొకరు.

నలుగురూ నానారకాల వ్యాఖ్యానాలూ చేసేరు.

ఆఖరికి తేలిందిదిః

సాధారణంగా ఆ ఇంట్లో అరుంధతిమాట సాగదు. అసలు నిజం చెప్పాలంటే ఏ ఒక్కరిమాటా సాగదు. అలా తలో పెద్దా దండనాయకుడే అంటే అరుంధతికి నచ్చదు. అయినా చేసేదేం లేదని ఊరుకుంటూ వచ్చింది "ఎలా ఉన్నా గడిచిపోతుంది" అన్న నమ్మకంతో. కానీ రోజులు అంత తేలిగ్గా సాగలేదు. స్కూలికి వెళ్తున్న చిన్నమ్మాయి ఇంట్లో చెప్పకుండా సినిమాలకెళ్ళడం మొదలెట్టింది. ఇంట్లో డబ్బు మాయమవుతోంది.

ఆ సంగతి అరుంధతి గ్రహించి నీతులు బోధించబోయింది. దాంతో ఆ పిల్లకి ఒళ్ళు మండింది. ''నాయిష్టం. నీకెందుకూ?'' అంది ఆ అమ్మాయి.

అరుంధతి నిశ్చేష్టురాలయి నిలబడిపోయింది.

''దానివిషయంలో నువ్వెందుకు జోక్యం కలగజేసుకోడం?'' అంది అత్తగారు సమరసభావంతో.

''అయినా ఈ రోజుల్లో ఎవరంతటివాళ్ళు వాళ్ళు. పిల్లని తల్లి అంటేనే పడదు. పనిమనిషివంటిది మాట అంటే తోముతున్న గిన్నె అక్కడే పారేసి పోతుంది. అలాటిది కాన్డబ్బు ఇస్తున్నానని స్వవిషయాల్లో జోక్యం చేసుకుంటే వినేదెవరు?'' అంది పెంపుడు అత్తగారు.

''చిన్నదాన్ని. కోపం వద్దు వదినా. రోజులిలా ఉన్నాయి. ప్రతి మనిషికీ తనమీద తన తెలివితేటలమీద ఉన్న నమ్మకం మితి మీరిపోయింది. ఇతరుల అనుభవాలనించీ నేర్చుకుందాం అన్న ఆలోచన ఉన్నవాడు వెర్రివాడు. అది అడిగిన రెండువేలూ తెచ్చి ఇచ్చీ. అవి అయిపోగానే దానికే బుద్ధి వస్తుంది. అక్కడికది చవకే కదూ,'' అంది దైవ చింతనలో మునిగిన పెద్దావిడ.

రోజులిలా ఉంటే తనెందుకు ఇలా ఉండాలో అరుంధతికి అర్థం కాలేదు. ''నా డబ్బు పనికొచ్చి నామాట పనికిరాకపోతే నేనిక్కడ ఉండడం అనవసరం,'' అంది అరుంధతి.

అరుంధతి వెళ్ళిపోయింది.

000

రెండేళ్ళనాడు ఇరవై పోస్టుముద్రలతో ఒక కవరు వచ్చింది నాకు. ఆ ముద్రలమధ్యనించి ఆ ఎడ్రెసు రాసిన కలం పోల్చుకోడం కష్టమే అయింది నాకు. అది అరుంధతిది.

''జరిగిన సంగతి మీరు వినే ఉంటారు. నేను చేసింది సరయినదవునో? కాదో? ఆ క్షణంలో ఆవేశంతో అక్కణ్ణుంచీ వచ్చేసేను. ఒక చిత్రమైన సంఘటనవల్ల 'మా ఆయన'ని కలుసుకున్నాను. దైవోపహతురాలిని. పలుదోముపుల్లకోసం వేపచెట్టెక్కితే సంజీవకరణి

దొరికిందన్న ఆశ ఆశగానే మిగిలిపోయింది, మాలతీ! ఇద్దరు పిల్లల్నీ నాచేతిలో పెట్టి ఆయన పోయేరు. పెంచుతున్నాను వీళ్ళని.''

వీళ్ళింక పెరిగి పెద్దవాళ్ళయి తనని ఉద్ధరిస్తారని అరుంధతి ఆశ పడుతోందని నేననుకోను. అప్రయత్నంగా ఎక్కడో చదివిన పద్యం జ్ఞాపకం వచ్చింది.

‘‘నీచేతను, నాచేతను, వరమడిగిన కుంతిచేతను, వాసవుచేతను, ధరచేతను, భార్గవుచేతను'' - ఆరుగురిచేత వంచింపబడ్డాడు మహారథి కర్ణుడు. అయితే ఏం? ఆఖరిక్షణంవరకూ యుద్ధం చేస్తూనే ఉన్నాడు.

అరుంధతి జీవిస్తూనే ఉంది.

000

(ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 11 జనవరి 1961 లో ప్రచురితం. తరవాత ఇ-పత్రికలో ఏప్రిల్ 2002లో ప్రచురితం.)

# 13. జీవనమాధుర్యం

‘‘వెళ్తావు కదూ!’’

కిక్కిరిసి ఉన్న కంపార్టుమెంటులో కింద పడ్డానికి కూడా జాగా లేక, ఊపిరాడక కొట్టుకుపోతున్న సమయంలో కూడా వినిపిస్తున్న స్వరం అది. వెనకనించి ఎవరో తోసేరు. ఆ వెనక మరొక మనిషి కాబోలు అతన్ని తోసేడు. ‘‘ఉండవయ్యా, నువ్వొకడివి. నించోడానికేనా చోటు లేక మేం అవస్థ పడుతుంటే,’’ అన్నాడు విసుగ్గా టికెట్ కొనుక్కుని ఇక్కట్లు పడుతున్న ఆసామి.

‘‘మరేం చెయ్యమంటారు సార్? మాకోసం స్పెషల్ బోగీ వేయిస్తారా?’’ అన్నాడు అడుక్కోడానికొచ్చిన గుడ్డి బిచ్చగాడు అవహేళన చేస్తూ.

‘‘ఏమో మరి. నీతరవాతివాళ్ళమే కదా మేం,’’ అన్నాడు మొదటి మనిషి.

చుట్టూ ఉన్న జనం నవ్వేరు అందులోనే సందు చేసుకుని.

‘‘వెళ్తావు కదూ అరుంధతిదగ్గరికి.’’

తుళ్ళిపడ్డాను.

‘‘క్రాసింగుట. మరో అరగంటదాకా కదిలేట్టు లేదు బండి.’’

బండిలో నించోలేక మెల్లిగా కిటికీలోంచి దారి చేసుకుని ప్లాట్‌ఫారంమీదికి జారుకున్నాను కనీసం ఊపిరయినా ఆడుతుందని.

‘‘కాస్త మంచినీళ్ళు ఇటొస్తే చూడు బాబూ,’’ అంది నన్నుద్దేశించి కిటికీపక్కన కూచున్నావిడ, మరచెంబు చేత్తో పుచ్చుకుని అటూ ఇటూ చూస్తూ,

నేను అటూ ఇటూ చూసి, కనుచూపుమేరలో మంచినీళ్ళవాడు కనిపించకపోగా, నేనే అందుకున్నాను ఆ మరచెంబు.

మంచినీళ్ళు తెచ్చేసరికి అటునించి రావలసిన ఎదురుబండి దిగబడింది. ఇహ రైలు కదుల్తుందని మళ్ళీ కిటికీలోంచే లోపలికి దూరి ఇందాకా నేను నిలుచున్న సందుకోసం వెతుకుతున్నాను.

"ఇలా కూచో బాబూ. అన్నకు స్థలమియ్యరా," అంది మంచినీళ్ళు పుచ్చుకున్న మహా యిల్లాలు, తన కొడుకుని పక్కకి తోస్తూ.

ఒదిగి కూచున్నాను ఈ కలికాలంలో కూడా ఇంకా ధర్మమూ, మంచివాళ్ళూ ఉన్నారు కాబోలు అనుకుంటూ. సంచిలో చక్కిలాలపొట్లం వెక్కిరించినట్టు వేళ్ళకు తగిలింది. ధర్మపన్నాలు వల్లించుకుంటున్న నేను నాలుక్కొరుక్కున్నాను.

ఆ చక్కిలాలు అరుంధతికివ్వాలి.

"ఒక్కమారు వెళ్ళు బాబూ," అంది ఆ తల్లి. అది ఆజ్ఞ. పసుపూ, ఎరుపూ కలనేత చీరెలో సంధ్యాసమయాన్ని స్ఫురింపజేసే స్వచ్ఛతతో, చాముండేశ్వరీ విగ్రహాన్ని తలపింపజేస్తూ నవ్విన నవ్వు నాపాలిట సీతకోసం సౌమిత్రి గీచిన గీటు. లోకానికే ఆదర్శప్రాయమై అనుసరణీయమయిన ఒక పుణ్యమూర్తి పెట్టిన ఆంక్ష. అది అధికారరోగపూరిత బధిరాంధకశవము వేసిన ఆర్డరు కాదు. ఒక మాతృమూర్తి తన బిడ్డకు చెందవలసిన అమృతాన్ని నాకు పంచి పెట్టి, ప్రతిగా కోరిన ఒకే ఒక్క చిన్ని కోరిక. పరమకిరాతుడైనా మృత్యువుసన్నిధికి పంపుతున్న శత్రువుని నీ చివరికోరిక ఏమిటనే ప్రశ్నకి జవాబు.

"ఒక్కమారు అరుంధతిని చూసి రా, నా కళ్ళు పెట్టుకుని."

అలా అలమటించిపోతున్న మాతృశ్రీని క్షోభ పెడుతున్న ఆ నింద్యురాలిమొహం ఎలా చూడను? చూడలేనని ఆ తల్లికి ఎలా చెప్పను?

"ఆడదాన్లా అంత పగేమిట్రా నీకు?" అంటుంది అమ్మ. మగవాడికి మాత్రం రాగద్వేషాలుండవు కాబోలు.

"ఎక్కడిదాకా?" ఎవరో ప్రశ్నించేరు.

చెప్పేను.

"అబ్బో చాలా దూరఁవేసే," అని ఆవులించేరు.

నేను మాటాడలేదు.

"ఒక్కడివే వెళ్తున్నావా? ఏం పనిమీద? మరి మీవాళ్ళని మళ్ళీ వచ్చి తీసుకెళ్తావా?" -- వెయ్యి ప్రశ్నలు.

నసిగేను. ఒంటిగాణ్ణి. ఎక్కడుంటేనేమిటి?

"అరుంధతి మాట?" - గుడిగంటలా హెచ్చరింపు అంతరాంతరాల్లో.

నన్ను పలకరించినాయన్ని అడిగేను రాయపూర్‌లో ఫలానావారిల్లు తెలుసా? అని. నాదగ్గరున్న ఎడ్రెసు చూపించేను.

ఇల్లు తెలీదు కానీ ఆ వీధి చూపిస్తానన్నారాయన. వాళ్ళయింటికి ఆ వీధి దాటి వెళ్ళాలిట.

కాంటాబాంజీ స్టేషనులో టీ తాగి మళ్ళీ రైల్లో కూచున్నాను. అరుంధతి ఎలా ఉంటుందో? అది కూడా నేనెప్పుడూ ఆలోచించలేదు. నాకు తెలిసిన అరుంధతి ఒక నరరూప రాక్షసి. అమృతభాండం అందిస్తే మట్టిపాత్ర అని విసిరి పారేసిన మూర్ఖురాలు. కోరి వరించిన ఐశ్వర్యాన్ని కాలదన్నుకున్న అజ్ఞాని. అర్థరాత్రి అప్పటికప్పుడు బియ్యం దంపి చుట్టిన ఈ చక్కిలాలు నా మొహాన విసిరి కొట్టినా కొట్టొచ్చు. ఆవిడ పిచ్చి కాకపోతే రసమలాయీ, రాజభోగ్ తినే అరుంధతి ఈ పాతకాలపు పిండివంటకోసం మొహం వాచి ఉందా?

రాయపూర్ స్టేషనులో దిగి దిక్కులు చూస్తున్న నన్ను ఇందాకా దారి చూపిస్తానన్న తోటి ప్రయాణీకుడు తీసుకెళ్ళి అరుంధతి ఇంటిముందు వదిలిపెట్టేడు.

తలుపు మెల్లిగా తట్టేను. పాతివ్రత్యం పరీక్షించడానికి అగ్నిప్రవేశం చేయమన్నప్పుడు ఆనాడు జనకసుత ఎట్టి అనుభూతులకు లోనయిందో కానీ సామాన్యమానవుడినైన నేను ఒక వృద్ధమూర్తియందు నాకు గల అభిమానాన్ని ఋజువు చేసుకోడానికి - డాంబికంకోసం కాక - నిండుమనసు నొప్పించలేక, వచ్చి నిలబడ్డాను అరుంధతి ఎదుట. నరకద్వారాల్లా తెరుచుకున్నాయి తలుపులు. ఆ తలుపులవెనక తన ఐదవతనానికి చిహ్నంగా గాజులు ఘల్లున మ్రోగుతుండగా ప్రత్యక్షమయిన పార్వతీదేవిలా నిలబడింది ఆ తలుపులు తెరిచిన

జవరాలు. ఆ ముగ్ధమోహనమూర్తి అరుంధతి కాజాలదు. బహుశా క్షణక్షణానికి ఇంతింతై మాయావటుడిలా పెరిగిపోతున్న నాకోపాగ్నిని శాంతింపజేయడానికొచ్చిన దేవదూత కావచ్చు. నేను వీలయినంత సంక్షిప్తంగా నా వచ్చినపని వివరించేను.

"లోపలికి రా," అందావిడ నాకోసమే ఎదురు చూస్తున్నట్టు.

అత్తవారింటికి వెళ్ళిన కొత్తకోడలు తన అనుంగు తమ్ముని ఆహ్వానించే పిలుపు అది. స్కూలికి వెళ్ళిన పసివాడు తిరిగి ఎప్పుడొస్తాడో అని ఎదురు చూసి చూసి విసిగి వేసారి వెను దిరుగునంతలో ఆ పసివాడు పరుగున వచ్చినప్పుడు ఎదురయే సుస్వాగతం అది.

"అమ్మ కులాసాగా ఉందా? ఎంతగానో బతిమాలేను. ఒక్కదాన్నీ ఈ దేశం కాని దేశంలో నా అన్నవాళ్ళు లేకుండా పడి ఉన్నాను. వచ్చి నాదగ్గర ఉండమంటే రాను గాక రాను పొమ్మంది. ఏనాడు ఏ తల్లీబిడ్డల్ని వేరు చేసేనో ఈనాడు నాకు తల్లి ఉండీ లేనిదే అయింది. పోనీలే. తక్కువ నోములు నోచి ఎక్కువ ఫలము కావాలంటే ఎలా వస్తుంది?" అంది అరుంధతి కనుల నీరు తొణుకుతుండగా.

అరుంధతిమాటలు నేను నమ్మలేదు. ఆమె నటనావైదగ్ధ్యానికి ముగ్ధుడనైనమాట నిజం.

ఆవిడ అంతలోనే తేరుకుని, "లేచి స్నానం చెయ్యి. భోజనం చేద్దువు గాని. నిన్న ఎప్పుడనగా తిన్నావో," అంది.

"ఇప్పుడు మీరనవసరంగా శ్రమ తీసుకోకండి. మీఅమ్మ ఇవి ఇచ్చి చూసి రమ్మనడంచేత వచ్చేను," అన్నాను సంచీలోంచి చక్కిలాలపొట్లం తీస్తూ, ఆ యింట్లో ప్రవేశించడానికి నాకు గల అభ్యంతరం సువ్యక్తం చేస్తూను.

"అయితే మాఅత్తగారు పని చెప్పకపోతే వచ్చేవాడివి కాదన్నమాట. ఇంకా ఆలీబాబాకథలోలాగ ఉప్పు తిననని నియమం కూడా పెట్టుకున్నావా? నేను క్రైంబ్రాంచివాణ్ణి. మారు మాటాడకుండా పద," అన్నాడు అప్పుడే రంగంలోకి ప్రవేశించిన రమణారావు. ఆ ఇన్స్పెక్టరుగారిముందు నాకు నోరు పెగల్లేదు.

తల ఒంచుకుని భోంచేస్తున్నాను. వంటింట్లో చేస్తున్న ఏర్పాట్లని బట్టి ఆ ఇంట్లో ఓ వారాలకుర్రాడు ఉన్నాడనీ, అతనివంతు అన్నం నాకు పెట్టి ఆ కుర్రాడికోసం మళ్ళీ ఎసరు పడేసిందనీ గ్రహించుకున్నాను.

భోజనం చేస్తున్నంతసేపూ క్రైంబ్రాంచి ఇన్స్పెక్టరుగారు నాపక్కనే కూచున్నారు. అరుంధతి ఏవేవో ప్రశ్నలు వేస్తూనే ఉంది. వాటితో పోటీ పడుతూ ఖాద్యపదార్థాలు నాఆకులో పడిపోతున్నాయి.

నేను తినలేక ఉక్కిరిబిక్కిరైపోతుంటే, అరుంధతి, "అయ్యయ్యో, అసలేమీ తినడమే లేదు. అలా అయితే పద. నీకు ఇష్టమయిన హోటల్లోనే తిందువు గానీ," అంటూ గొడవ చేసింది.

భోజనం అయేక నాకథ సూక్ష్మంగా చెప్పేను. పార్వతీపురందగ్గర ఓ చిన్న పల్లెటూరిలో యస్.యస్.యల్.సీవరకూ చదువుకున్నాను. పైచదువులకి నాన్నగారు ఒప్పుకోలేదు కానీ నేను మొండిగా పార్వతీపురం వచ్చి, అరుంధతి తల్లిగారింట్లో ఓ చిన్న గది అద్దెకి తీసుకుని చదువు కొనసాగించేను. అప్పుడే నాన్నగారిదయకు అపాత్రుణ్ణి అయేను. అప్పుడే నవ్యనవనీతసమానమయిన నిండుమనమ్ము ఎటువంటిదో తెలుసుకున్నాను. ఆ గదిలో ఉండగానే గుప్తదానం చేస్తున్న ఒక పుణ్యపురుషునిమూలంగా నెలకి ఏభై రూపాయలు అందుకుంటూ బి.ఎ. డిగ్రీ పుచ్చుకున్నాను.

తన తల్లికి వారసుణ్ణి కాగలనన్న భయంతో అరుంధతి అసూయాగ్రస్తురాలై విషం కురిపిస్తే నేను నిశ్చయంగా సంతోషించి ఉండేవాణ్ణి. నన్ను ఏవిధంగానైనా ఆమె వంచిండానికి ప్రయత్నిస్తే ఆ మాయాజాలంనుండి తప్పించుకుని అలవోకగా నవ్వి అవనితముఖి అయిన అరుంధతిని చూసి ఆనందించి ఉండేవాణ్ణి.

"అదృష్టవంతుడివి, తమ్ముడూ! నేను పరితపించిపోతున్న అమ్మ నీకు అనాయాసంగా లభ్యమయింది," అంది అరుంధతి. కాంప్ కాట్ వేసింది కొంచెంసేపు విశ్రాంతి తీసుకోమని.

నేను వెంటనే వెళ్ళిపోవాలన్నాను.

‘‘అదేం కుదరదు. కనీసం రెండు రోజులైనా ఇక్కడ ఉండందే కదలడానికి వీల్లేదు. కాదూ కూడదని నువ్వు బయల్దేరితే పోలీసుకుక్కలని పంపించి వెనక్కు లాక్కొస్తామని చెప్పమన్నారు మీ బావగారు,’’ అంది. ‘‘అమ్మ అక్కడ ఎలా ఉంది? రైతులు పేచీలు పెట్టడం లేదు కదా? అన్నీ చూసుకోగల ఓపిక అమ్మకుందా?’’ అరుంధతి పదే పదే తల్లిని గురించి ప్రశ్నించసాగింది.

‘‘ఆవిడ అసలు నేను సాయం చేస్తానన్నా చెయ్యనివ్వదు,’’ అన్నాను. ‘‘ఆవిడ నాకు ఒక సలహా చెప్పింది, ‘నాయనా, పెద్దదాన్నీ, చేసుకోగలదాన్నీను. నాకు దైవసహాయముంది. మరే సాయమూ నాకక్ఖర్లేదు. రేప్పొద్దున్న నీ పెళ్ళాం వచ్చినప్పుడు దాన్ని ఏడిపించకు. అదే నేను నీకు చెప్పగల ముక్క’ అని.’’ చెప్పేశాక అనుకున్నాను అరుంధతికి ఎందుకు ఈమాట చెప్పడం?

‘‘భేషయినమాట శలవిచ్చేరోయి ఆవిడ. కానీ ఈ ఆడజాతి ఉంది చూశావూ, మనం ఒద్దన్నా వినకుండా వాళ్ళే ఉత్తుత్తినే ఏడుస్తారు. ఉదారహరణకి మీఅక్క ఉందా, చెట్టంత మొగాణ్ణి నేనున్నానా? అయినా ఇంట్లో మనుషుల్లేరు, అమ్మ రమ్మంటే రాదూ అని ఏడుస్తుంది. తెగించి ఆవిణ్ణి తీసుకొస్తానేమో ...’’

‘‘చాల్లెండి ..’’ అంది విప్రలబ్ధవలె కోపానికీ తాపానికీ మధ్య గల భావవిన్యాసంతో, ‘‘మరొకరైతే నిజమనుకోగలరు.’’

‘‘అయ్యో ఖర్మమా! అసత్యం అనుకోడూ అతను నువ్వలా గదమాయిస్తే,’’ అన్నాడు రమణారావు విస్తుపోతూ.

అరుంధతి మారు పలకలేదు.

‘‘అదృష్టహీనుడికి నవరత్నాలతో నిండిన కూష్మాండం కూడా ఒట్టి గుమ్మడికాయలాగే కనిపిస్తుంది,’’ అన్నాను కసిగా.

‘‘అలాగనకోయ్. ఆవిడని నువ్వు పూర్తిగా ఎరగవు,’’ అన్నాడు రమణారావు సీరియస్‌గా మొహం పెట్టి.

000

మొదట వాళ్ళు కొత్తగా కాపురం పెట్టినరోజుల్లో ఆవిడ ఇక్కడికి వచ్చింది. అప్పట్లో ఇల్లు చిన్నది తీసుకున్నాడు రమణారావు. అతడి ఉద్యోగమూ చిన్నదే. మార్కుదారులయింట పుట్టి జమీందారులయిల్లు మెట్టిన అరుంధతితల్లి ఆ ఇంట ఉండలేకపోవడంలో ఆశ్చర్యం లేదు.

''పెద్ద ఇల్లు ఒకటి చూడు. కొనేద్దాం,'' అందావిడ.

రమణారావు అంగీకరించలేదు. ''నాటకంలో వేషం వేసినట్టు ఇవాళ మీరొక పెద్ద ఇల్లు కొనేస్తే, దానికి పన్ను కట్టే తాహతు కూడా లేదు నాకు. లాటరీలో కారొస్తే పెట్రోలొస్తుందా? పుణ్యానికి పిడికెడు బిచ్చం పెడతారు కానీ పంచభక్ష్యపరమాన్నాలతో విందులు చేయరు. నాకు చేతనయినంత నేను చేస్తాను. సర్దుకోండి,'' అన్నాడతను.

ఈమాట పౌరుషవంతురాలయిన అత్తగారికి రుచించలేదు. పాలకడలిలో పుట్టి సిరికి చెల్లెలయి చెలగిన తనకి సర్దుకుపోవలసిన ఖర్మమేమిటి? అల్లుడువాడు కనక ఆ మాట అన్నాడు. ఇవాళ ఈ విషయం అయింది. రేపు మరొకటి కావచ్చు. ఆ రోజే ఆవిడ ప్రయాణమై జననితో సమానమైన జన్మభూమి చేరుకుంది. పుట్టినగడ్డమీదే మట్టి అవడానికి నిశ్చయించుకుంది.

నేను ఈ కథంతా నమ్మలేకపోయేను. పెద్దావిడ అంతటి మూర్ఖురాలా తాహతుకు మించిన పరుగులు తీయమని కోరడానికి? ఆవిడ అటువంటి మనిషి కాదు. నేను ఆవిణ్ణి ఐదేళ్ళగా చూస్తున్నాను.

''నేను ఇరవైయేళ్ళగా చూస్తున్నాను. నా అన్నవాళ్ళు లేరు నీకు. ఆవిడ పట్టెడన్నం పెడితే దయాసముద్రురాలనుకుంటున్నావు నువ్వు. కూరలసంచీ చేతికిచ్చి నిన్ను బజారుకి తరమలేదు కనక ఒరుల నొప్పింప నిచ్చగించని సౌజన్యమూర్తి అనుకుంటున్నావు. అంతేగదా నీకు తెలిసింది?'' అన్నాడు రమణారావు.

నా హృదయం భగ్గున మండింది. ''అన్నమంతా పట్టి చూడక్ఖర్లేదులెండి,'' అన్నాను రోషంగా.

రమణారావు చిత్రంగా నవ్వేడు, ''నేనొక కథ చెప్తాను వింటావూ?''

నేను కథలు వింటూ కూర్చోడానికి కాదు ఇక్కడికి వచ్చింది. పురాణాలు వల్లించినంత మాత్రాన తప్పులు ఒప్పులై పోవు. అయినా రమణారావు నా జవాబుకోసం ఎదురు చూడనూ లేదు.

''మా ఊళ్ళో నలుడికీ భీముడికీ దీటు రాగల వంటవాడొకడు ఉండేవాడు. అప్పట్లో మా ఇంట మూడు బంతులు లేచేవి. మొదటిబంతి కుర్రకారు కూచునేవాళ్ళం. మాకు మీదవరస అన్నం - గోడకేసి కొడితే మేకుల్లా నిలబడేవి మెతుకులు. పెద్దవారికి అంటే మానాన్నగారికి మధ్యవరస అన్నం సమపాళంగా ఉండేది. ఆఖరిబంతి ఆడవాళ్ళకు అడుగు పెచ్చులు - దొరకజ్జాయం. భోజనాలయేక అందరం సావిట్లో చేరి తన్నుకునేవాళ్ళం. అన్నం ఉడకలేదని మేం, ఫస్టుగా ఉందని నాన్నగారూ, మాడిందని మా అమ్మా. .. మొత్తమ్మీద అన్నంగిన్నెలో రహస్యం మటుకు మాకొకంతట పట్టుబడలేదు,''

''మీకు తెలిసింది కాబోలు,'' అన్నాను మృదువుగానే.

''లేదోయ్ భగవాన్లూ, అందుకే ఇంగ్లీషువాడు ఏ ప్రశ్నకైనా రెండు వేపులుంటాయి అన్నాడు. ఒకే చెట్టుకి కాసినా ఒక కాయలా మరో కాయ ఉండదు. ఒక తల్లికి పుట్టిన నలుగురు పిల్లలు నాలుగు రకాలుగా ఉంటారని నీకూ తెలుసు కదా. అమ్మ అయినా నువ్వైనా నేనయినా మార్పు సహజం. పట్టూ విడుపూ ఉండాలి దేనికైనా.''

''అయితే నేరస్థుడిని నేరస్థుడు అనకూడదన్న మాట.''

రమణారావు వాచీ చూసుకుని పులివేషంలాటి మేకప్ మొదలెట్టేడు స్టేషనుకెళ్ళడానికి. ''నేరం ఒకమారు చేసినవాడు మనిషైతే మళ్ళీ అదే నేరం చెయ్యడంటున్నాను. అందుకే మన పెద్దలంతా అనుభవమో అని కొట్టుకోడం.''

''సరేలెండి. చిన్నవాణ్ణి చేసి అతనిదగ్గరే మీ ప్రతిభంతా,'' అంది అరుంధతి ఎత్తిపొడుస్తూ.

''బావుంది. ఏదో చిన్నవాడు కదా అని నాలుగు నీతివాక్యాలు నేర్పబోతే నేనేదో మీతమ్ముడిమీద పడి కొట్టేస్తున్నట్టు ఇదయిపోతావేం?'' అని ''నాజోళ్ళు తే. మళ్ళీ సాయంత్రందాకా కనిపించను,'' అన్నాడు రమణారావు బెల్టు బిగించుకుంటూ.

నాకిది యం.ఐ. క్లాసులా, లాజిక్ చేసే మేజిక్కులా అనిపించింది. దొంగైనా తన్ను తాను సమర్థించుకోగలడు. నోరుంటే తల కాస్తుంది మరి.

‘‘ఒక్కమాట జ్ఞాపకం ఉంచుకో శ్రీపతీ! Old order must give place to new order. New order can never adjust to the old. కొత్తతరం పాతతరాన్ని గౌరవిస్తుంది కానీ అనుసరించదు.’’

రమణారావు వెళ్లినవేపే చూస్తూ పడుకున్నాను. ఆవరించుకున్న నల్లని మేఘాలని అధిగమించి సూర్యకిరణాలు ఏడురంగుల్లో ప్రతిఫలిస్తున్నాయి. మనుషుల్లో మార్పు సహజమైతే అమ్మ మారదా? అమ్మకంత పట్టుదలా? అసలు ఇందులో నేరస్థులెవరు? ‘‘అమ్మ, అమ్మ’’ అంటూ పలవరిస్తోంది అరుంధతి ఇక్కడ. ‘‘అరుంధతి, అరుంధతి’’ అంటూ తపిస్తోంది అమ్మ అక్కడ. ఐదేళ్ళనించి చూస్తున్న నేను అమ్మకి అరుంధతికన్నా ఆస్తి ఏమీ ఎక్కువ కాదని నిశ్చయంగా చెప్పగలను. రమణారావేమీ అక్రమవర్తనుడు కాదన్నది స్పష్టమే. ఈ చిక్కులనే కాబోలు భవబంధాలంటారు. వాళ్ళు అన్న రెండురోజులూ ఉండి కాని అక్కడినించి కదల్లేదు నేను. ఈ దంపతులకు నాయందు కలిగిన అవ్యాజానురాగానికి కారణం నేను చెప్పలేను. అది అనురాగమవునా కాదా అన్న సందేహం ఎప్పుడో అంతరించిపోయింది. అందుకే వారిమాట కొట్టిపేయలేకపోయేను ఉద్యోగార్థినై వెళ్తూ కూడా.

అరుంధతి అమ్మసుగుణాలను పుణికిపుచ్చుకుందేమో నేను బయల్దేరే రోజున పండుగంత హడావుడి చేసింది. కొత్తబట్టలు తెప్పించి నేను తొడుక్కునేదాకా ఒప్పుకోలేదు. చేతిసంచితో రైలు దిగిన నేను ఇంత భారంతో ఎక్కలేనేమో అనిపించింది.

‘‘వస్తానమ్మా,’’ అన్నాను తలొంచుకుని రిక్షా ఎక్కబోతూ. ఇరవయ్యో శతాబ్దపు నాగరికత ఒంటబట్టి రెండు చేతులూ జోడించడం కూడా అసభ్యంగా పరిగణించే కాలేజీలో చదవకపోతే ఆమెపాదాలు స్పృశించి ఉండేవాణ్ణి తనయందు నేను పెంచుకున్న దురభిప్రాయాలకి ప్రాయశ్చిత్తంగా.

“కనీసం నువ్వైనా అప్పుడప్పుడు వచ్చి కనిపిస్తూండు తమ్ముడూ,” అంటూ కళ్ళనీళ్లతో సాగనంపుతున్న అరుంధతి ఋణం సప్తజన్మలెత్తినా తీర్చుకోలేనేమో అనిపించింది.

రైలెక్కుతుంటే రమణారావు ఒక ఉత్తరం ఇచ్చేడు. దానిమీద ఉన్న ఎడ్రెసుకి వెళ్తే తప్పకుండా ఉద్యోగం దొరుకుతుందని, “నామాట తీసెయ్యడు,” అన్నాడు.

ఆ ఉత్తరంమీద దస్తూరి నాకు సుపరిచితం. ఏ అజ్ఞాతవ్యక్తి అయితే మా ప్రిన్సిపాలుపేరున ప్రతినెలా ఏభై రూపాయలు పంపి, పరోక్షంగా నాచదువుకి సాయం చేశారో ఆ వ్యక్తిదే ఆ హస్తం. ఆ మాత్రం పోల్చుకోలేకపోతే నేను చదివిన చదువంతా వృథా.

తీసిన కొద్దీ ఊరే జల వంటిది అరుంధతీ, రమణారావులకీ నాకూ మధ్యగల అనుబంధం అనుకున్నాను ఉత్తరం మడిచి జేబులో పెట్టుకుంటూ.

000

(ఆంధ్రప్రభ వారపత్రిక, 10 నవంబరు 1961 లో ప్రచురితం.)

# 14. నడుస్తున్న చరిత్ర

''నవంబరు ఒకటో తారీఖు'' అంది కేలండరు.

''ఆరు'' అంది గోడనున్న గడియారం.

సాయంత్రంవేళ.

నోటిదగ్గర పెట్టుకోబోతున్న పాలగ్లాసు క్రింద పెట్టేసి, కల్యాణి ''అమ్మయ్య'' అంటూ ఆదరా బాదరా బెట్టుజోళ్లు వేసుకోడంలో మునిగిపోయింది. పదేళ్ల తన స్కూలుచరిత్రలో ఇవాళ తను పదినిముషాలు ఆలస్యంగా వెళ్తోంది.

''అమ్మా! వెళ్తున్నా!'' అని కేకేసి వెళ్తున్న కల్యాణి, ''ఎక్కడికి?'' అని తల్లి వంటింట్లోంచి అడగడంతో క్షణం ఆగింది. ఈ సమయంలో తను రోజు ఎక్కడికి వెళ్తుందో తల్లికి తెలీదా?

''స్కూలికి,'' అంది ఒక్క అంగలో గేటుదాకా వెళ్లి.

''కల్యాణీ!''

''టైమయిపోయిందమ్మా,'' అని నసుగుతూ వెనక్కి వచ్చింది. పాలు తాగడం తనకి అయిష్టం. తాగకపోతే అమ్మకి కష్టం. కల్యాణి పాలగ్లాసు తీసుకుంది.

''స్కూలికి వెళ్తున్నావు కాబోలు,'' అంది ఆవిడ గోరుచిక్కుడు ఈనెలు తీస్తూ. ''మీమేష్టరుతో రేపట్నుంచి రానని చెప్పిరా.''

''ఆఁ?''

పాలగ్లాసు కిందపడ్డ శబ్దానికి ఆవిడ తలెత్తి కల్యాణివేపు చూసింది.

స్థబ్ధురాలయి నిల్చున్న కల్యాణి, మెల్లిగా తేరుకుని, ''రేపట్నుంచి రాలేనని చెప్పనా? ఎందుకని?'' అంది నీరసంగా. వండుకున్న అన్నం తిన్నదాకా నమ్మకం లేదంటే ఇదేనా?

''ఏంలేదు. ఉట్టినే,'' అంది తల్లి కిందపడ్డ పాలు తుడువడానికి ఉద్యుక్తురాలవుతూ, ''వెళ్లి వేగిరం రా.''

కల్యాణి గుమ్మానికి ఆనుకుని నిల్చుంది. తల్లి అన్నమాటలు అర్థం కాలేదు. తనకి ఏడేళ్లప్పుడు సరిగ్గా ఇదే రోజున మొదలుపెట్టింది. జ్వరం వచ్చినప్పుడు వెళ్లింది. వాన వచ్చినప్పుడు వెళ్లింది. అలాటిది ఇవాళ "ఉట్టినే" "రేపట్నుంచి రాలేన"ని చెప్పి వచ్చేయాలా?

"వెళ్లు అని చెప్తున్నాను. పదిహేడేళ్లొచ్చాయి. కల్యాణీ, చెప్పినట్టు చెయ్యడం నేర్చుకో," అంది ఆవిడ బొమలు ముడిచి, మళ్లీ గోరుచిక్కుడుకాయలు ఏరడంలో మునిగి. ఆవిడకి తెలుసు కల్యాణిబాధ. కానీ తనూ, కల్యాణీ కలిసినా ఎదుర్కోలేని శక్తులు! ఆ సంగతి ప్రస్తుతం కల్యాణి గ్రహించే స్థితిలో లేదు. అందుకే ఆవిడ ఇప్పుడు కారణాలు వివరించడం, ఆ పిల్లని నమ్మించ ప్రయత్నించడం చెయ్యలేదు. అందుకే చాలామంది పెద్దవాళ్లలాగ "ఒకొకప్పుడు కర్రే మంచిద"న్న సామెతగా, "వెళ్లిరమ్మ"ని శాసించింది.

కల్యాణి నించున్న స్థలంనించి కదలడానికి పదిహేను నిముషాలు తీసుకుంది. కదిలిన తరవాత మాత్రం స్కూలువేపు వెళ్లలేదు. ఇంటినానుకుని ఉన్న చిన్నతోటలోకి వెళ్లి బొప్పాయిచెట్టు నానుకుని నిల్చుంది.

ఆ పక్కన సూదుల్లాటి జాజిమొగ్గలు విడడానికి తయారుగా వున్నాయి. తోట సగంవరకూ కనకాంబరాలే. వాటిమధ్య ఒక నాపరాయిని బల్లలా నిలబెట్టేరు. కుడివేపు పంచలో లైటు వేస్తే ఈ తోటలోకి వెల్తురు వస్తుంది. ఆ రాయిమీద కూచుని ఎన్నిమార్లో అమ్మ అడిగింది తను డాన్సు స్కూల్లో నేర్చుకున్న విషయాలు. తను ఎంతో ఉత్సాహంతో ఆ అభినయాలన్నీ చేసి చూపించేది.

కల్యాణికి ఆపుకోలేని దుఃఖం వచ్చింది. ఆ నాపరాయిమీద పడుకుని ఏడిచింది. రోజంతా ఎండకి కాలి కాలి ఉన్న ఆ రాయి వేడి ఆ పిల్లకి తెలీలేదు.

పదేళ్లకిందట మొదలు పెట్టింది. అవేళ ఆ రోడ్డుమీద అలా వెళ్లిపోతూ గజ్జెల చప్పుడు విని, లోపలికి తొంగి చూసి, "ఇక్కడ డాన్సు నేర్పిస్తారా?" అని అడిగిందిట తను. మేష్టరు నవ్వి, "ఆఁ, నేర్పిస్తాం. ఇలా రా," అన్నారుట. ఆయన ఆ మాట చెప్పి ఇప్పటికీ నవ్వుతూంటారు. ఆ అడగడం, "ఇక్కడ వంకాయలు అమ్ముతారా?" అన్నట్టుంది అని. ఆ

వెంటనే తను ఇంటికొచ్చి, "నేను డాన్స్ మేష్టరితో మాట్లాడేను. పది రూపాయలు కావాలన్నారు. సరేనన్నాను," అంది.

కల్యాణి నాట్యశిక్షణ అలా ప్రారంభమయింది. లలితకళలంటే అభిరుచి గల తల్లిదండ్రులు సరేనని వెంటనే ఒప్పుకున్నారు. అప్పట్నుంచీ నిన్న సాయంత్రంవరకూ నిర్విరామంగా వెళ్లగలిగింది. "రేపట్నుంచి ఎందుకు వెళ్లలేదో" అర్థం కాలేదు కల్యాణికి. "చెప్పినట్టు వినడం నేర్చుకోమ"ని చెప్పింది. తను ఏనాడు కాదంది అమ్మమాట?

ఏడ్చి ఏడ్చి సొమ్మసిల్లి నిద్రపోయిన కల్యాణిని అమ్మ లేపి యింట్లోకి తీసుకెళ్లేవేళకి రేడియోలో ఆంగ్లంలో వార్తలు చెబుతున్నారు.

"అన్నం తిని పడుకో," అంది తల్లి.

"నేను డ్యాన్సుక్లాసులు ఎందుకు మానేయాలి?" అంది కల్యాణి ఆవేశం అణుచుకుంటూ.

"పెద్దదానివయేవు. ఇంకా నాట్యాలూ, నాటకాలూ వేస్తే బాగుండదు. నలుగురినోళ్లలో పడడం తప్పు. అదీ కాక మనం ట్రూపులో చేరి ఊరూరా తిరగబోవడంలేదు. అందుకే వద్దన్నాను. మన సంతృప్తికోసం ఇప్పటివరకూ నేర్చుకున్నది చాలు," అంది ఆవిడ అనునయంగా.

కాని కల్యాణిని మాత్రం ఆవిడ చెప్పిన ప్రతిమాటా ములుకులై పొడిచేయి. పెద్దదయిందిట! ఇంక నాట్యాలు బాగుండవుట! ఇప్పటిదాకా నేర్చుకున్నది చాలుట! ... నలుగురూ నవ్వుతారుట! కళంటే వీళ్లకున్న అభిరుచి ఇదేనా? ఇందుకేనా తను ఇన్నాళ్లు తపస్సు చేసింది? నారు పోసి, నీరు పోసి పెంచి పెద్ద చేసిన మానుని ఇప్పుడిలా మొదలంటా నరికేసి .. ఇంకా "మన సంతృప్తి" ఎక్కడినించి వస్తుంది? పెద్దది అయినంత మాత్రాన సిగ్గు పడవలసిన ఈ విద్యలో తనకి చిన్నప్పుడు ఎందుకు అభిరుచి కలిగించేరు? "చిన్నప్పుడు బట్టల్లేకుండా తిరిగేవు. ఇప్పుడు కూడా తిరుగుతావా అలా?" అంటోంది తల్లి. అదేనా ఉపమానం? నిన్న మొన్నటివరకూ తను డాన్సు చేస్తుందని ఇంటికొచ్చిన వాళ్లందరికీ ఎంత

గర్వంగా చెప్పుకున్నారు. తన ఫొటోలన్నీ ఇంటి గోడలనిండా, రెండు ఆల్బములలోనూ లేవూ? డబ్బుకోసం గజ్జె కడతానని తానెప్పుడూ అనలేదు. అది కారణం కానే కాదు.

కల్యాణి గాలివాన రేపింది ఆ రాత్రి ఇంట్లో. ఆఖరికి తల్లి కళ్లనీళ్లు పెట్టుకునేదాకా, తండ్రి ఎన్నడూ ప్రదర్శించని కోపం ప్రదర్శించేదాకా అసలు కారణం వివరించేదాకా వెళ్లింది. రేపు కల్యాణిని చూడడానికి పెళ్లివారు వస్తున్నారు.

కల్యాణి తనగదిలోకి వెళ్లి తలుపు వేసుకుంది. మంచంమీద పడుకుంది. కన్నీళ్లు రాలేదు. కణతలు పేలిపోతున్నాయి. ప్రాణం ఎందుకు పోవడం లేదో ఆ పిల్లకి అర్థం కాలేదు. ... పెళ్లికొడుకు వస్తున్నాట్ట. ఎవర్ని అడిగి చేస్తున్నారు ఈ ఏర్పాట్లు? తనకి పదేళ్లు వచ్చిందగ్గర్నుంచీ తనకి తానుగా ఆలోచించుకోడం నేర్పి, తన వ్యక్తిత్వం నిలబెట్టుకునేందుకు దోహదం చేసి, ఆఖరికి తన జీవనమార్గాన్ని నిర్ణయించుకునే సమయం వచ్చేసరికి పగ్గాలు వాళ్ల చేతుల్లోకి తీసుకున్నారు! తను అనుకున్నదేమిటి?

మేష్టారు ఎన్ని మెళుకువలు చెప్పేరు .. యోగానికీ నాట్యానికీ ఉన్న సామ్యం ... యోగాసనాలే రమణీయకంగా, ఆకర్షణీయంగా ప్రదర్శించితే నాట్యమవుతుందట. నాట్యారంభంలో చేసే అభినయానికి, ఒకొక ముద్రకీ ఒకొక దేవతని ఆపాదించి, ఆ ప్రథమ ప్రదర్శన అగ్ని, వాయు, వరుణాది దేవతలని ఆహ్వానించడమని నిరూపించిననాటి ఆయన ఉత్సుకత, నాట్యకళలో చేయవలసిన పరిశోధనగురించి చర్చించినప్పటి ఆయన పాండిత్యప్రకర్ష, మణిపురి కథకళి నృత్యాలకీ, భరతనాట్యానికీ బేధాలనూ విప్పి చెప్పినప్పటి ఆయన పరిశీలనాదృష్టి - తనని ముగ్ధురాలిని చేస్తే. ఆ కళలోనే తన జన్మ అంతమవుతుంది అనుకుంది. ‘‘అటు వెళ్లడం చాలు, ఇహ ఇటు ప్రయాణం చెయ్యి’’ అంటూ వెనక్కి లాగుతున్నారు అమ్మా, నాన్నగారూను! రాజహంస కాకుల్లో బతగ్గలదా? తను సంసారంలో?! కల్యాణి ఏ తెల్లవారుఝామునో నిద్ర కొరిగింది.

మర్నాడు పొద్దున్న ఎంతకీ తెరుచుకోని గదితలుపులు - తల్లికి, ‘‘ఇదేం అఘాయిత్యానికి తలపడలేదు కదా!’’ అనిపిస్తే, బాది బాది బలవంతాన తెరిపించింది ఆవిడ. కల్యాణి కళ్లూ, మొహమూ వాచి ఉండడం చూసి, ‘‘ఖర్మ’’ అనుకుంది ఆవిడ మనసులోనే.

కల్యాణి హాల్లో సంగీతం మేష్టర్ని చూసి, “నేను సంగీతం మానేస్తున్నానండీ, మీజీతం నాన్నగారిని అడిగి తీసుకోండి,” అంది దృఢస్వరంతో.

“సంగీతం ఎందుకే మానెయ్యడం?” అన్న అమ్మవేపు కల్యాణి చూడకుండా, “అది మాత్రం ఎందుకు?” అనేసి అక్కడినుండి వెళ్లిపోయింది.

లౌక్యం ఎరిగిన అమ్మ, “మీరు వారంరోజులు పోయేక రండి,” అందే కానీ పిల్లనిగురించి ఆవిడకి అంతకన్న ఎక్కువే తెలుసు. కల్యాణి మళ్లీ ఎప్పుడూ సంగీతంమేష్టరుముందు కూర్చోలేదు.

ఆ సాయంత్రం తల్లిబలవంతంమీద పెళ్లికొడుకుముందు కూర్చుందే కానీ ఆ మనిషి ఎవరా అని కన్నెత్తి చూడలేదు. వాళ్లు అడిగినప్రశ్నలకి సమాధానాలు చెప్పనూ లేదు. వాళ్లు వెళ్లిపోయేక, అమ్మ నచ్చచెప్పడానికి చూస్తే, కల్యాణి ఉరిమి చూసి తనగదిలోకి వెళ్లిపోయింది.

“అన్నానికి రావే,” అంటే, వచ్చి కంచంముందు కూచుని అన్నం అటూ ఇటూ కెలికేసి వెళ్లిపోయింది.

“పాలు తాగవే” అంటే “ఏం? పాలు తాగకపోతే పెళ్లి చేసుకోనన్నాడా ఆ పెళ్లికొడుకు?” అంది.

“ఇది మళ్లీ ఎప్పుడు మనుషుల్లో పడుతుందో?” అని తల్లీ, తండ్రీ బాధపడడం చూసి, కల్యాణి పేలవంగా నిట్టూర్చింది. బలంగా గాజుపలకని కొడితే ముక్కలు చెదిరిపోవా? ఏ ముక్కని పట్టుకుంటే ఏ ముక్క ఆగుతుంది? కల్యాణి కాలేజీకి వెళ్లడం మానేసింది.

అమ్మ, నాన్నగారు తనమనసు మళ్లించడానికి చేసిన ప్రయత్నాలు వృధా అయేయి. “అందుకే అంటారు ఏదేనా మప్పొచ్చు కానీ తిప్పడం కష్టం” అనీ అంది అమ్మ చిరాగ్గా.

ఓ ఆర్నెల్లు పెళ్లిసంగతి ఎత్తకుండా ఊరుకున్నారు. కొన్నాళ్లు అలా అయితే, అదే సర్దుకుంటుందని.

కాని కల్యాణి మటుకు రోజుకో రభస తెస్తూనే ఉంది. ఆఖరికి ఒకరోజు అమ్మ కళ్లనీళ్ల పర్యంతమయి, “ఆనాడు అత్తగారు సాధించింది. ఇప్పుడు కూతురై సాధిస్తోంది. ఏజన్మలో శత్రుత్వమో,” అంది విసుగ్గా.

ఆ మాట కల్యాణికి కష్టమనిపించింది. కానీ, తనేం చెయ్యగలదు?

ఏడెనిమిది నెలలతరవాత, ఒకరోజు భోజనాలదగ్గర అమ్మ మెల్లిగా మొదలుపెట్టింది, ''అతనికి డాన్సూ, సంగీతం అంటే చాలా యిష్టంట.''

కల్యాణి తలొంచుకుని భోజనం చేస్తోంది.

''ఏమో, నీ అదృష్టం బాగుంటే, పెళ్లయేక అతనే చెప్పించుకోకూడదూ .. ''

కల్యాణి జువ్వలా లేచింది. ''అలాంటిమాటలు నాతో ఎప్పుడూ అనకమ్మా! పద్ధెనిమిదేళ్లు పెంచిన మీకు అర్థం కాలేదు నా ఆశలేమిటో .. ఇంక ... ఇంక ...'' కల్యాణి మాట్లాడలేక లేచి వెళ్లి పోయింది. వెళ్లిపోతూ, గుమ్మందగ్గర నిలబడి, ''ఇంక నన్నేమీ అడక్కండి. నాతో చెప్పకండి. మీయిష్టం ఎలా ఉంటే అలా చెయ్యండి,'' అనేసి వెళ్లిపోతున్న కల్యాణికి ''దీనికింకా చిన్నతనం ఒదల్లేదు,'' అని అమ్మ అనడం వినిపించింది.

నెలరోజులనాడు కల్యాణికీ మురారికీ వైభవంగా పెళ్లి జరిపించేరు పెద్దలంతా కలిసి.

పెళ్లి అవగానే, మురారి కల్యాణిని తీసుకుని గుంటూరు వెళ్లిపోయాడు.

OOO

మురారికి నాటకాలూ, సంగీతం పిచ్చి ఎక్కువే. నాట్యకళాసమితుల్లోనూ, గానకళాసంఘాల్లోనూ ఎప్పుడూ మునిగి తేలుతూండేవాడు. కల్యాణి మొదట్లో ముభావంగా ఊరుకున్నా, తరవాత్తరవాత మురారి బలవంతంమీదా, అతను టిక్కెట్లు కొనేస్తూ ఉండడంవల్లా అతనితోపాటు తను కూడా నాటకాలకీ, గానసభలకీ వెళ్లడం మొదలుపెట్టింది. అయితే ఇంటిదగ్గర మాత్రం మురారికి ఆ విషయాలు చర్చించడానికి వీలుండేది కాదు. క్రమంగా ఇంట్లో ''సంగీతం'' అవాచ్యంగా మారి ఊరుకొంది. అదొక టాబూ, అసంస్కృతం.

రోజులు గడుస్తున్నకొద్దీ కల్యాణికి ఏదో వెలితిగా, చికాగ్గా ఉండసాగింది. ఏదో భరించలేని ఆవేదనగా ఉంటుంటే, ఆఖరికి ఒకరోజు ఆలిండియో రేడియో, బెజవాడవాళ్లకి వాయిస్ టెస్ట్ ఇవ్వమని కోరుతూ ఒక ఉత్తరం వ్రాసి పడేసింది. వారంరోజులనాడు జవాబు వచ్చింది. ఆ ఉత్తరం అప్పుడే ఆఫీసునించి వస్తూన్న మురారి అందుకున్నాడు.

‘‘ప్రభుత్వంనుంచి తమరికొచ్చే తాఖీదులేమిటో?’’ అన్నాడు మురారి కవరుమీదున్న సర్వీస్ స్టాంపులు చూస్తూ.

‘‘విప్పి చూస్తే సరిపోతుంది కదా,’’ అంది కల్యాణి కాఫీ డికాక్షను కలుపుతూ.

మురారి సావిట్లో కుర్చీలో కూర్చుని కవరు విప్పి చూశాడు. అతని కనుబొమలు ముడివడ్డాయి. ‘‘ఏమిటిది కల్యాణీ?’’

కల్యాణికీ తెలీలేదు. ‘‘ఏమిటండీ?’’ అంది దగ్గరికి వస్తూ.

‘‘రేడియోవాళ్లు వాయిస్ టెస్టుకి ఈ శనివారం రమ్మని వ్రాశారు. నువ్వు వాళ్లకి వ్రాసావా?’’ అని అడిగేడు మురారి.

అప్పుడు అర్థమయింది కల్యాణికి. ‘‘ఆఁ. నేనే రాసేను. ఏం తోచడంలేదు. అందుకు,’’ అంది.

‘‘ప్చ. ఇవాళ రేడియోలో, రేపు స్టేజిమీదా, ఎల్లుండి డ్యాన్సూ .. ఇవి నాకు నచ్చవు కల్యాణీ. ఛ,’’ అన్నాడు కళాభిమానీ, రసజ్ఞుడూ, విద్యావంతుడూ అయిన మురారి.

కల్యాణి తృళ్లిపడింది. మరుక్షణంలో కల్యాణి అక్కడ లేదు. ఆ సాయంత్రం మురారికి కాఫీ రాలేదు.

ఏమాత్రమో మిగిలిన చివరి తల్లివేరు కూడా ఆ ఛీత్కారంతో మాడిపోయింది.

ఆతరవాత వారం, పదిరోజులనాడు మురారి హడావుడిగా వచ్చి, ‘‘వంట వేగిరం కానియ్. ఏకా దండయ్యపంతులు హాల్లో గోటువాద్య కచేరీ ఉంది. టికెట్లు తీసుకున్నాను,’’ అని చెప్పాడు.

‘‘నేనివాళ రాలేను. మీరు వెళ్లి రండి,’’ అంది కల్యాణి శాంతంగా.

‘‘ఏం?’’

‘‘తలనొప్పిగా వుంది.’’

‘‘మాత్ర వేసుకుంటే అదే పోతుంది. ఇతను గోటువాద్యం చాలా బాగా వాయిస్తాడని అందరూ చెప్పుకుంటారు, పద,’’ అన్నాడు మురారి.

కాని కల్యాణి మటుకు రాలేనని ఖచ్చితంగా చెప్పింది. ఆ స్వరంలో నిశ్చయాన్ని చూసి మురారి మాట్లాడకుండా వెళ్లిపోయాడు.

ఆ తరవాత రెండు, మూడు మార్లు కూడా కల్యాణి అలాగే చెయ్యడంతో మురారికి ఏదో అనుమానం వచ్చింది. ‘‘ఏం? ఈమధ్య నువ్వు అసలు వేటికీ రావడంలేదు,’’ అన్నాడు.

కల్యాణి మటుకు అది సాధారణమే అన్నట్లు, ‘‘ఏం లేదు. రావాలని ఉండడంలేదు,’’ అంది.

‘‘తీరిపోయిందేమిటి సరదా?’’ అని మందహాసం చేశాడు మురారి.

‘‘ఆఁ, మీసాంగత్యంలో,’’ మెరుపులా జవాబు చెప్పి అక్కడ్నుంచి వెళ్లిపోయింది కల్యాణి.

‘‘నేనేం చేశాను? లోకాన్ని, మనుషుల్నీ అర్థం చేసుకోడం నేర్చుకోవాలి తను,’’ అనుకున్నాడు మురారి నేరం ఒప్పుకోలేని మనస్తత్త్వంతో.

ooo

‘‘సుపుత్రుడు ఉత్తరం రాసాడు,’’ అన్నాడు మురారికొడుకు హరి రాసిన ఉత్తరం కల్యాణిమీదకి విసిరి.

‘‘ఏం రాసాడు?’’ అంది కల్యాణి ఉత్తరం తీసుకుంటూ.

‘‘లక్ష్మీ సమానురాలయిన అమ్మకి,

నేనిచ్చిన టెలిగ్రాం అందిందనుకుంటాను. పాప ముమ్మూర్తులా నీ పోలికే. ఇంకా నెలైనా కాలేదు. అప్పుడే కాళ్లూ చేతులూ కొట్టుకుంటూ ఎలా ఆడుతోందా తెలుసా? జానకి ఏమో నీలాగే ఉంటుందనీ, నీపేరే పెడతాననీ అంటోంది. నువ్వు చాలా అదృష్టవంతురాలివిట. పాప కూడా నీ అంత అదృష్టవంతురాలు అవాలిట. మరి నువ్వెప్పుడొస్తావు చూడడానికి? జానకి పాపకి డాన్సు నేర్పిస్తానంటోంది.

ఇట్లు

హరి

కల్యాణి కళ్లు మూసుకుంది. పాప తన పోలికట! ఎలా ఎక్కడినించి వస్తాయి ఈ పోలికలు? తనని తన నాయనమ్మ పోలిక అనేవారు. మళ్లీ తన మనుమరాలు తనని పోలింది? ఇలా ఒకళ్లనీడలు మరొకళ్లమీద ఎందుకు పడతాయి? ఇలా తాతమూకుడు తరతరాలా ఎందుకు వస్తుంది? తన అదృష్టం? ఏ విషయంలో తను అనుకున్నది అనుకున్నట్టు జరిగిందని? తను సాధించిందేమిటి? తనని పోలిందట. డాన్సు నేర్పిస్తారుట! ఈ వయసునుండీ పెంచుకున్న ఆశలు ...

"మనవరాల్ని తలుచుకుని మురిసిపోవడమేనా? నాకు కాఫీలాంటిది ఇవ్వడం ఏమైనా వుందా?" అని మురారి నవ్వడంతో కల్యాణి కళ్లు తెరిచి ఈ లోకంలో పడింది.

కాఫీ పెట్టి తెస్తున్న కల్యాణికి హఠాత్తుగా ఒక ఆలోచన తట్టింది. ఔను, నిజమే. నాయనమ్మకి తనపాటి విద్య లేదు. ఆవిడకంటె తను మెరుగే. తను సాధించలేనిది ఈ పాప సాధించదని ఎందుకు అనుకోవాలి?

"దానికి 'విజయభారతి' అని పేరు పెట్టమని రాయండి. మీకు శలవు దొరగ్గానే చూడ్డానికి వెళ్దాం," అంది కల్యాణి దరహాసవదనంతో.

చాలాకాలానికి కల్యాణిమొహంమీద వెలిగిన చిర్నవ్వుని ఆశ్చర్యంగా చూశాడు మురారి.

000

(ఆంధ్రసచిత్రవారపత్రిక. సెప్టెంబరు 8, 1963)

# 14. ఎదురు చూసిన రూపం!

ఎనలిటికల్ జామెట్రీతో తలమునకలౌతున్న బదరీదగ్గరికి మెల్లిగా నరుడు నారాయణుడిదగ్గరికి వెళ్లినంత భక్తిప్రమత్తులతో చేరింది ఉమ, ''ఏంచేస్తున్నావురా?'' అంటూ.

''మేకలు కాస్తున్నాను'' అన్నాడు బదరీ తలెత్తకుండా. వాడికి ఈ చెల్లెలంటే చులకన, తనకంటె ఒకయేడే చిన్నయినా రెండు క్లాసులు తక్కువ చదువుతోందని. వాడు ప్రీయూనివర్సిటీకి వచ్చేశాడు, ఉమ ఇంకా ఫిఫ్తుఫారమే. సన్నగా పొట్టిగా వున్న బదరీనాథని ''అప్పుడే పీయూసీకొచ్చేశావా?'' అని ఎవరైనా కళ్లెగరేసినప్పుడు వెన్ను విరిచి మరొక అంగుళం పొడుగ్గా కనిపించడానికి ప్రయత్నిస్తుంటాడు. ఉమ కూడా అలాగే సన్నగా, పొట్టిగా పరికిణీ, జాకట్లలో తిరుగుతూ అప్పుడే ఫిఫ్తుఫాంకి వచ్చేసినందుకు పెద్దలని ఆశ్చర్యపరుస్తూ వుంటుందని వాడికి తోచదు. అథవా తోచినా అంతగా పట్టించుకోడు. తను మగవాడూ, ఉమ ఆడపిల్లాను. తను ఉమకి చేయగల సాయాలున్నాయి కానీ ఉమ తనకి చేయగల సాయం ఇంతవరకూ చరిత్రలో తటస్థపడలేదు. అదీ వాడిధీమా. అందుకు తగ్గట్టు ఉమకి ఎప్పుడూ అలాటి అవసరాలు తగుల్తూనే వుంటాయి.

''అది కాదురా, బదరీ,'' అంది ఉమ తన విజ్ఞాపనకి పరిచయం చదువుతూ.

''ఉఁ'' అన్నాడు బదరీ సాయంత్రం ఇంటిదగ్గర కనిపించు అనే ఆఫీసరంత హుందాగా.

''టౌనుహాల్లో గురజాడ అప్పారావు వర్ధంతి ఉత్సవాలు అవుతున్నాయిట.''

''నన్ను వెంటబెట్టుకుని రమ్మని నీకు ప్రత్యేకాహ్వానం వచ్చిందా?'' అన్నాడు బదరీ ఉమమొహంలోకి తీక్ష్ణంగా చూస్తూ.

ఉమకి తనపని అయేట్టు కనిపించలేదు వాడిమొహం తీరు చూస్తే. అనువు చూసుకుని మిడిసిపడతాడు అనుకుంది కసిగా.

''అమ్మ నిన్ను తీసుకెళ్లమంది,'' అంది క్లుప్తంగా.

బదరీ మాట్లాడలేదు. అమ్మ ఎప్పుడూ ఇంతే. డవాలీబంట్రోతు పనులన్నీ నాకు చెబుతుంది అనుకున్నాడు కోపంగా.

‘‘విశ్వప్రియ ఉపన్యాసం వుంది,’’ అంది ఉమే మళ్లీ.

‘‘అలా చెప్పు.’’

విశ్వప్రియరచనలంటే ఉమకి మహా యిష్టం. అవిడఫొటోలు అప్పుడప్పుడు పత్రికలలో పడ్డవి సేకరించి ఆల్బం తయారు చేసింది. ఆవిడరచనలన్నీ కత్తిరించి ఫైలు తయారు చేసింది. ఆవిడనిగురించి ఏ దినపత్రికలో ఏమాత్రం వార్త వచ్చినా ప్రత్యేకశ్రద్ధతో చదివేది. కత్తిరించి దాచేది. ‘‘విశ్వప్రియసాహిత్యప్రియ’’ ఉమ ఒక్కమాటలో.

‘‘నేనీ ఛాప్టరు పూర్తి చెయ్యందే చావడానికైనా లేవను,’’ అన్నాడు బదరీ ఎక్స్ యాక్సిస్‌మీద గుర్తులు పెడుతూ.

‘‘పరీక్షలో ఇలాగే చేస్తావేమిటి?’’

‘‘ఎలా?’’ ప్రశ్నార్థకంగా చూశాడు తలెత్తి.

‘‘అడగనిప్రశ్నకి జవాబు చెప్పడం.’’

‘‘అడిగిందానికే చెప్పేను.’’

‘‘డొంకతిరుగుడుగా.’’

బదరీకి వళ్లు మండింది. ఇంతకీ ఇది దానిపనా, నాపనా? ‘‘అవతలకి ఫో ముందు’’ అన్నాడు విసురుగా.

ఉమ కదల్లేదు. ‘‘మహా అయితే ఎనిమిదిగంటలవుతుందేమో మనం ఇంటికి వచ్చేసరికి. రాత్రంతా కూచుని చేసుకోకూడదేమిటి?’’ అంది సణుగుతున్నట్టు.

‘‘ఇంకా చాలా చెయ్యాలే,’’ అన్నాడు బదరీ విసుగ్గా.

ఉమ మాటాడకుండా లేచి తన అల్మారాలోంచి ఫైలు తెచ్చుకుని టేబులుముందు కూర్చుంది. అది విశ్వప్రియఫైలు.

బదరీ కొనకళ్ల దాన్ని చూస్తూ, తలెత్తకుండానే, ''ఆ దుకాణం ఇక్కడ విప్పకు'' అన్నాడు. వాడికి సహజంగా సారస్వతం అంటే జుగుప్స లేదు కానీ ఈ చెల్లెలు చేసే ఆర్భాటం చూస్తే చిరాకు.

ఉమ విననట్టు తనపని చూసుకోసాగింది. పావుగంట గడిచేసరికి వాడు దిగొస్తాడని ఆ పిల్లకి అనుభవమే!

ఉమ వయసుకి చిన్నదయినా తెలివితేటలు గలది. పది చెత్తకథల్లో ఒక మంచికథ పోల్చుకోడమే కాక ఒక మంచికథలో విశిష్టగుణాలు పోల్చుకోగలపిల్ల. విశ్వప్రియరచనల్లో నిర్దుష్టమయిన అభిప్రాయాలూ, అవి ఆమె ప్రకటించే విధానం ఆ అమ్మాయిని ఆకర్షించేయి. వాగాడంగబరం లేకుండా సున్నితమయిన అభిప్రాయాలనీ, లలితమయిన భావాలనీ సామాన్య పదజాలంతో చెప్పగల సామర్థ్యం ఆ కలంలో వుంది. ''అలవాట్లు'' అన్నకథ తీసుకుని చదవడం మొదలుపెట్టింది. అందులో షికాగో వెళ్లినకొడుకు అక్కడే ఒక తెలుగుకన్యని పెళ్లి చేసుకుని తీసుకువస్తాడు. తల్లి ఏమీ అనదు. కానీ క్రమంగా రోజులు గడుస్తున్నకొలదీ ఏదో అవ్యక్తమయినభావం--అసంతృప్తిలాటిది తెల్లమవుతుంది ఆ యింట్లో. కొడుకులో మార్పు లేదు కానీ తేడా వుంది. అది అతడు గమనించేడో లేదో కానీ తల్లిదృష్టి దాటిపోలేదు. ఆలశ్యంగా పడుకుంటున్నాడు. ఆలశ్యంగా లేస్తున్నాడు. రోజుకి ఏడెనిమిది మార్లు కాఫీ తాగుతున్నాడు. కోడలు ప్రతిదాన్లోనూ ఉప్పెక్కువ వేస్తోంది.

''భోజనాలగదిలో బల్ల వద్దు,'' అంటుంది తల్లి.

''ఆయనకి అలవాటయిపోయింది. కింద కూర్చుని తినలేనంటారు'' అని సమాధానం ఇస్తుంది కోడలు.

తల్లి హృదయం కలుక్కుమంటుంది. ''పాతికసంవత్సరాల అలవాట్లు ఒక్క సంవత్సరంలో మారిపోయాయి. ఈ ఒక్క సంవత్సరంలో వచ్చిన అలవాట్లు శాశ్వతం కాబోలు,'' అంటుంది తల్లి బాధ సూచించే చిరునవ్వుతో.

ఈ కథ చదివినప్పుడల్లా ఉమకి కళ్లు తడి అవుతాయి. ఇందలో కథకురాలు ఎవరినీ నిందించదు. నేర్పుగా మూడు దృక్కోణాలూ చూపిస్తుంది. సంఘం వ్యక్తిని ఒరుసుకు ప్రవహించే జీవగంగ. ఆ ఒరవడిలో ప్రతివ్యక్తీ కొంత పోగొట్టుకోక తప్పదు.

''కావలిస్తే ఆరుగంటలతరవాత వస్తాను,'' అన్నాడు బదరీ ఆఖరికి ఆ అర్భకురాలిపై జాలితో.

''మీటింగు అయిదుగంటలకే మొదలు,'' అంది ఉమ దీక్షగా కాగితాలు చూసుకుంటూ.

''సరేలే, తయారవు,'' అన్నాడు బదరీ ఆపన్నప్రసన్నుడై.

సరీగ్గా పదినిముషాలు తక్కువ అయిదుకి ఇద్దరూ అమ్మదగ్గర శలవు పుచ్చుకుని వీధిన పడ్డారు.

''నువ్వు రోడ్డుకి అటుపేపు నడు,'' అన్న అన్నగారిని ఉమ ఏమీ అన్లేదు. ''ఆడపిల్లల్తో వెళ్తున్నావేమిట్రా'' అని వాడిస్నేహితులు హేళన చేస్తారని వాడిభయం. ''నీసాయం మండినట్టే వుంది,'' అని మనసులోనే విసుక్కుంది రోడ్డు అటుపేపుకి దాటుతూ.

దారిపొడుగునా ఉమ ''ఆవిడ'' ఎలా వుంటుందో ఊహించడానికి ప్రయత్నిస్తూనే వుంది. ఎందుకనో పెద్దదే అయివుంటుంది అనిపించింది. ముప్పై, ముప్పైఅయిదు వుంటాయనుకుంది. చేయెత్తు మనిషి, కలువరేకులవంటి కన్నులతో, కోటేరేసినముక్కూ, కొనదేలిన చుబుకంతో, దరహసితవదనంతో, రెండంగుళాలు జరీఅంచు, నూటయాభైనెంబరు నెమలికంఠం రంగు గుంటూరు చేనేత చీరె, దానికి తగినరంగు బ్లౌజుతో విశ్వప్రియ ఉమకన్నులముందు లీలగా మెదలింది. ఆటోగ్రాఫు తీసుకోవాలనుకుంది. కొందరు వొట్టి పేరు రాస్తారు. కొందరు అది కూడా రాయడానికి ఇష్టపడరు. మంచివాక్యాలు రాసేవాళ్లు చాలా తక్కువమంది. విశ్వప్రియని ఏదైనా మంచి 'సందేశం' రాయమని అడగడానికి నిశ్చయించుకుంది. అంతలోనే మరో సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆవిడకథలు ఒకటి, రెండు చదివేక పట్టలేని సంతోషాన్ని తెలియజేస్తూ రెండు ఉత్తరాలు రాసింది. జవాబు రాలేదు.

''నీఉత్తరాలకి జవాబులు రాస్తూ కూచుంటే ఇహ కథలు రాసినట్టే,'' అన్నాడు బదరీ వెక్కిరింపుగా.

‘‘ఏడ్చావులేవోయ్’’ అని అప్పట్లో వాడిని కసిరికొట్టినా తర్వాత నిజమే అనిపించింది.

వాళ్లు టౌన్‌హాలు చేరేసరికి ఐదుంపావు అయింది. ఆడవాళ్లు కూచున్నచోట ఉమచోటు గుర్తు చూసుకుని బదరీ మగవాళ్లవేపు వెళ్లి కూర్చున్నాడు.

అదొక విశేషంగా వుంటుందని కాబోలు మీటింగు అయిదుకల్లా మొదలు పెట్టేశారు. సభాధ్యక్షుడు ప్రారంభోపన్యాసం ఇస్తున్నాడు. ఉమ ఆతృతగా అటూ ఇటూ చూసింది. స్టేజిమీద వున్న ఒకే ఒక స్త్రీకీ ఉమ ఊహించుకున్న విశ్వప్రియకీ పోలికలు లేవు. అయినా ‘‘నేనెందుకలా ఊహించుకోవాలీ?’’ అనుకుంది నీరసంగా. స్టేజిమీద ఆవిడ కొంచెం లావుగా వుంది. పొట్టిగా వుంది. మొహం పరిపూర్ణచంద్రబింబాన్ని పోలి వుంది. చవకరకం నైలాన్ చీరె, అదే రంగు డెకొరాన్ బ్లౌజు వేసుకుంది. ... ...

అధ్యక్షుడు విషయచర్చ ముగించి విశ్వప్రియని పరిచయం చెయ్యడం మొదలెట్టేడు. ‘‘శ్రీమతి విశ్వేశ్వరిగారు తెలుగుపాఠకులకి సుపరిచితులు. ఆమె గత 15 సంవత్సరాలుగా తెలుగు సాహితీక్షేత్రంలో చేసిన సేవ అపారం, అమోఘం. అనన్యసామాన్యమైన ప్రతిభావ్యుత్పత్తులు కలిగి, అవి సద్వినియోగం చేసుకోడానికి తగిన అవకాశం లభించిన చాలా తక్కువమంది రచయిత్రులలో ఈమె ఒకరు. ఈమె అనేక కావ్యఖండికలు రాసారు. కొన్నివందల కథలు రాశారు. ఎన్నో సాహిత్యసభలకి అధ్యక్షత వహించారు. సారస్వత సదస్సులలో పాల్గొన్నారు. అటువంటి వ్యక్తిని నేను పరిచయం చేయడం అనవసరం. మీరే వినండి.’’

ఉమ చుట్టూ చూసింది. ఆడియన్సు అంతా తనలాగే ఉత్కంఠతో ఉపన్యాసంకోసం ఎదురు చూస్తున్నారు. విశ్వప్రియ లేచింది. ఆపరేటరు గబగబా వచ్చి మైకు ఆమెఎత్తుకి దించాడు. విశ్వప్రియ ఉపన్యాసం ప్రారంభించింది. ‘‘నేను ఉపన్యాసం ప్రారంభం చేసేదానికి ముందుగా ఈ ఉత్సవాలు ఎరేంజి చేసి, నన్ను ఇక్కడికి ఉపన్యాసకురాలిగా ఆహ్వానించిన శ్రీరామ్మూర్తిగారికి, ఇతర కార్యకర్తలకూ నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. నిజానికి నేను ఇక్కడికి వచ్చి వుండేదాన్ని కాను. దానికి చాలా కారణాలు వున్నాయి. ముఖ్యంగా శ్రీ సత్యనారాయణమూర్తిగారివంటి మహా వక్తలూ, మేధావులూ పాల్గొంటున్న ఈ

సభలో నేనూ ఒక ఉపన్యాసకురాలినే అంటూ స్టేజి ఎక్కడం హాస్యాస్పదమే అవుతుంది. ఈ సంగతి సెక్రటరీగారితో చెప్పి వున్నాను కూడా. కాని వారు నాయందు గల అభిమానముచేత నైతేనేమి, నారచనలయందు గల సద్భావంచేతనైతేనేమి, నేను రావాలని బలవంతం చేయడంచేత అంగీకరించక తప్పలేదు. వాస్తవానికి ఈ పట్టణం పలువురు ప్రముఖ రచయితలకి ఆలవాలం. అటువంటి ఈ పట్టణంలో శ్రీ గురజాడ అప్పారాయవర్ధంతి ఉత్సవాలు జరపబూనుకోవడం, ఆ ఉత్సవాలలో పాల్గొనమని నన్ను ఆహ్వానించడం నాకొక అమూల్యమైన కానుకగా, అద్వితీయమయిన గౌరవంగా భావిస్తున్నాను. ఎందుచేతనంటే పది సంవత్సరాలక్రిందట నేను ... ‘‘

ఉమలో కొంచెం సంచలనం కలిగింది. చుట్టూ చూసింది. శ్రోతలలో మొదట్లో వున్నంత ఉత్సాహం కనిపించలేదు. ఉపన్యాసం పక్కదారి పట్టింది. అది శ్రోతలు మాత్రమే గ్రహించారు. బదరీ ఆ అవకాశంకోసమే ఎదురు చూస్తున్నాడేమో ఉమ తనవేపు తిరగ్గానే ‘‘వెళ్లిపోదాం’’ అని సౌంజ్ఞ చేశాడు.

‘‘ఉండు’’ అంది ఉమ కళ్లతోనే.

‘‘ ... అప్పారావుగారివంటి మహాపురుషునిగూర్చి మూడు ముక్కల్లో చెప్పబోవడం రామాయణం అంతా ‘కట్టె, కొట్టె, తెచ్చె’ అంటూ చెప్పినట్టుగానే వుంటుంది. ఆ సాహసం నాకు లేదు. పైగా శ్రీ సత్యనారాయణమూర్తిగారు ఇంతకుముందే అప్పారావుగారిగురించి హృదయాలకు హత్తుకుపోయేట్టుగా సరళమైన భాషలో చక్కగా చెప్పివున్నారు. శ్రీ అప్పారావుగారి దృష్టిలో స్త్రీ ఒక అపూర్వశక్తి. ...’’

ఉమ వెనక ఎవరో జడ పట్టుకు లాగేరు. వెనక్కి తిరిగి చూసింది. వెనకనున్నావిడ తలుపువేపు చూపించింది. అక్కడ బదరీ మెడలు విరిగిపోయేలా తల విసిరేడు, ‘‘వస్తావా, రావా’’ అన్న అర్థంతో. ఉమ వాడిని లెక్క చేయకుండా మరొక పావుగంట అక్కడే కూచుంది. ఉపన్యాసం ఎంతసేపటికీ రబ్బరులా సాగుతోందే కానీ సరుకు కనిపించలేదు. ఆఖరికి తప్పలేదు. ఆ పిల్ల ఆశలన్నీ వమ్ము అయేయి.

ఇద్దరూ రోడ్డుమీదకి వచ్చేక, ‘‘అయిందా సాక్షాత్ సరస్వతీదేవి సాక్షాత్కారం’’ అన్నాడు బదరీ హేళనగా. ‘‘నేను ముందే చెప్పేను కదా అవన్నీ ఆవిడ రాసినవి కావని.’’

‘‘ఊఁ’’ అంది ఉమ.

బదరీ తెల్లబోయేడు.

ఇద్దరూ ఇంటికి చేరేసరికి పావుతక్కువ ఎనిమిది అయింది. వరండాలో నాన్నగారితో మాటాడుతూ మూర్తిమామయ్య కనిపించేడు. ఆయన గుంటూరునించి వచ్చేడు.

‘‘ఏమర్రా, జ్ఞాపకం వున్నానా? నాలుగేళ్లయినట్టుంది చూసి. అయిందా మీటింగు?’’ అంటూ ఆప్యాయంగా పలకరించేడు.

ఉమ ఆయన కూర్చీదగ్గరికి వెళ్లి, ‘‘నువ్వెప్పుడు వచ్చేవు?’’ అంది కొంచెం సిగ్గు పడుతూ.

బదరీ చిన్నగా నవ్వుతూ స్తంభంపక్కన నిల్చున్నాడు.

‘‘పలకరింపులకేంగానీ తరవాత కావలిసినంత టైము. ముందు భోజనాలకి లేవండి,’’ అని వంటింట్లోంచి అమ్మ కేకేయడంతో ఉమ ఇంట్లోకి వెళ్లింది. బట్టలు మార్చుకుని కంచాలూ, పీటలూ పెట్టడానికి.

మామయ్యా, నాన్నగారూ ఏవో కబుర్లు మొదలుపెట్టడంతో బదరీ కూడా లోపలికి కదిలేడు.

‘‘ఇంతకీ ఏమిటోయ్ మీటింగు?’’ అన్నాడు మామయ్య సగం భోజనం అవుతూండగా బదరీవేపు తిరిగి.

‘‘ఏదో సాహిత్యసభ. చెప్పవే,’’ అన్నాడు బదరీ ఉమవేపు తిరిగి. అలాటి ‘‘ఫ్లాప్’’ సభలకి బయల్దేరంత తెలివితక్కువతనం తనకి లేదని మామయ్య గ్రహించాలని వాడి అభిలాష. వినేవాడికి ఓపిక వుండాలి గానీ ఈ ‘‘సోప్‌బాక్స్ ఆపరేటర్లు’’ రోజుకి ముగ్గురు తగుల్తారు కాళ్లకడ్డం పడుతూ అని వాడిఅభిప్రాయం, పక్కన నాన్నగారుండడాన్ని వెలువరించలేదు కానీ.

ఉమకి అంతకన్నా నిరుత్సాహంగా వుంది. అయినా అడిగినవాడు ఫల్గుణునివంటివాడు కనక ''గురజాడ అప్పారావు వర్ధంత్యుత్సవాలు అవుతున్నాయి, మామయ్యా!'' అంది తలొంచుకుని అన్నం కెలుకుతూ.

ఆయన అంతటితో వదిలిపెట్టలేదు. ''ఇవాళ ఎవరెవరు వచ్చేరు?'' అని అడిగేరు.

''సత్యనారాయణమూర్తిగారూ, విశ్వప్రియగారూ'' అంది ఉమ నెమ్మదిగా. దానికి ఈ విషయం మాటాడాలని లేదు.

''సత్యనారాయణమూర్తిగారు చాలాబాగా మాట్లాడివుండాలే,'' అన్నాడు మూర్తి కొస వదలకుండా.

''అవును. ఆయన చాలా బాగా మాటాడతారు.''

''విశ్వప్రియగురించి అడుగు,'' అన్నాడు బదరీ వెక్కిరింపుగా.

''ఏం?''

''ఆవిడ బ్రహ్మాండంగా మాటాడుతుందనుకుని వెళ్లేం అక్కడికి.'' ఉమయందు ఏదో ఓ మూల మొలకెత్తిన రవంత సానుభూతితో బదరీ తనవాక్యాన్ని సున్నితం చేసేడు.

''ఓ, అదా. అవునవును. ఆవిడ అంత బాగా మాటాడలేదు. ఏమంత మంచి స్పీకరు కాదావిడ.''

దాంతో బదరీ గర్వంగా ఉమవేపు చూశాడు, ''నాకు తెలుసు మామయ్యా! ఆవిడపేరుతో అచ్చయేవన్నీ వాళ్ల నాన్నగారో అన్నయ్యో రాసినవి అయుంటాయి,'' అన్నాడు.

ఎదుటివ్యక్తిలో గొప్పతనాన్ని సహించలేని అన్నగారివేపు ఎర్రగా చూసి తలొంచుకుంది ఉమ.

కాని మూర్తి ఉమవేపు మొగ్గు చూపాడు. ''అలా అనకు బదరీ. కొందరు బాగా మాటాడతారు. కొందరు బాగా వ్రాస్తారు. ప్రతి రచయితా వక్త కావాలనేముందీ?'' అన్నాడాయన.

''అలా అయితే ముందుగా రాసుకుని, కంఠతా పట్టి వచ్చినా సరిపోను,'' అన్నాడు బదరీ.

‘‘అలా కంఠతా పట్టినప్పుడు కంఠతా పట్టి ఒప్పచెప్పినట్టే వుంటుంది. నాకావిడని తెలుసు. మావూరేగా. వచ్చినప్పుడు ఇద్దరం ఒక రైల్లోనే వచ్చేం. ఇక్కడికి రమ్మన్నాను కూడాను. బహుశా రేప్పొద్దున్న వస్తే రావచ్చు.’’

ఉమచేతిలో అన్నం కంచంలోకి జారిపోయింది. మామయ్య పలికిన ప్రతిపలుకూ స్వాతి చినుకయి అలరించింది. ‘‘అయితే నీకు ఆవిడతో అంత పరిచయముందా?’’ అనడిగింది.

‘‘దీనికావిడంటే హీరో వర్షిప్పూ,’’ అన్నారు నాన్నగారు నవ్వుతూ.

‘‘అంత అంటే .. తెలుసు. నేను ఫలానా అని ఆవిడకి తెలుసు. ఆవిడ ఫలానా అని నాకు తెలుసు. ఇద్దరం ఒకే రైల్లో వచ్చేం. ఏదో మాటామంతీ వచ్చింది. మాటాడుకున్నాం,’’ అన్నాడు మూర్తి పరిస్థితి వివరిస్తూ.

ఉమ కొంచెంసేపు మాటాడలేదు. ఏం అడగాలో ఎలా అడగాలో తెలీలేదు ఆ పిల్లకి.

‘‘అయితే వాళ్లిల్లు మీయింటికి దగ్గరేనా?’’

‘‘ఓ మోస్తరుగా దగ్గరే. మన రావు జ్ఞాపకం లేడూ. యూనివర్సిటీలో మన సహవిద్యార్థి’’ అన్నాడు మూర్తి నాన్నగారివేపు తిరిగి.

‘‘అవును, తెలుసు. ఏం?’’

‘‘ఈ విశ్వప్రియ అతని అక్కకూతురే. అక్కడ విమెన్స్ వెల్‌ఫేర్ ఆఫీసరుగా వుంటోంది. గొప్ప ధైర్యసాహసాలు గలమనిషి. ఒక్కర్తే జీపు వేసుకుని ఎక్కడికేనా వెళ్లిపోగల ఆడదాన్ని నా జీవితంలో ఆవిడ్నొక్కదాన్నే చూసాను. ఆమధ్య ఓమారు ఏదో కేసులో చిక్కుకుంది కానీ బహు నేర్పుగా తప్పించుకుందిలే. కుట్టుమిషన్లు కొనమని ప్రభుత్వం ఇచ్చిన డబ్బుతో పట్టుచీరెలు కొంది అంటారు. లేదు, పొలాలమ్మి చీరెలు కొనుక్కున్నానంటుందావిడ. నిజానిజాలు ఆ లీలావినోదుడికే తెలియాలి.’’

మూర్తి ఆగి మంచినీళ్లు తాగాడు.

‘‘ఏం కావాలే నీకు? అలా కూచుండిపోయేవు?’’ అని అమ్మ అడిగిన ప్రశ్నకి ‘‘ఏం వద్దు,’’ అని తల అడ్డంగా తిప్పింది ఉమ.

“పెళ్లి చేసుకోలేదు. ఒక్కర్తే వుంటోంది. మద్రాసు యఫ్. ఎల్. సొసైటీలో మెంబరు అని చెప్పుకుంటారు”

“కబుర్లలో పడి నువ్వు అన్నం తినడంలేదు,” అన్నారు నాన్నగారు. పిల్లలముందు అలాటివిషయాలు మాటాడడం ఆయనకి ఇష్టం లేదు.

“లేదు, తింటున్నాను,” అన్నాడు మూర్తి.

అకస్మాత్తుగా ఉమ “నాకు తినాలని లేదు,” అంటూ లేచి వెళ్లిపోయింది. ఆ పిల్లమొహం తెల్లగా పాలిపోయి వుంది. అది గమనించిన మూర్తి క్షణకాలం నివ్వెరపోయేడు.

“అదెప్పుడూ అంతేలే. దానిమనసు అతి నాజూకు. ఆమధ్య ఏదో సినిమా చూసి మూడు రోజులపాటు అన్నం తినలేదు,” అన్నారు నాన్నగారు కూతురితరఫున క్షమాపణలు చెప్పుకుంటూ.

మూర్తి మాటాడకుండా భోజనం ముగించాడు. తరవాత డాబామీద కూర్చుని నాన్నగారితో రష్యా, చైనా సంబంధాలచర్చ మొదలుపెట్టేడు.

గదిలో బదరీ పుస్తకాలు ముందేసుకుని కూచున్నాడు కానీ వాడికేం చదవబుద్ధి పుట్టలేదు. చెల్లెలిఓటమి వాడికి క్షణకాలం సరదా వేసినా ఆ పిల్లకి అంత మొహం తిరగేలా తగలడం వాడికి కష్టం వేసింది. అంతరాంతరాల్లో ఆ అమ్మాయంటే వాడికి ఆపేక్షే మరి.

“ఇంకా తొమ్మిదేనా అవతేదూ, కొంచెంసేపు చదువుకోకూడదూ,” అన్నాడు దుప్పటిలో దూరి పడుకున్న ఉమనుద్దేశించి. ఆ విధంగానైనా ఆ పిల్లదృష్టి మరల్చాలని వాడి అభిప్రాయం.

“నాకు నిద్రొస్తోంది,” అంది ఉమ గోడవేపు తిరిగి కళ్లు గట్టిగా మూసుకుని నిద్ర తెచ్చుకునే ప్రయత్నాలు చేస్తూ.

కాని ఉమకి ఆ రాత్రి నిద్ర పట్టలేదు. చిన్నప్పుడు తను ఎంతో జాగ్రత్తగా దాచుకుని ఆడుకునే మట్టిబొమ్మ బదరీ బద్దలగొట్టినపుడు అది తనని చాలా బాధ పెట్టింది. మళ్లీ ఇప్పుడు అలాటి బాధే! ... మూర్తిమామయ్య చెప్పింది నిజం కాదేమో! అతను ఎందుకు అబద్ధం చెప్తాడు? ఏమో, అతనికీ తెలీదేమో సరీగ్గా. తను విన్నానని చెప్పేడు కానీ చూశానని

చెప్పలేదు కదా. అసలు గిట్టనివాళ్లెవరైనా పుకార్లు పుట్టించి వుండొచ్చు. ఆవిడకొచ్చిన పేరుప్రతిష్ఠలు చూసి కుళ్లుకుని అలా చేసి వుంటే ఆశ్చర్యమేం లేదు కదా. అసలు విశ్వప్రియగారు అలాటి కథ ఒకటి రాసింది కూడాను. ఉమకి లేచి ఆ కథ చదవాలనిపించింది, కానీ ఇప్పుడు లేస్తే మళ్లీ బదరీ తగులుకుంటాడు. వాడితో మళ్లీ ఏదో వాదనలేసుకోవాలి ... ఆనాడు ఆబదరీ తన మట్టిబొమ్మ పగలగొట్టాడు. ఈ రోజు మామయ్య తన ఊహలు చెదరగొట్టాడు. ఆ రాత్రి భోజనం, నిద్ర ఎగరగొట్టాడు అనుకోకుండా వుండలేకపోయింది ఆ చిన్నమనసు.

మర్నాడు ఉమ లేచేసరికి ఏడు దాటింది. ఎర్రబారిన ఉమకళ్లు చూసి, "ఇదెలా బతుకుతుందో," అంటూ తనలో తను గొణుక్కుంది అమ్మ.

ఉమ మటుకు పేగిరం స్నానం అవీ ముగించేసుకుని పుస్తకాలు ముందేసుకు కూర్చుంది. ఎవరూ లేకుండా చూసి, మామయ్యతో మాటాడాలని తహతహలాడుతోంది ఆ పిల్ల. అనుకున్నట్టుగానే తొమ్మిదిగంటలయేక అవకాశం దొరికింది. నాన్నగారు ఇప్పుడే వస్తానని వీధిలోకి వెళ్లేరు. బదరీ స్నేహితుడింటికి వెళ్లేడు. అమ్మ వంటింట్లో ఉంది. ఉమ మామయ్యదగ్గరికి చేరింది.

"అయితే మామయ్యా! విశ్వప్రియ 'యప్.యల్.' మెంబరు అన్నమాట నిజమేనా?" అంది పాలినమొహంతో. అది ఆ పిల్లని రాత్రినుంచీ వేధిస్తున్న ప్రశ్న.

అనుకోని ఈ ప్రశ్నతో మూర్తి తొట్రుపాటు పడ్డాడు. ఆ పిల్ల యఫ్.యల్, గురించి విని వుంటుందని అతను ఊహించలేదు.

"ఏమో, అంటారు. అయినా మాటలకేముంది. పుట్టగొడుగుల్లా వాటంతట అవే పుడతాయి."

ఆ పిల్ల తృప్తి పడినట్టుగా లేదు మొహంలో.

మూర్తి చదువుతూన్న పేపరు మడిచి పక్కన పెట్టేడు, "ఇలా వచ్చి కూర్చో. చెప్తాను,"

ఉమ కుర్చీ దగ్గరగా లాక్కుని కూచుంది సాలోచనగా.

''నిజంగా నేను చెప్పినవన్నీ నిజమే అనుకో. అయితే ఏం?'' అన్నాడు మూర్తి. 'చెప్పుకో చూదాం' ధోరణిలో, చిర్నవ్వు దాచడానికి యత్నిస్తూ.

ఉమ తెల్లబోతూ అతనివేపు చూసింది, ఆయనభావం అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తూ. గోముగా దగ్గరికి పిలిచి గట్టిగా ఓ మొట్టికాయ వేసినట్టుంది.

మామయ్య కొన్ని క్షణాలు ఆలోచించి నెమ్మదిగా అన్నాడు, ''చూడు ఉమా, ఒక మాట చెప్తాను. రచయితా కాదా అన్నప్రశ్న అలా వుంచు. అసలు మానవనైజం చాలా క్లిష్టమయినది, అంత తేలిగ్గా అర్థమయే పదార్థం కాదు అని ఒప్పుకుంటావు కదా. నువ్వు విశ్వప్రియ కథలు చదివి ఆవిడమీద నీకు నువ్వే ఒక అభిప్రాయం ఏర్పర్చుకున్నావు. నీ ఊహల్లో సుందరిలా ఆవిడ నీకు దర్శనమీయలేదని బాధపడడం న్యాయమేనా?.''

''ఎందుక్కాదూ? అదంతా నటనంటావా?''

''నేను అనేదల్లా రచయితలు చుట్టూ వున్న లోకంలో మనుషుల్ని చూసి పాత్రలు సృష్టిస్తారు. వాళ్లకథల్లో పాత్రలు వాళ్లే అవొచ్చు, కాకపోవచ్చు, అయితీరాలని నియమం లేదు.''

''అంటే వాళ్లకి చిత్తశుద్ధి లేదనుకోవాలా?''

''ఊఁఊమ్. అది కాదు నేనంటున్నది. మాటల్లో చెప్పడం కష్టం అనుకుంటా. ఒకొకప్పుడు రచయితలు తమని తాము చిత్రించుకుంటున్నప్పుడు కూడా 'నేనిలా వుంటే బాగుండు' అనుకున్నవ్యక్తిత్వాన్ని పాఠకులముందు పెడతారనిపిస్తుంది నాకు. తనలోని లోపాలనీ, దురలవాట్లనీ గురించి రాసినప్పుడు కూడా కాస్త జాగ్రత్త పడతాడు. ప్రతిరచయితా తానొక మేధావీ, భావుకుడూ అనే పాఠకులు గుర్తుంచుకోవాలని ఆశిస్తాడు. అంతే గానీ తన జీవితంలోని నికృష్టపు భాగం పాఠకులు గుర్తు పెట్టుకోవాలనుకోడు కదా.''

ఉమకి ఇంకా తికమకగానే వుంది. ఎంత దూరం నడిచినా పుంతలతోపుదగ్గరే తెల్లారినట్టు, ఎంత ఆలోచించినా తన దృష్టి మళ్లీ మొదటి ప్రశ్నకే వస్తోంది. రచయితలకి చిత్తశుద్ధి లేదనుకోవాలి. కనీసం తన మనసుకి అలాగే తోస్తోంది.

“పోనీ, మరొకటడుగుతాను చెప్పు. నీకు ఒక స్నేహితురాలుందనుకో. నిజంగా మీరిద్దరూ చాలా మంచి స్నేహితులు. ఆ అమ్మాయికి దూరపుబంధువైన ఒక యువకుడితో పరిచయం ఉంది. అందరూ పెడర్థాలు తీస్తూ వ్యాఖ్యానిస్తూంటారు వాళ్ల స్నేహంగురించి. ఆ అమ్మాయి నీతో అది నిజం కాదంటుంది. అతను తనకి  తమ్ముడిలాటివాడంటుంది. నువ్వు నమ్ముతావు. ఒకరోజు ఆ అమ్మాయి రాయపూర్ పాసింజరులో ఎవరినో చూడ్డానికి వెళ్తున్నానని నైట్ వాచ్‌మన్‌తోనూ, ఎ.పి.సి. టాబ్లెట్సు తెచ్చుకోడానికి వెళ్తున్నానని నీతోనూ చెప్పి బయటికి వెళ్తుంది. ఆరోజు ఆతమ్ముడిలాటివాడితో సెకండ్ షో సినిమాకి వెళ్లిందని ఎవరో నీకు చెప్తారు. సినిమాకి వెళ్లడం పెద్ద నేరమేమీ కాదు కానీ నీకు ఎందుకు చెప్పలేదని బాధ. అవునా కాదా? నువ్వు ఏమనుకుంటావు?”

“నేను నమ్మను.”

మూర్తి మందహాసం చేశాడు. “నిజమేనని తెలిస్తే?”

ఉమ ఆలోచించసాగింది.

మూర్తే అందుకున్నాడు, “అది నీకు యిష్టంలేదు కనక నీతో చెప్పలేదనీ, అంతకంటే ఏ దురుద్దేశమూ నీ స్నేహితురాలికి లేదనీ నువ్వు సమర్థింపజూస్తావు. అవునా?”

“ఊఁ.”

“అంటే ఆ అమ్మాయికి నీ యందు బోలెడు గౌరవమో అలాంటిదే మరోటో ఉందనుకుని ఆనందిస్తావు. నువ్వు అలా అనుకోడానికి కారణం ఏమిటి?”

“ … ..”

“నేను చెప్పనా?”

ఉమ తలూపింది. నిజానికి ఈ పయనం ఏ తీరానికో తెలియడంలేదు ఆ అమ్మాయికి.

“నీనమ్మకం. నువ్వు ఆ అమ్మాయిగురించి ఒక అభిప్రాయం ఏర్పరుచుకున్నావు. అది నిజమని నమ్మేవు. ఆ తరవాతిఅభిప్రాయాలన్నీ నీ మొదటినమ్మకంలోంచి వచ్చినవే. ఇంకా వెనక్కి వెళ్లి చూస్తే, నీ మొదటిఅభిప్రాయానికి ప్రాతిపదిక అంతకుముందు పెద్దవాళ్లు నీకు చెప్పినవీ, నువ్వు విన్నవీ అయివుంటాయి. నీకెప్పుడయినా తట్టిందా రామరాజ్యం అని

మనం చెప్పుకుని మురిసిపోయినట్టుగానే ఆనాటి లంకలో రావణరాజ్యం అని చెప్పుకుని పొంగిపోయేవారేమో.''

మూర్తి ఉమమొహంలోకి చూశాడు.

''నిజమే,'' అంది ఉమ నవ్వి.

ఆ పిల్లని ఆ మాత్రం నవ్వించగలిగినందుకు మూర్తిమనసు ప్రఫుల్లమయింది.

''చెప్పేను కదూ. నువ్వో అభిప్రాయాన్ని ఏర్పరుచుకున్నతరవాత - అది ఉల్లిపొరంత పల్చనిదైనా సరే - క్షణాలమీద కంచుగోడ అయిపోతుంది. దాన్నే గట్టిగా నమ్ముతావు. ఆ పైన నీ ఆలోచన పరిధిని కుదించేస్తుంది. ఇహ ఆత రవాత ఎవరేం చెప్పినా వినలేవు. అర్థం చేసుకోలేవు. ఇప్పుడు చూడు. నువ్వే వున్నావు. ఈ విశ్వప్రియ అంటే నువ్వు ఎందుకంత పిచ్చనమ్మకాలు పెంచుకున్నావు? ఆవిడకథల్లో వెలువరించిన అభిప్రాయాలు నీకు నచ్చేయి కనక. ఆ కథలనిబట్టి నీమనసులో నువ్వొక రూపం ఏర్పరుచుకున్నావు. ఆమె సుగుణాలరాసి. కుందనపుబొమ్మ. దేవతలు కూడా పూజించతగ్గ మేధావి. ఇది నీకు నువ్వయి కల్పించుకున్న రూపం. ఇవన్నీ ఆమెలో వుండాలని నువ్వు కోరుకుంటున్న గుణగణాలు. బహుశా ఆవిడకి కూడా అలాగే వుండాలని వుందేమో. అవే తన కథలరూపంలో ఆవిడ రాసిందేమో. నువ్వు వాటిని కథలరూపంలోనే గ్రహించి ఆనందించగలగాలి కానీ ఆవిడ అలా లేదని ఆయాసపడితే ఎలా? పూవుపరిమళం కొమ్మకి వస్తుందా?''

ఉమకి ఏదో అర్థం అయినట్టు, ఒక సత్యాన్ని గ్రహించినట్టు అనిపించింది.

''నువ్వు ఆవిడకథలు మెచ్చుకుంటున్నావంటే మీరిద్దరూ ఏకోన్ముఖంగా ఆలోచించడం కావచ్చు. మీయిద్దరితత్త్వాలు ఒక్కలాటివేనేమో. ఇందాక నేను చెప్పిన స్నేహితురాలిదృక్పథం నీ దృక్పథం పూర్తిగా భిన్నమయినవి.''

''నాకలాటి స్నేహితురాలు లేదు మామయ్యా!'' అంది ఉమ అయోమయంగా మామయ్యవేపు చూస్తూ.

మూర్తి ఫక్కున నవ్వేడు. ''అవును కదూ. మర్చేపోయేను'' అంటూ పేపరు తీసుకున్నాడు.

ఉమ తనగదికి వెళ్లింది. చాలా రోజులతరవాత నిర్మలచిత్తంతో ఓ పుస్తకం తీసుకుని కూర్చుంది చదువుకోడానికి.

000

(1962-63 ప్రాంతాల్లో విశాఖ మాసపత్రికలో ప్రచురితం.)

# 15. మంచుదెబ్బ

పశ్చిమదిక్కున విచ్చలవిడిగా చెలరేగుతున్న శారదనీరదపంక్తుల్ని చూస్తూ డాబామీద నిల్చున్నాను. ఇవేనేమో వప్రక్రీడాగజప్రేక్షణీయంగా కనిపించినవి. నల్లగా బండరాళ్ళలా, కారు ఎనుముల్లా ఉన్న ఆ మేఘాలు అస్తమిస్తున్న సూర్యుడిని దాచ ప్రయత్నిస్తున్నాయి. సూర్యనారాయణుడు ఆల్లరిపిల్లవాడిలా ఆడుగునుంచే చేతులు చాపుతున్నాడు. దివ్యకాంతులు విరజిమ్మే ఘనశ్యామసుందరుడు ఇలాగే ప్రకాశించేడు కాబోలు. అంత ఎత్తుకు ఎగరలేని రాధ కిందనించి దిగులుగా "నీలీలలకి అమాయికనైన నేనే దొరికేనా?" అన్నట్టు చూస్తుంది కాబోలు ...

నాకూ ఆ మేఘమాలకీ మధ్య వచ్చి నిలచిన రాధ - ఎదురుగా డాబామీద - మెల్లిగా కదిలి నేపథ్యంలోకి మాయమైంది. ఆ నడక తీరు జంకొదవెడి కాళ్ళతోడ మెల్లిగా మెట్లు దిగుతున్న రాచపిల్ల పోలికనుంది.

నాకు తెలిసినంతమటుకు ఆ యింట్లో ఒకే వృద్ధవనిత ఉంది. ఆ యింటికి ఆమే యజమానురాలు. ఆ యిల్లు మాయింటినానుకుని వెనక వేపుంది. మూడు తరాలకి ముందు ఆ యింటికీ ఈయింటికీ ఒక్కడే యజమాని అనడానికి సాక్ష్యం రెండు డాబాల్నీ వేరు చేస్తూ నిలచిన మూడడుగుల పిట్టగోడ. రాజమార్గాన సింహద్వారం చేరాలంటే ఓ వందగజాలు నడిచి రెండు మలుపులు తిరగాలి.

రాత్రి భోజనాలదగ్గర అమ్మతో అన్నాను ఆ వెనకయింట్లోకి ఎవరో వచ్చినట్టున్నారే అని.

"ఆ ముసలావిడకి మనవడో ఏదో అవుతాట్ట. మొన్న పదో తారీకున పెళ్లయిందిట. పిల్ల కుందనపుబొమ్మలా ఉంది. ఆ కళ్ళు అలా తిప్పిందంటే ఈ చివరకొస్తూ. ఏం లాభం? ఏదో జబ్బుట. మాటాడదు. అన్నం తినదు. గజ్జలగుర్రంలా దాట్లేసే పిల్ల జీవచ్ఛవంలా తయారయిందని ఆవిడ గోలెత్తుతోంది,." ఔచితికి తగిన అంగన్యాసకరన్యాసాలతో అమ్మ

వివరిస్తుంటే ఇంత భోగట్టా ఎలా సేకరించిందన్న ఆశ్చర్యం కన్నా పెళ్ళయి వారంరోజులయినా పెదిమ కదపని ఆ ముద్దరాలి ప్రవర్తన ఎక్కువ ఆశ్చర్యపరచింది నన్ను.

"మూగపిల్లేమో," అన్నాను.

"సరేలే."

తలెత్తి అమ్మవేపు చూశాను ఎందుకు కాకూడదూ అన్నట్టు.

"పెళ్ళిచూపులనాడు అష్టపది పాడిందిట. ఆ పాటకే మురిసిపోయి చేసుకున్నారుట,"

"ఏం పాట బాబూ అదీ?" అన్నాను నవ్వుతూ.

"ధీరసమీరే."

తృళ్ళిపడ్డాను ఆ పాట అంత మనోరంజకంగా పాడగల మనిషిని నాకు తెలుసు. నేను గుంటూరులో థర్డుఫారం చదువుతున్న రోజుల్లో నాతోపాటు స్కూలికి నడిచివచ్చే వకుళ. తన పాట విని పెళ్ళి చేసుకోడం ఓ ఉద్ధరింపు కాదు. తన పాటకి పాములే ఆడతాయి. స్కూల్లో ఖడ్గ తిక్కన నాటకంలో వకుళ వార్తాహరుడుగా ఒక నిముషంపాటు స్టేజిమీద కనిపించి తన కంఠమాధురితో ప్రేక్షకులహృదయాల్లో చిరస్థాయిగా నిలిచిపోయిన వకుళ. తిక్కన మరణించేడని చెప్పడానికి వచ్చి చానమ్మ వీరపత్నిగా ఆచంద్రతారార్కం కీర్తింపబడుతుందని చెప్పే ఘట్టం. వకుళ పద్యం చదువుతుంటే స్థాణువులయిపోయిన ప్రేక్షకులు వన్స్ మోర్ అంటు కేకలేస్తే చానమ్మకి అయ్యో అని వాపోడానికి అవకాశమే దొరకలేదు. నేను సాయంత్రం డాబామీద చూసింది ఆ వకుళనన్నమాట.

మాఊళ్ళో శలవులకి తోచదని ఇక్కడికొచ్చి ఇక్కడ కాలక్షేపంకోసం కొట్టుకుపోతున్న నాకు నచ్చిన స్నేహితురాలు దొరికిందని సంతోషించేను. కానీ అంతలోనే జ్ఞాపకం వచ్చింది - మతే పోయిందో, మనసే పోయిందో, రోగమో, నొప్పో ఏదీ తెలీదు. కన్న తల్లిదండ్రులతోనూ కట్టుకున్న భర్తతోనూ మాటాడని వకుళ నాతోమటుకు మాటాడుతుందా? వాళ్ళకంటే నేను ఎక్కువా? ఆందులోనూ మా చుట్టరికం ఏనాటి మాట!!

ఆఖరికి అమ్మమీద విసుక్కున్నాను, "మాటాడ్డనికి కాదు సరికదా దెబ్బలాడ్డానికేనా ఎవరూ లేని అడవి. నేను రానంటుంటే తీసుకొచ్చేవిక్కడికి," అని.

వకుళ పగలల్లా ఎక్కడా కనిపించలేదు. కానీ సాయంత్రం సరిగ్గా నిన్నటివేళకి డాబామీదకి వచ్చింది. ఆకాశం ముసురేసి ఉంది.

చినుకు పడితే తగలబడిపోతుందని డాబామీద ఎండబెట్టిన ఆవకాయ ఎత్తిపెట్టడానికి వచ్చింది అమ్మ. నేనూ సాయం చెయ్యడానికి అటు వెళ్ళేను.

వకుళని పిలుద్దాం అనుకుంటుంటే ఒకతను వచ్చేడు వాళ్ళడాబామీదికి. పొట్టిగా నల్లగా ఉన్నాడు. "అమ్మా వాళ్ళూ ఎవరూ లేరు. నేనలా బయటికెళ్తున్నాను," అన్నాడు వకుళతో.

వకుళ అలవోకగా అతనివేపు చూసి మొహం తిప్పుకుంది.

"ఏం?" అన్నాడతను మళ్ళీ.

వకుళ ఈమారు ఆ మాత్రం చూడను కూడా లేదు.

"ఛీ ఏం మనిషి. అత్తకి చూపుచేటూ కోడలికి మోపుచేటూ," అతను గొణుక్కుంటూ వెళ్ళిపోయేడు.

సరసుడే అనుకున్నాను.

వకుళకీ నాకూ చిత్రమైన స్నేహం ఉండేది. మేమిద్దరం కలిసి ఆడుకున్నవాళ్ళం కాదు. ఒక కంచంలో తిని ఒక మంచంలో పడుకున్నవాళ్ళమూ కాదు. కాని వకుళ దేనికైనా బాధ పడితే నాదగ్గరకొచ్చి కూచునేది. మాయిద్దరిమధ్యా మాటలూ, సమస్యలూ, సమాధానాలూ లేకపోయినా మాకేమీ వెలితి ఉండేది కాదు. ఎదటి మనిషి కాల్లో ముల్లు విరిగితే తన గుండెల్లో గునపాలు గుచ్చుకున్నట్టు విలవిల్లాడే వకుళ "ఛీ" అనిపించుకుంటూ బతుకు సాగించుకుంటోందంటే ఏదో జరిగి ఉండాలి. కానీ అది ఏమిటి? కడుపులో బాధ కన్నతల్లికే చెప్పుకోని వకుళ నాకు చెప్తుందన్న భ్రమ నాకు లేదు. కానీ ఒకటో రెండో కథలు కల్పించి రాసిన నాకు వకుళ మౌనకారణం మాత్రం క్లూ దొరకని పజిల్లా ఉండిపోయింది. ఆ రాత్రంతా ఆలోచించినా తెగలేదు.

మర్నాడు పొద్దున్న అమ్మ మళ్ళీ డాబామీదికి రావడంతో నేనూ స్నానం చేసి వచ్చేను. వకుళ బట్టలారేస్తోంది వాళ్ళడాబామీద. తెగించి పిలిచేను. వకుళ ఉలిక్కిపడి నావేపు చూసి వెళ్ళిపోయింది.

"ఏం? నువ్వు దిగి వచ్చేననుకుంటున్నావేమిటి?" అంది అమ్మ, వకుళ నాకు సమాధానం చెప్పలేదని.

"ఏం జబ్బో?" అన్నాను సాలోచనగా.

"జబ్బేమిటి తెగులు," అంది అమ్మ.

నేను తెల్లబోయేను.

నిన్న గాక మొన్న తనస్థితికి జాలిపడిన అమ్మ ఇవాళ ఇంత కఠినంగా మాటాడ్డానికి వకుళ చేసిన నేరం ఏమిటో?

అమ్మదగ్గర్నుంచి రాబట్టగలిగిన కథ ఇదీ - ముందురోజు సాయంత్రం వకుళ అత్తగారు ఓ వొరుగువెలుగుతో పచ్చీసు ఆడుతుండగా, ఆమెభర్త నరహరి వీధిలోకి వెళ్ళిపోయేడు వకుళతో చెప్పి. అది నిజం అనడానికి నేనే సాక్ష్యం. అలా అతను ఆ చల్లని సాయంవేళ షికారుకెళ్ళిన సందర్భం ఆసరా చేసుకుని దారిన పోతున్న ఒక సీజరు సావిట్లో ఉన్న రేడియో, ఆ పక్కనే కుర్చీమీద నీటుగా ఇస్త్రీ చేసి పెట్టిన పట్టుచీరా పట్టుకుపోయేడు.

మండువాలో మంచంమీద కూర్చునిఉన్న వకుళ అతను ఇంటిలో ప్రవేశించిన క్షణంనించీ చూస్తూనే ఉందిట పరమానందయ్య శిష్యులకైనా సిగ్గు తెప్పించగల నిశ్చలతతో.

"చిత్రంగానే ఉంది," అన్నాను నవ్వుతూ.

"నీకు నవ్వుగా ఉందేం? నూటయాభై రూపాయల ఆరణి చీర," అంది అమ్మ ఆ చీరె తనదే అయినట్టు.

చీరె స్వంతదారే చీర పోతున్న దారి చూస్తూ ఊరుకుంటే నాకెందుకు నొప్పి? పడేవాళ్ళు పడితే నవ్వగలిగినవాళ్ళు నవ్వరాదంటుంది అమ్మ. ఆ పరిస్థితుల్లో ఆ చీరే నాదే అయినా నవ్వి ఉండేదాన్ని.

"కాఫీరంగు ఆరెంజి అంచు ... ఎలా అంటే అలా ఉండేదిట," అంది అమ్మే మళ్ళీ.

గతుక్కుమన్నాను.

"పెళ్ళిచీరెలన్నీ కొనడం అయిపోయినతరవాత వకుళ ఆ చీరె చూసి పట్టు బట్టి కొనిపించిందిట."

ఆడవాళ్ళకి చీరెలమీద ఉండే మోజు కట్టుకున్న మొగాడిమీద ఉండకపోవడంవల్లే సంసారాల్లో కలతలు వస్తాయని ఒక ప్రాజ్ఞుడి అభిప్రాయం. వకుళ కోరి కొనిపించుకున్న పట్టుచీర చేజేతులా పారేసుకుందంటే ఈమారు నాకు నవ్వు రాలేదు. తనకి ఆరెంజి రంగు అంచుమీదున్న ప్రేమ నాకు తెలియనిది కాదు.

రోజూ సాయంత్రం అదేవేళకి వాళ్ళ డాబామీద తనూ మా డాబామీద నేనూ చేరేవాళ్ళం. మూడు రోజులు పోయేక కాబోలు నావేపు చూసింది. ఆ చూపులో గుర్తించేనన్నట్టు అనిపిస్తే నేను చిన్న చిరునవ్వు నవ్వేను. వకుళ గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయింది.

నేను కిందకొచ్చి మంచం వాల్చుకుని పడుకున్నాను. ... చిన్న కునుకు తీశాను కాబోలు కళ్ళు తెరిచేవేళకి గదిలో ఎవరివో మాటలు వినిపిస్తున్నాయి. గొంతు పరిచయమైయినట్టే ఉంది. ఆవిడ వకుళ వాళ్లమ్మ.

నన్ను చూడగానే, "కల్యాణి కదూ! ఎంత పెద్దదానివయేవూ," అంది.

చీరసంగతి తెలిసి ఆవిడ వచ్చిందిట. ఆవిడకీ అర్థం కావడంలేదు వకుళధోరణి.

రోజుకొక డాక్టరుకి చూపిస్తున్నారు. ఎక్స్‌రేలు తీయిస్తున్నారు. స్పెషలిస్టులని కలుసుకున్నారు. అసలు పేషంటే తన బాధేమిటో చెప్పకపోతే డాక్టరేం చేస్తాడు? దేవుడే "నీకేం కావాల"ని అడిగి కానీ వరం ఇవ్వలేడు.

పిచ్చాసుపత్రికి తీసుకెళ్లేరు ఇదేదైనా పిచ్చి సంబంధమేమోనని. రెండు రోజులు అక్కడ ఉంచమన్నారుట. సరేనని నరహరి స్పెషల్ వార్డులో ఒక గది తీసుకుని అక్కడ ఉంచేడు. వకుళ మాటాడలేదు. మాటాడకపోవడంతప్ప ఆమెలో మరే లోపమూ లేదు. అన్ని రకాల టెస్టులూ అయేక, "ఆ పిల్లకేం పిచ్చి? అలా అన్నవాళ్ళకి పిచ్చి. ఆ అమ్మాయి జబ్బు మనోవ్యాధి. ఆ పిల్లకేం కావాలో కనుక్కోండి," అన్నాడు ఆ పిచ్చిడాక్టరు.

"మీకు పిచ్చిలా ఉంది. దానికి నిజంగా ఒట్టి మనోవ్యాధే అయితే మేం తీసుకెళ్ళిన డాక్టర్లందరిదగ్గరికీ ఎందుకు వస్తుందీ?" అంది వకుళతల్లి వరలక్ష్మమ్మ.

డాక్టరు నవ్వి, "నేను రాసిస్తానమ్మా ఆ అమ్మాయికే విధమైన జబ్బూ లేదని. మీరు ఇంగ్లండు తీసికెళ్ళినా అంతే. బహుశా ఈ పెళ్ళి ఇష్టం లేదేమో," అన్నాడు.

వరలక్ష్మమ్మగారు పిల్లని తీసుకొచ్చేశారు.

పెళ్ళి నిశ్చయం అయినప్పుడు వకుళ బొత్తిగా డాన్సు చెయ్యలేదు కానీ మరెలాటి కళలూ చూపలేదు ఇష్టం లేదనుకోడానికి. పల్లెపట్టున నాయనమ్మహయాంలో పెరిగినందున ప్రేమా గీమా అంటూ చెలరేగే అవకాశం లేదు. అట్టి సంగతి వకుళ ఎరగనిది. పైగా ఈ మూగనోము పట్టింది పెళ్ళయిన నాలుగోరోజున!

ఇంట్లో వంటపని ముసలావిడ చూసుకున్నా పైపనంతా చూసుకునేది వకుళే. చేసినపని చేతగానట్టు గానీ అయిష్టంగా చేసినట్టు గానీ ఉండేది కాదు. ఆఖరికి నరహరి "నీకేం కావాలో చెప్పు, నేను సాధించుకొస్తాను," అన్నాడుట. ఆపదమొక్కులవాడికి మొక్కుకున్నారు నిలువుదోపిడీ ఇస్తామని. నరహరి సైకాలజిస్టుదగ్గరికి తీసుకెళ్ళేడు. ఆయన సవాలక్ష ప్రశ్నలు వేశారు - ఆ అమ్మాయి పెరిగిన వాతావరణం ఎలాటిది? తల్లిదండ్రులు ఎలాటివారు? అమ్మాయి అభిరుచులేమిటి?

నరహరి తనకి తోచిన సమాధానాలు చెప్పేడు. అవేమంత సంతృప్తికరంగా లేవు. రోజు సూర్యాస్తమానం చూస్తూంటుందని చెప్పేడట. తనని ఆ సమయంలో చూస్తానన్నాడట ఆ సైకాలజిస్టు.

అవేళ సాయంకాలం పిట్టగోడకి ఇటు నేనూ అటు వకుళా నిలుచుని ఉండగా వచ్చేరాయన. నేను బాగుండదేమోనని వెనుదిరగబోయేను. వకుళ చప్పున నా చేయి పుచ్చుకుని ఆపింది. తనభావం గ్రహించుకుని నేను నిలబడిపోయేను అక్కడే. ఆ డాక్టరుగారు వేసే వెయ్యిన్నొక్క ప్రశ్నలకి జవాబు చెప్పలేకో, చెప్పే ఆలోచన లేకో, లేదా తనకి మిగిలిన ఆ ఒక్క ఘడియ ఆనందాన్ని తనకి కాకుండా చేయనుంకించిన ఆ మానవుణ్ణి పొమ్మని చెప్పమనో ...

"ఇవాళ ఆకాశం బాగులేదు," అన్నారాయన.

వకుళ ఒక్క క్షణం ఆయనవేపు చూసి డాబా పిట్టగోడ దూకి మాఇంట్లోకి వచ్చేసింది! మరుక్షణంలో ఆక్కడ ఎదురెదురుగా నిలబడింది నేనూ, వకుళమనోభావాల్ని కనిపెట్టడానికొచ్చిన సైకాలజిస్టూను!

“ఆ అమ్మాయిని మీకెంతకాలంనుంచీ తెలుసు?” అని ప్రశ్నించేరాయన నన్నుద్దేశించి.

“నాకెంతకాలంనుండీ తెలీదు. నేను ఫోర్తుఫారం చదివేరోజుల్లో తను థర్డుఫారం చదువుతూండేది,” అన్నాను.

వకుళగురించి నాకు తెలిసింది చెప్పమని అడిగేరు. వెనక్కి తిరిగి చూసేను. వకుళ నాగదిలో మంచంమీద వెల్లకిలా పడుకుని రెండు చేతులతో కళ్ళు మూసుకుంది.

“మీరు సైకాలజిస్టు కనక, అడిగేరు కనక నాకు తెలిసింది చెబుతున్నాను. ఇది కేవలం నా ఊహే కావచ్చు కూడా. నాకు తెలిసినంతవరకూ వకుళ పువ్వులాటి మనిషి. పసిపాపవంటి అమాయకురాలు. పుస్తకాల్లో ఎత్తి చూపే మోసమూ, దగా, స్పర్ధలూ, అసూయలూ పుస్తకాల్లోనే తప్ప నిజంగా ఉండవని నమ్మిన ముగ్ధ. తనని చూస్తే నాకు ఎప్పుడో ఎక్కడో చదివిన వాక్యాలు గుర్తొస్తాయి. బహుశా మీరూ చదివే ఉండొచ్చు. ఒక ఆడదానికి మతి భ్రమించిందంటే ఒక మహా కవయిత్రి మనకి దక్కకుండా పోయినట్టు అని. ఒక అడవిమనిషి మూలికలు ఏరుకుంటూ తిరుగుతోందంటే ఒక ధీశాలిని మేధస్సు వృథా అయిపోయినట్టని.[1] వకుళని చూస్తుంటే నాకదే జ్ఞాపకం వస్తుంది,” అన్నాను.

“అది నిజమే కావచ్చు. కానీ ఆ అమ్మాయిలో మార్పు తెచ్చిన సంఘటన ఏమిటో కనుక్కోండి ప్రయత్నించి. ఒక మనిషి షాక్ తినడం ఎంత సహజమో దానినుండి తేరుకోడం కూడా అంతే సహజం. కారణం తెలిస్తే మనం దానికి ప్రతి ఆలోచించివచ్చు.”

ఆయన వెళ్ళిపోయినా నాకు వకుళదగ్గరికి వెళ్ళే సాహసం లేకపోయింది. తనకి ఇష్టమయిన ఆ సాయంశోభని తిలకిస్తూ నిలబడిన నాకు తను వచ్చి నావెనకే నిలబడినట్టు తెలీసేలేదు. తనమొహం చూసి దొంగతనం చేసినట్టు ఫీలయేను. వాళ్ళమ్మని చూస్తే జాలేసింది నాకు. “అర్థాయుష్కుడయిన కొడుకా, ఐదవతనం లేని కూతురా?” అన్నట్టు నలభయ్యోపడిలో పడ్డాక కలిగిన ఒక్కగానొక్క కూతురిబతుకూ ఇలా తెల్లార్తూంది. నిజంగా

---

[1] A Room of One’s Own లో వర్జీనియా వుల్ఫ్ వెలిబుచ్చిన అభిప్రాయం ఇది.

వకుళకి ఈ కాపురం ఇష్టం లేకపోతే తమఊరు తీసుకపోడానికి సిద్ధం అవుతోంది ఆవిడ. తల్లిప్రాణం!

వకుళ ఎంతో విశ్వాసంతో నాపక్కన నిలబడడం గుర్తొచ్చింది. ఎలా ప్రశ్నించను నీ మిస్టరీ ఏమిటని? అది పైవాళ్ళకి ఎలా చెప్పను? చరిత్రలో విభీషణుడిదగ్గర్నుంచీ దేశదేశాలా మున్నూరు కాలాలా ప్రసిద్ధికెక్కిన పేర్లన్నీ కళ్ళముందు మెదిలేయి. నా ద్రోహానికి శిక్ష ఉండదు. కానీ వకుళ మామూలు మనిషయితే ఎంతమందికి పరమానందం కాదు? నాకు మటుకు అది సమ్మతం కాదూ?

000

మర్నాడు పొద్దున్న కాఫీ తాగి, ‘‘నేను వాళ్ళింటికి వెళ్తున్నా,’’ అన్నాను అమ్మతో.

‘‘వెళ్ళక్కర్లేదు,’’ అంది అమ్మ. తరవాత తెలిసింది దెయ్యం పట్టిందేమో అన్నార్ట ఎవరో.

భూతవైద్యుణ్ణి పిలిపించేరు. వాడు వకుళని నఖశిఖపర్యంతం నాలుగుమార్లు చూశాడు. చుట్టూ ప్రదక్షణం చేసేడు. ‘‘మూగదయ్యం,’’ అన్నాడు. ఐదువందల రూపాయాలు కుప్ప పోయించేడు. దానిమీద చక్రం గీసేడు. నాలుగు కూతలు కూసేడు. ‘‘పలుకు,’’ అన్నాడు. వకుళ పలకలేదు. వేపమండలతో బాదేడు. పసుపూ, కుంకుమా, బూడిదా ఇల్లల్లా జల్లేడు. ‘‘అమ్మా అను,’’ అన్నాడు. వకుళ అనలేదు. వాడు వెళ్ళిపోయేక వకుళచేతిమీద మణికట్టునుండీ మధ్యవేలివరకూ జెర్రిపోతులాంటి ఎర్రనిగీత కనిపించడంతో ఎవరికీ నోట మాట రాలేదు. నిజంగా ఆ పిల్లకి ఏం జబ్బుందో, దానివల్ల ఏం బాధ అనుభవిస్తోందో తెలీదు కానీ ట్రీట్మెంటు పేరున ఆ పిల్లని వీళ్ళు నానా హింసా పెడుతున్నారు.

‘‘ఎందుకొచ్చిన మందులండీ ఇవన్నీ. అసలు జబ్బుకన్నా వీటిబాధే ఎక్కువగా ఉన్నట్టుంది. కొన్నాళ్ళపాటు ఊరుకోండి. అవే సర్దుకుంటాయి,’’ అన్నాను.

‘‘మేమూ అదే అనుకుంటున్నాం. పైగా నిన్న అతడు కూడా మాయ చేసి పశువుని అంటగట్టేంవని విసుర్లు విసిరేడు. మాణిక్యంలాటి పిల్ల ఇలా అయిపోయిందని మేం ఏడుస్తుంటే ఈ పోటుమాటలు. ఏదయితే అదే అవుతుంది. దాన్ని తీసుకుపోతాం. బాగుంటేనే పంపిస్తాం,’’ అందావిడ.

వకుళ పరిసరాల్లో జరుగుతున్నవేవీ పట్టించుకోకపోతే, గ్రహించుకోకపోతే తనంత అదృష్టవంతురాలు మరొకరు ఉండరు అనిపించింది నాకు.

ఆ సాయంత్రం వకుళని చూడ్డానికి వెళ్ళేను మర్నాడు ఉదయం వెళ్ళిపోతుందని. నేను ఇంట్లో ప్రవేశించగానే నావెనకే నరహరి వచ్చేడు.

"మీరు తీసికెళ్ళి ఆ పల్లెటూళ్లో ఏం చేస్తారు? నాతోనే పంపించండి. నాస్నేహితుడు ఒకడున్నాడు స్పెషలిస్టు. చూపిస్తాను," అన్నాడు.

నోరూ వాయీ లేని లేగదూడవంటి అమాయకురాలిని తొమ్మిదివందలదూరం తోలమంటున్నాడు. వరలక్ష్మమ్మగారు విచిత్రంగా చూసేరు అతడివైపు.

"అవును. నాతోనే తీసుకెళ్ళి నేనే ట్రీట్మెంటిప్పిస్తాను."

అంతవరకూ అక్కడ తనని కాదన్నట్టు నిర్వికారంగా కూచుని ఉన్న వకుళ భర్తవేపు దృక్కులు సారించింది. అది తపోనిష్ఠుడయిన ఫాలాక్షుడు మూడోకన్ను విప్పి మన్మధుడిని చూసిన చూపు. యుగయుగాలగా మగవాడి అన్యాయానికి వినయంతో తలవంచిన స్త్రీత్వం మేలుకొని చూసిన చూపు. గగనంలో విహరిస్తున్న గరుత్మంతుని శివుని కంఠహారమైన కోడెత్రాచు చూసే చూపు. అ చూపులో శ్లేష లేదు.

నరహరి తల వంచుకుని వెళ్ళిపోయేడు.

ఆ రాత్రి గాలి లేదని డాబామీద మంచం వేసుకుని పడుకున్నాను. వకుళనిగూర్చిన ఆలోచనలు నిద్ర పోనీయలేదు. వకుళకి ఈ పెళ్ళి ఇష్టం లేదనడంలో సందేహం లేదు. యుగధర్మానికి ఎదురు చెబుతున్నట్టనిపించింది. అతడు నవమన్మధుడు కాకపోవచ్చు. తల్లిదండ్రులు మెడలు విరిచి చేసింది మాత్రం కాదు. తను మొదటే ఎందుకు చెప్పలేదు? ....

ఎప్పుడు నిద్ర పట్టిందో తెలివొచ్చేసరికి గదిలో గడియారం రెండు కొట్టింది. మంచంమీద ఎవరో ఉన్నట్టనిపించి కళ్ళు తెరిచేను.

వకుళ!

నేను లేచి కూచున్నాను. పున్నమిచంద్రుడు పిల్లజమీందారులా వెన్నెలలు వెదజల్లుతున్నాడు. వెన్నెట్లో తన కళ్ళు నీటిలో చేపల్లా మెరుస్తున్నాయి.

నాకు ఏదో మాటాడాలనుంది. తనకి ధైర్యం చెప్పాలనుంది. కానా ఆ స్తబ్ధనిశీధిలో - జడభరతునిలా వకుళ - ప్రకృతిలో ఓ భాగంగా కనిపించింది. నేను తనకి ఏం చెప్పగలను? దేవతలకి పంచాంగం చెప్పగలదానిని కాను నేను.

‘‘కల్యాణీ’’

‘‘వకుళా!’’

వకుళ మాటాడుతోంది! వంద ప్రశ్నలు నాలో చెలరేగేయి. ఏది ముందు? ఏది వెనక? ...

వకుళ నిశ్శబ్దంగా నాచేతిని తనచేతిలోకి తీసుకుంది.

‘‘కల్యాణీ, అతను తృతీయాప్రకృతివాడు.’’

నిస్సహాయంగా వకుళ ఆడినమాట నాకు వికృతంగా ధ్వనించింది ఆ చీకట్లో.

తను ఇంక చెప్పవలసింది ఏమీ లేదు. తననిగురించిన మిస్టరీ ఏమీ లేదు.

మంచుదెబ్బ తిన్న తమ్మిపువ్వు మళ్ళీ మొహం ఎత్తదు. నలిపి పారేసిన గులాబీపువ్వు మళ్ళీ నవనవలాడదు.

వకుళ వెళ్ళిపోవడం నాకు తెలీదు. మళ్ళీ నాకు తెలివొచ్చేసరికి రేడియోలో ఇంగ్లీషులో వార్తలు వస్తున్నాయి. భరణిపుల్ల తీసుకుని పెరట్లోకి వెళ్తున్న నన్ను చూసి అమ్మ ‘‘వకుళ,’’ అంది.

‘‘అవును,’’ అనబోయి, అమ్మమొహం చూసి ఆగిపోయేను.

వకుళ చచ్చిపోయింది.

అరుగుమీద శవంచుట్టూ చేరి అందరూ ఏడుస్తున్నారు. నాకు తెలీకుండానే ఒక నిట్టూర్పు వెలువడింది.

వకుళ సుఖపడింది.

వరలక్ష్మమ్మగారు తల్చుకు తల్చుకు కుమిలిపోతున్నారు. వాళ్ళ నాయనమ్మ ముందుగా చెప్పి పోయిందిట. అలాగే ఈ పిల్లకి కూడా తనచావుగురించి ముందే తెలుసేమోనని ఆవిడబాధ.

రాత్రి హఠాత్తుగా కడుపునొప్పి వచ్చి చుట్టుకుపోవడం మొదలుపెట్టిందిట. ఆస్పత్రికి తీసుకెళ్తుంటే సగం దారిలోనే ప్రాణం పోయిందిట.

చూడలేక వెనుదిరిగేను.

నరహరి గేటుదగ్గర నిలబడి కల్లబొల్లి ఏడుపులు ఏడుస్తున్నాడు. లాగి చెంప పెట్టు పెడదామనిపించింది.

000

వకుళజీవితం అలా ముగిసింది. కానీ నరహరి ఎందుకు పెళ్ళి చేసుకున్నాడు? అంత డబ్బు ఎందుకు ఖర్చు పెట్టేడు? అని నన్నడక్కండి. వట్టి పుణ్యానికి అబద్ధాలు చెప్పేవాళ్ళూ, వృథాన్యార్థభంగము గావించెడువారూ, రెండు రూపాయలు ధర్మం చేసి మూడు తరాలపేర్లు చెక్కించుకునేవాళ్లూ - వాళ్ళెవరైనా చెప్పగలరేమో సమాధానం.

000

(1964-65 ప్రాంతాల్లో తొలిసారిగా ''రచన'' మాసపత్రికలో ప్రచురితం. తరవాత 1969లో ''ప్రగతి'' వారపత్రికలో పునర్ముద్రితం.)

# 16. ఉద్దేశాలు మంచివే!

ఆంధ్రదేశంలో ఒక జిల్లా ముఖ్యపట్టణంలో బస్‌స్టాండునించి కాలేజీకి వెళ్లేదారిలో సూర్యచంద్రలారీ సర్వీస్ షెడ్ వుంది. సామాన్యంగా బస్టాండుకీ కాలేజీకీ మధ్య పయనించే ప్రజలు ఎంత తొందర పనిలో వున్నా ఎంత పరధ్యానంతో నడుస్తున్నా ఆ సూర్యచంద్రలారీ సర్వీసుదగ్గరికి వచ్చేసరికి ఓమారు ఉలిక్కిపడి చుట్టూ చూసి ముందుకి సాగుతారు. దానికి కారణం లేకపోలేదు.

మీదనించి లారీ వెళ్లినా దులుపుకు వెళ్లిపోయే absent-minded ప్రొఫెసరునైనా నిలవేయగల ఒక చిత్రమైన ధ్వని అక్కడ సంధ్యవేళల్లో వినిపిస్తూ ఉంటుంది. ఇదీ అని స్పష్టంగా చెప్పలేం కానీ డోలూ, సన్నాయీ, బాంజో, మాండలిన్, గిటార్, పియానో ఒక్కమారుగా మోగిస్తే వచ్చే ధ్వనిని పోలివుంటుంది అది. రాక్షసులు వసంతోత్సవాలలో ఓలలాడుతున్నారో, దేవతలు సమరోత్సాహంలో తేలియాడుతున్నారో అని పథికులని అక్కజపరిచే ఆ నాదం (ఆర్తనాదం కాదు) పుట్టుపూర్వోత్తరాలు అతి సామాన్యమయినవి.

మధ్యలో మొదలుపెట్టి వెనక్కి వెళ్లడం మోడర్న్ టెక్నిక్ కనక అసలు కథ ఇప్పుడు మొదలుపెడతాను. ఆవూళ్లో కాలేజీలో ఇంగ్లీషుడిపార్ట్‌మెంటులోనూ హిస్టరీ డిపార్ట్‌మెంటులోనూ ఒక్కమారే ఖాళీలు ఏర్పడడం చూసి, గవర్నమెంటువారు ఇంగ్లీషులోనూ, హిస్టరీలోనూ డిగ్రీలు కలిగిన ఓ నవదంపతులని ఆ వూరికి ట్రాన్స్‌ఫర్ చేశారు. ఆ అమ్మాయిపేరు లత. లతలాగే వుంటుంది కూడా. అతనిపేరు రావు. అతన్ని మాత్రం ఏవీరావు అనలేం. అతనికి చాలా వచ్చు. వాళ్లు వచ్చిన వారం పదిరోజుల్లోనే చాలా పాప్యులరు అయిపోయేరు. అంటే పొలిటికల్ ఆంగిలులో కాదు. మామూలుగా లత అన్నా, రావు అన్నా ‘‘పాపం, మంచివాళ్లు’’ అనుకునేవారు అందరూ.

మరోవారం అయినా అవకముందే, లత మంచి హుషారుగా ఇల్లంతా సర్దడం మొదలుపెట్టింది.

"ఎలాగైనా ఇల్లాలు కదా" అనుకున్నాడు రావు, హర్షప్రఫుల్లమానసంతో. లతని ఏడిపించాలని కూడా అనిపించిందతనికి.

"ఏం? నన్నింప్రెసు చెయ్యాలని చూస్తున్నావా?" అన్నాడు.

"ఉహుః. మిమ్మల్ని కాదు," అంది లత గంభీరంగా.

రావుకి అర్థం కాలేదు. "మరి?"

"స్వర్ణగారిని భోజనానికి పిలిచాను."

ఒక్క నిముషంపాటు రావుకి నోట మాట రాలేదు.

"అప్పుడే మీయిద్దరికీ అంత స్నేహం అయిపోయిందేమిటి?"

"ఎంతసేపు కావాలి?" అని లత స్వరం తగ్గించి, "చాలా మంచిమనిషండీ," అంది అతన్ని ఉడికిస్తున్నట్టు.

"అవునవును. అందులో ఈ రోజుల్లో మంచివాళ్లు చాలా అరుదు కూడాను," అన్నాడు రావు కించిత్ అప్రసన్నుడై. కొంచెంసేపూరుకుని, "అయితే చికెన్," అన్నాడు లతాభిముఖుడై.

"నో, నో," అంది లత విముఖురాలై, "ఆవిడ పరమ శాఖాహారి,"

"ఏం? ఈ రోజుల్లో వర్ణాంతరభోజనాలకి తప్పులేదే."

"వర్ణాలూ, కృతులూ కాదండీ ప్రశ్న. అందరిదీ ఏక నలుపే కదా," అంది లత విసుగ్గా. స్వర్ణ రంగు 'సువర్ణం' కాదు.

"పోనీ, ఏం చేస్తున్నావు?"

"వంకాయ కూర, పెరుగు వడలు, ములక్కాడ పులుసు."

నీరసంగా కుర్చీలో కూలబడ్డ రావువంక జాలిగా చూసింది లత. వంకాయా ఓ కూరేనా అని అతడిభావం.

"ఒక్కరోజుకే కదా, సర్దుకుపోవడం నేర్చుకోవాలి" అని లత మనవి.

"నీగురించే నాబాధంతా," అన్నాడు రావు.

‘‘అంటే?’’

‘‘అంటే భర్తని అర్ధాకలితో విస్తరిముందునించి లేపిన ఆడదానికి ఊర్ధ్వ లోకాలుండవంటారు పెద్దవాళ్లు.’’

‘‘ఛీ, అలాటి అవాచ్యాలు అనకండి.’’

రావు నోరు మూసుకుని రేడియో, పేపరు అదేవరసలో విప్పేడు. పాపం, ఆ రోజు రావుకి కంచంలో చెయ్యి నోటిదాకా వెళ్తే ఒట్టు.

‘‘ఏఁవండీ, ఒంట్లో బాగా లేదా? అలా వున్నారేం?’’ అంది స్వర్ణ వివర్ణమైన అతడిమొహం చూసి.

‘‘ఏంలేదండీ. ఏదో జ్ఞాపకం వచ్చింది. శ్రీనాథుడు గరళకంఠుడిని సవాలు చేశాట్ట విషం తాగేనని విర్ర వీగుతావు కానీ పలనాట బచ్చలిశాకం పులుసుతో జొన్నకూడు మింగు చూద్దాం అని.’’

లత తీక్షణంగా చూసింది రావువేపు.

రావు గబుక్కున మంచినీళ్ల గ్లాసు అందుకున్నాడు.

కష్టాలెప్పుడూ మంచివాళ్లకే వస్తాయిట. కష్టాలొచ్చాయంటే మంచివాళ్లయి ఉండాలిట.

లేకపోతే రావు ఇలా అభోజనం ఉండను కాక ఉండనని మొండిపట్టు పట్టి ఉండేవాడు.

లత ఇలా అవమానం పాలయి ఉండేదికాదు పతిదేవునిమూలంగా.

స్వర్ణ ఆహారవ్యవహారాలదగ్గిర తనతో పొసగనివాళ్లతో స్నేహం చేసివుండేది కాదు.

అన్నిటికీ వాళ్ల మంచితనమే కారణం.

సూక్ష్మంగా ఆ ముగ్గురూ ఆ సమయంలో ఆలోచిస్తున్నవాటి సారాంశం ఇదీ.

భోజనాలు అయేకా, అవకుండానూ, అందరూ హాల్లోకి వచ్చి కూర్చుని ఆకులు నములుతుండగా, ‘‘మీకు సంగీతం వచ్చునా?’’ అని లత స్వర్ణని అడిగింది.

‘‘రాదు. మరి మీకు వచ్చునా?’’

‘‘నాకూ రాదు.’’

అక్కడితో ఆ సంభాషణ అయిపోవలసిందే కానీ తెలుగునవలలా, తెలుగుసినిమాలా, అయిపోయినట్టే అయిపోయి మళ్లీ తలెత్తింది.

''నేర్చుకుందామా?'' అంది స్వర్ణ.

రావు బిక్కుబిక్కుమంటూ లతవేపు చూశాడు.

''తప్పకుండాను,'' అంది లత ఆనందోత్సాహాలు వదనంలో వెల్లివిరుస్తుండగా.

లతకి అతిథులని ఎలా ఆదరించాలో తెలుసు అనుకున్నాడు రావు స్వగతంలో.

నాలుగు రోజులు పోయేక, లత రావుతో, ''కాకివారివీధిలో వెంకటశాస్త్రిగారని ఒక సంగీతంమేష్టరు ఉన్నారుట. వెళ్లి తీసుకురండి,'' అంది.

''అదేమిటి?'' అన్నాడు రావు కొత్తగా చూస్తూ.

''తెలీనట్టు నటించకండి. మీముందే కదా స్వర్ణా నేనూ నేర్చుకుందాం అని నిశ్చయించుకున్నది,'' అంది లత.

''ఊరికే అన్నావనుకున్నాను,''

''కాదులెండి,'' అంది లత కొంచెం కఠినంగా.

రావు ''సరేలే'' అన్నాడు.

రాత్రి లత మళ్లీ ''కనుక్కున్నారా?'' అంటే లేదన్నాడు. మర్నాడూ అదే జవాబిచ్చాడు. మూడోరోజు కాస్త ధైర్యం తెచ్చుకుని, ''ఇప్పుడు సంగీతం నేర్చుకోకపోతే ఏం, లతా?'' అన్నాడు నెమ్మదిగా. అతనికి సంగీతం అంటే కోపం లేదు కానీ ఎమెచ్యూరులని సహించలేడు. శాస్త్రీయ కచేరీలు అర్థం కావు. అంచేత అతను వినగలిగిందల్లా రేడియోలో లలితసంగీతమూ, సినిమాల్లో శాస్త్రీయసంగీతమూను. పెళ్లిచూపులనాడే ''మీఅమ్మాయి పాడదు కదా, పాట నేర్చుకుంటానని పేచీ పెట్టదు కదా,'' అని అడగలేదే అని విచారించవలసిన రోజొచ్చింది అతని జీవితంలో ఆఖరికి.

లత క్షణం ఊరుకుని, ''సరేలెండి,'' అంది. కానీ అది నాలుక చివరినించి వచ్చింది.

మర్నాడు కాలేజీలో స్వర్ణ ''కనుక్కున్నారా?'' అని ప్రశ్నించింది లతని.

''లేదు, ఇవాళ కనుక్కుంటానన్నారు,'' అంది లత.

‘‘నేను వీణకి వ్రాశాను’’ అంది స్వర్ణ, ‘‘రెండురోజుల్లో జవాబు రావచ్చు.’’

లతకేం చెప్పాలో తోచలేదు.

స్వర్ణసరదా చూస్తుంటే లతకి హుషారొస్తోంది. అటు రావుతీరు చూస్తే నీరు గారిపోతోంది.

‘‘నిజంగా నాకేం కావాలో నాకే తెలీడంలేదు,’’ అంటూ తనలో తను గొణుక్కుంది.

ఆ రాత్రి మళ్లీ రావుదగ్గిర ‘‘ఆ విషయం’’ ఎత్తకుండా ఉండలేకపోయింది.

‘‘స్వర్ణగారు వీణమేకరుకి ఉత్తరం రాసేరుట’’ అంది.

రెండురోజులు పోయేక స్వర్ణకి జవాబు వచ్చింది అని మరో బులెటిన్ తెచ్చింది. మూడోరోజు బులెటిన్ - వీణమేకరు ఆదివారం ఉళ్లో దిగుతాడు వీణతో సహా.

ఆఖరికి రావు విసుగ్గా, ‘‘నువ్వు ఈ సంగీతం ఆపుతావా? నన్ను సన్యాసం పుచ్చుకోమన్నావా?’’ అన్నాడు.

లత భీతహరిణలోచనాలతో అతనివేపు చూడడం చూసి, ‘‘అది కాదు. నన్నేం చెయ్యమంటావు చెప్పు,’’ అన్నాడు మందరస్థాయిలోకి దిగి.

‘‘ఓహ్! మీరది ఒక ప్రొపొజలు అంటే ఆలోచించవచ్చు. మీరు గ్రహించారో లేదో కానీ సంగీతానికీ, సన్యాసానికీ కూడా పన్నెండేళ్లే సాధన నిర్ణయించేరు,’’ అంది లత కుదుటపడి.

‘‘ప్రభుత్వాన్ని పన్నెండేళ్లు శలవు అడగనా?’’ (హేళనగా)

‘‘ఇవ్వరు కాబోలు,’’ (దిగులుగా)

‘‘దానికేముంది? ఎక్స్పెషనలు అని చెప్పుకుందాం. ‘మాఆవిడ సంగీతం నేర్చుకుంటాను అంటోంది. ఆ కాలపరిమితిలో నేను సన్యాసాశ్రమం చవి చూడాలనుకుంటున్నాను’ అని రాస్తాను. ఇది spiritual study కనక, స్టడీ లీవు ఇచ్చినా ఇవ్వొచ్చు,’’ (మళ్లీ హేళనగా)

‘‘అయినా ఇవ్వం అంటే ...’’ (ఇంకా దిగులుగా)

‘‘అప్పుడేనా ఈ రికార్డు ఆపుతావా?’’ (కఠినంగా)

‘‘.. ... ..’’ (నిస్సహాయంగా)

ఇలాటి సంభాషణలు అవుతూండగానే, ఆదివారం వచ్చేసింది. దాంతోపాటు స్వర్ణ, స్వర్ణ వెనక వీణమేకరూ, ఆ మేకరుతో వీణా రావుగారింటికి వచ్చేశారు.

''బాగుందండీ?'' అంది స్వర్ణ.

''బాగానే ఉంది,''అన్నాడు రావు.

లతకి వీణ చూస్తున్నకొద్దీ ముచ్చటేసింది. సన్నని దంతపునగిషీతో మెరిసిపడిపోతోంది వీణ. మేళం చేసే తీసుకు వచ్చాడు ఆ మేకరు.

''ఇక్కడ ఉంచమన్నానండీ. మీరు సాయంత్రం ఆ వీణమేష్టరుని పిలిస్తే, ఆయనకి కూడా చూపించి డబ్బిచ్చేస్తానన్నాను,'' అంది స్వర్ణ.

''అలాగే చెప్తాలెండి,'' అన్నాడు రావు.

వాళ్లు వెళ్లిపోయేక, రావు లతవేపు తిరిగి, ''మీ చదువుకున్న ఆడవాళ్లతో గెలవడం కష్టం సుమా,'' అన్నాడు.

లత వీణవేపునించి దృష్టి మరల్చకుండానే, ''లేటుగా తెలుసుకున్నారు,'' అంది.

''ముందే తెలుసు.''

''మరెందుకు చేసుకున్నారు?''

''నేను మొదటే చెప్పేను మాఅమ్మతో, నాకు చదువుకున్నఅమ్మాయి వద్దూ, 'చాకలివాడొచ్చాడు పద్దు చూడండి' అని కాలేజీకి రాకుండా ఉంటే చాలూ అని. మాఅమ్మే 'ఈకాలపు చదువులలాగే వున్నాయీ, దానికైనా యమ్మే ఉండాలీ' అని నిన్ను తీసుకొచ్చింది,'' అన్నాడు రావు.

''మీదగ్గిరే కదండీ చదువుకున్నాను.'' రావు లతకి బి.యే.లో ఇంగ్లీషు చెప్పేడు. ఆ సంగతి ఆ సమయంలో అతను మర్చిపోవడం అతని దురదృష్టం.

రెండు నెలలు తిరక్కుండా రావు వీణ విశ్వనాథశాస్త్రిగారికి శాస్త్రోక్తంగా పంచెలచాపూ, తాంబూలాలూ, రెండువందలరూపాయలూ సమర్పించుకుని, లతచేత ''నావీణ'' అనిపించాడు. లత ఆనందం చూశాక, అతను కూడా ''నేనెంత దుర్మార్గుణ్ణి కాకపోతే ఆ పిల్లనంత క్షోభ పెడతాను,'' అనుకుని, తన్ను తాను వెన్ను చరుచుకున్నాడు చేసిన సత్కార్యానికి.

కానీ రోజూ సాయంత్రంవేళ వీణమేష్టరు వచ్చేవేళకి ఇంట్లో ఉండడం మటుకు అతనికి శక్తికి మించినపని అయింది. అదేకారణంగా అతను మార్నింగ్ వాక్ కూడా అలవాటు చేసుకున్నాడు.

"పోనీ, పాపం," అని లత కోపం తెచ్చుకోకుండా ఊరుకుంది.

రోజులు ఎప్పుడూ ఒక్కలాగే జరిగిపోతే కథలు ఎక్కడివక్కడే నిలిచిపోతాయి. కాకినాడ పాలిటెక్నిక్ కాలేజీలో లెక్చరరుగా వున్న సారథి కలకత్తానించి వస్తూ దారిలో చెల్లెలిని చూసిపోదాం అని దిగేడు.

అన్నగారిని చూసి చాలాసంతోషించింది లత. సారథి వస్తూ ఓ టేపురికార్డరు తెచ్చాడు.

"పెయ్యి, చూద్దాం" అంటే, "దానికి ఏవో చిన్న రిపేర్లు చెయ్యాలి, వీల్లేదు పొమ్మ"న్నాడు.

వారంరోజులు అందరూ సరదాగా గడిపేరు.

సారథి వెళ్లేరోజుకు ముందురోజు రావుతో, "బోలెడు గొప్పలు చెప్తావు కానీ రాక రాక వచ్చిన బావమరిదిని సన్మానించడానికి ఓపార్టీయేనా పెట్టేవు కావు," అన్నాడు.

"అయ్యో! అంతమాత్రానికే చిన్నబుచ్చుకోవాలా? మాటమాత్రం చెప్తే పార్టీలేం ఖర్మ డిన్నర్లూ, డ్యాన్సు ప్రోగ్రామూ అరేంజి చెయ్యకపోయానా? పోన్లే, రేపు నలుగుర్ని పిలిచి భోగిపళ్లు పోయిస్తానుండు," అన్నాడు రావు సారథిని ఓదారుస్తూ.

అన్నట్టుగానే రావు నలుగుర్ని పిలిచాడు. అందరూ కబుర్లు చెప్పుకుంటూ లత చెసిన స్పెషల్సు ఖర్చు చేస్తున్నారు. ఇంతలో పక్కగదిలోంచి ఉఫ్మని, గీమని శబ్దం వచ్చింది. "శ్రోతలారా! ఇప్పుడు మీరు వీధినాటకం వింటారు."

లత సారథివేపు తిరిగి, "ఏవో రిపేర్లు వున్నాయన్నావు?" అంది.

"అక్కర్లేదు కాబోలయితే," అన్నాడు సారథి నవ్వి.

" ... ... ఇప్పుడు లతారావుగారి కచేరి వింటారు," అని రావుగొంతు వినిపించింది.

"లతా రావు ఏమిటి? మీరు కూడా వాయిస్తారా?" (లత గొంతు)

"సరే, లతాదేవిగారు ఇప్పుడు జంటస్వరాలు వాయిస్తారు." (రావు)

“నేను కృతి వాయిస్తాను.” (లత)

“సరే లతాదేవిగారు ఇప్పుడు చలమేల చేసేవు అనే కృతి వాయిస్తారు.” (రావు)

“అది కృతి కాదు. వర్ణం.” (లత)

“అయ్యా! ఇంతసేపూ జరిగింది నాటకం. ఇప్పుడు శ్రీమతి లతాదేవిగారు వాయించేది వీణ.” (రావు)

ఒక్క క్షణం నిశ్శబ్దం.

“సా … పా …సా …”

“అదేమిటి?” (రావు)

“మామేష్టరు చెప్పేరు ముందు సాపాసా వాయించమని,” (లత)

“కానియ్.” (రావు)

కొన్నిక్షణాలు నిశ్శబ్దం.

మళ్ళీ టింగ్ … టింగ్ … టింగ్ … వినిస్తుంది కొంచెంసేపు.

“ఆపేశావేం?” (సారథి గొంతు)

“ఇప్పుడు వైలనిస్టు ఛాన్సు.” (లత)

“అదెక్కడ తేవడం? అనకాపల్లి నూకాలమ్మ జాతరలో మామేనల్లుడు కొన్న డప్పులబండి వాయిస్తాను కావలిస్తే.” (రావు)

“అన్నయ్యా! పకోడీలలో జీడిపప్పు వెయ్యనా , ఉల్లిపాయ వెయ్యనా?” (లత)

“దిట్టంగా పచ్చి మిర్చి తగిలించు జన్మలో మరిచిపోకుండా.” (రావు)

కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

“దేవునిఎదుట నాటిక వింటారు. కవికుమారుడి ఆత్మఘోష వినండి.” (రావు)

సారథిగొంతులో “నాయిష్టం. నాయిష్టమొచ్చినట్టు రాస్తా. నాకళ్లకేది కనిపిస్తే దానిమీద రాస్తా. ధనరాసులప్రక్క దారిద్ర్యం, సుజ్ఞానపుక్షేత్రంలోనే అజ్ఞానపు బ్రహ్మజెముడు డొంకలు, ఆ ప్రక్కనే నిరాశ, ఆనందం ప్రక్కనే ఆక్రందనం, అడుగడుగునా విఘ్నాలు, ఆశలకు అవాంతరాలు, ఆశయాలకు ఆనకట్టలు, ఆవేశాలమీద చన్నీళ్లు, ఆలోచనలకి బేడీలు,

ఆదర్శాలకి ఉరితాడు, ఉత్సాహానికి కంట్రోలు, ఉద్రేకాలకి రేషను, ఇహంలో నో వేకెన్సీ, పరంలో నో ఎడ్మిషన్, కళ్లకు కటకటాలు, కడుపులోకి కంకర, తలరాతలు వంకర ...

టింగ్ ... టింగ్ .. (వీణ)

"సరిమాపద సరిపద ... పదా ... పదపదా..." (రావు)

"ఎక్కడికోయ్?" (సారథి)

.... .... ....

లత వెళ్లి గుప్‌చిప్‌గా మెయిన్ స్విచ్ ఆఫ్ చేసి రావడంతో ఆ భాగోతం పరిసమాప్తమయింది.

అతిథులంతా వెళ్లిపోయేక, "నాకు తెలీకుండా నేను మాటాడినవన్నీ రికార్డు చేశారు కదూ," అంది లత పరిదీనవదనయై.

"ఆఁ. ఏమైందిప్పుడు?" అన్నారు ఇద్దరూ నవ్వి.

ఆ మాటకొస్తే లత వాయించిన వాయింపులు మధ్యలో చెరిపేసి, రావు వాయించేడని లతకి తెలీదు కనక అడగలేదు.

మర్నాడంతా లత ముభావంగా వుంది. దానికి కారణం ఆ సాయంత్రం లత రావుని "నిజంగా నా వాయింపు అంత ఘోరంగా ఉందాండీ?" అని అడిగేవరకూ తెలీలేదు.

రావుకి జాలేసింది. నిజం చెప్పేద్దాం అనుకున్నాడు. కాని నిజం చెప్తే తననుకున్న కార్యం సాఫల్యం కాదని జ్ఞాపకం వచ్చింది.

"అబ్బే, మరీ అంత ఇదిగా కాదనుకో. నువ్వింకా ఎమెచ్యూరువి కదా. అందుచేత ..."

అన్నాడు దేశవాళీ తటస్థ విధానాన్నవలంబిస్తూ.

"అవునవును. ప్రాక్టీసు చాలదు. ఇంకా బాగా ప్రాక్టీసు చెయ్యాలి," అంది లత.

పాపం! రావు అవాక్ అయిపోయినసంగతి లత గమనించనేలేదు.

ఆనాటినుండీ లత, స్వర్ణల ప్రాక్టీసు ద్విగుణీకృతోత్సాహంతో సాగుతోంది.

ఆనాటినుండీ ఆ రెండు వీణల కలకలలే ఆ రోడ్డున వినిపించే గరగరలు.

కావలిస్తే కాలేజీరోడ్డుమీద సాయంసమయంలో షికారుగా వెళ్లి చూడండి సూర్యచంద్ర లారీ సర్వీసు షెడ్స్ ఇప్పటికీ కనిపిస్తూనే వుంటాయి!!

000

(ఆంధ్రసచిత్రవార పత్రిక. జూన్ 19, 1964)

# 17. ప్రాప్తం

నూకాలికి ఉత్తరం వచ్చింది. అదెక్కడినించి వచ్చిందో దానికి తెలుసు. కానీ అందులో ఏముందో తెలుసుకోవాలి. మేడమీద అమ్మాయి ఒక్కతే ఉండే సమయం చూసుకుని నూకాలు చీపురు తీసుకుని అక్కడికి వెళ్లింది.

"నీకో వందమార్లు చెప్పేను అలా చీపురు పట్టుకుని నామీదకి దండెత్తొద్దని. నేను లేనప్పుడొచ్చి తుడిచి వెళ్లిపోలేవూ?" కసురుకుంది అమ్మాయి.

నూకాలికి అమ్మాయిగారి కసుర్లూ విసుర్లూ అలవాటే. అందుకే "పోన్లెండమ్మా! రేపనుంచి అనాగే మీర్లేనప్పుడే వొచ్చి తుడిసెల్పోతాను" అంది, కుర్చీ, బెంచీ, మంచం అటూ ఇటూ పనిమంతురాలయిన ఇల్లాలి ఒడుపుతో లాగేస్తూ.

"నీమొహం కాదూ. రోజు ఇలాగే అంటావు," అంది అమ్మాయి కోపంగా. "ఆ కుర్చీ ఇటెయ్యి. ఎక్కడివక్కడ ఉంచవు కదా."

అమ్మాయికి అందుకే కోపం. నూకాలు గది తుడవడానికొచ్చిందంటే, వెళ్లేవేళకి గది దక్షయజ్ఞవాటికలా చేసి పెడుతుంది.

"అమ్మాయిగోరూ," నూకాలు మొహం నిండుగా నవ్వుతూ, "ఇది కూసింత సదివి సెప్పరూ?" అంది కొంగుముడి విప్పుతూ.

"ఏమిటది?"

ఉసిరికాయంత కొంగుముడి జాగ్రత్తగా విప్పి, ఉండ చుట్టుకుపోయిన ఓ కార్డుముక్క అమ్మాయిచేతిలో పెట్టింది.

"అఘోరించినట్టే ఉంది. దీనికేపైనా అర్థఃవూ ఆకారఃవూ ఉంచేవా?" అందా అమ్మాయి ఆ ఉండ విప్పి సాపు చెయ్యడానికి ప్రయత్నిస్తూ.

నూకాలు నాలుక్కరుచుకుంది.

"తొమ్మిదోతారీకున సింహాద్రి వస్తున్నాడుట. రెండు రోజులుంటాడుట."

“తొమ్మిదా?” అంది నూకాలు ఆలోచిస్తూ.

“ఊఁ.”

“ఏవోరవయిందండీ?”

“సోంవారం.”

“సోంవోరఁవా?. ఇయాల సుక్కురోరం గందండీ. సుక్కురోరం, సనోరం, ఆదోరం, మూన్నాళ్లున్నయ్యన్నమాట” అంది నూకాలు బుగ్గన వేలుంచి లెక్కలేసుకుంటూ.

చెక్కిన రాతిబొమ్మలా ఉంటుంది అనుకుంది అమ్మాయి మనసులోనే దానివేపు చూస్తూ.

“రెండేళ్లయింది వాడు మిలిటరీలో చేరి. రెండేళ్లున్నదానివి మూడ్రోజులుండలేవుటే,” అంది నవ్వుతూ.

అమ్మాయిగోరు నవ్వితే బావుంటది, రాణీగారినాగుంటది, అనుకుంది నూకాలు మనసులోనే.

“ఎన్నగంట్లకొస్తడంటండీ?” అంది మాట మారుస్తూ.

“సాయంత్రం మెయిల్లో వస్తాట్ట. స్టేషనుకెళ్తావా?”

“ఎందుకండి? ఆడికేటి ఇల్లు తెల్దనా? నానెల్లకపోతే టేసినుదాంక వొచ్చినోడు ఇంటికి రాడనా?” అంది నూకాలు మొహం పక్కకి తిప్పుకుని ముసిముసి నవ్వులు నవ్వుతూ. అబ్బాయిగారు అదెక్కడ్నుంచో విమానంమీద వచ్చినప్పుడు అమ్మాయిగోరు స్నేయితురోల్లకి కాఫీలిప్పించటం, బొంబాయికెల్డం దానికెరికే.

అమ్మాయిక్కోపం వచ్చింది. “కబుర్లు కట్టిపెట్టి పని చేస్కో, ఫో,” అంటూ కసురుకుంది.

000

నూకాలు నిప్పులమీద నడుస్తున్నట్టు ఉరుకులు పరుగులతో ఇల్లు చేరింది. వీధికొసనించే అత్తా, అత్తా అంటూ కేకలేస్తూ.

ఎల్లమ్మ నులకమంచంమీద పడుకుని కునుకుతోంది. ఎల్లమ్మ పనికెళ్లదు. అది పెద్ద మేస్త్రీపెళ్లాం. మిలిట్రీలో ఉజ్జోగం కొడుక్కి. "నానెందుకు పనికెల్లాలా?" అంటుంది దర్జాలొలకబోస్తూ.

"అత్తా, నీకొడుకొస్తన్నడంట," అంది నూకాలు పొంగిపోతూ.

"నిజివే? ఒప్పుడె? ఒప్పుడొస్తన్నడు?" ముసిల్దాని ఆనందానికి హద్దుల్లేవు.

"సోంవోరం. సోంవోరంవంట. ఇంక మూడ్రోజులుంది."

ఎల్లమ్మ గబగబా లేచి అవతలికెళ్లింది ఎమర్జెన్సీ బులెటిన్‌లో ఈవార్త ప్రసారం చెయ్యడానికి.

నూకాలొక్కత్తే మిగిలిపోయింది ఆ చుట్టుగుడిసెలో.

"రెండేల్లమట్టీ నానొక్కదాన్నేగంద." అనుకుంది సాలోచనగా. సోంవోరం ఒస్తన్నడంట. అమ్మగారు పండుక్కిచ్చిన చిలకాకుపచ్చ కోకున్నాది. అమ్మాయిగోరు కుట్టు సరిగ లేదని యిచ్చేసిన ఎర్ర జాకట్టున్నాది. పచ్చకోక కట్టుకుని ఎర్రజాకట్టేసుకుంటే, "సిలకనాగున్నవే" అన్నాడోపాలి. ఆడిమనసుకి నచ్చినట్టు సెయ్యాల. రొండ్రోజులే ఉంటాడంట. ఆ రెన్నాల్లూ సేసినయి మల్లీ సెలవులొచ్చేవరకు యాదకుండాల. అమ్మగార్ని జీతంలో యిరగ్గోసుకొమ్మని బతింవలాడితే ఓ రూపాయిత్తారు. సెజ్జ బూరెలొండుత. సెజ్జబూర్లంటే పడిసత్తాడు. రావుడిగోరి అప్పమ్మనడిగితే ఓ పోటేసి ఎడతది. రొండు రోకల్లాడితే గానీ నలిగసావవ్ ...

"అట్టా సూత్తా కూకుడుండిపోనావేటి? ఎల్లెల్లు. నీల్లొట్రా" ఎల్లమ్మ అరిచేవరకూ నూకాలు ఈ లోకంలో పడలేదు మల్లీ.

ఉలిక్కిపడి, బిందె తీసుకుని వీధికొళాయివేపు సాగింది. ఎల్లమ్మద్వారా వార్త అందరికీ అందిందేమో దారిపొడుగునా అందరూ అడుగుతూనే ఉన్నారు, "సింవాద్రి ఒస్తన్నాడంట గదే" అంటూ. నూకాలు గంగడోలులా తలూపుతూనే ఉంది. దానికి నోట మాట రావడంలేదు!

వస్తుందొస్తుందనుకున్న సోమవారం రానే వచ్చింది. నూకాలూ, ఎల్లమ్మా నూర్పిళ్లప్పుడు చేసినంత హడావుడి చేస్తున్నారు. ఆదివారంసంతలో సజ్జలూ, బెల్లం కొనుక్కొచ్చింది నూకాలు అమ్మగారి దగ్గర అప్పు పుచ్చుకుని.

‘‘ముంతలో మూడ్రూపాయిలు దాసినాను. సన్నబియ్యం ఒట్రా. నాకొడుకు ఆ దబ్బనాల్లాటి బియ్యం తిన్నేడు,’’ అంది ఎల్లమ్మ.

‘‘మరేఁ. మిలిట్రీలో ఆడికి సన్నబియ్యం కూడూ, ఆవుపాలూ ఎడతారు,’’ అంది నూకాలు ఎత్తిపొడుస్తూ.

‘‘నీ పెడసరబ్బుద్ధి ఆడొచ్చే అణసాల,’’ అంది ఎల్లమ్మ కసిగా.

‘‘రానీ,’’ అంది నూకాలు.

000

ఎదలో ముల్లయి తగిలింది ఏదో. ‘‘రానీ, రానీ,’’ అనుకుంది తనలో తనే గొణుక్కుంటూ.

‘‘సుప్వీ, సుప్వీ పోటేత్తే ఏనాటికి నలిగేను. యెయ్ దబదబ నాలుగు పోట్లు,’’ కసురుకుంది అప్పమ్మ వీధిలోకి కళ్లెట్టి రోకలాడిస్తున్న నూకాల్ని.

‘‘అది గాదే. ఆడొచ్చినట్టుంటేనూ ..’’ అంది నూకాలు క్షమాపణలు చెప్పుకుంటూ.

‘‘తోటకూర గాదూ. సాయంతరవేల బండి మజ్జాన్నంవే వచ్చేసినట్టుందా నీకు?’’ అరిచింది అప్పమ్మ.

నూకాలు ఊపిరి తీసుకుని, ఉస్, ఉస్మంటూ పోటెయ్యసాగింది, ఒక్కోపోటూ సోల్జర్ బూటులా వినిపిస్తుంటే.

గుడిసెలో ఎల్లమ్మ పొయ్యి రాజేసి మూకుడు పొయ్యిమీద పెట్టింది. నూకాలికి జ్ఞానం తెలిసేక, అత్తని పొయ్యిదగ్గర చూడ్డం ఇదే. ‘‘మరి, కొడుకు,’’ అనుకుంది. ఈపాటి అదురుష్టానికి మాంవెప్పుడూ నోసుకోసేదు. దానికి సన్నగా నవ్వొచ్చింది.

‘‘నువ్వలా ముసిముసినవులు నవ్కుంత కూసో. సేంవోతా,’’ అంది అప్పమ్మ అస్త్రసన్యాసం చేస్తూ.

‘‘సేదులె. రా, రా, రొండు పోట్లేత్తే అయ్పోతాది’’ అంది నూకాలు వెనక్కుంచిన బొల్లప్పుక్క రోట్లో పడేస్తూ.

బూరెలపిండి అత్తకిచ్చేసి, అమ్మగారింటికి పరిగెట్టింది.

అమ్మగారు చిటపట్లాడేరు, "ఇంకా ఒంటిగంటేనా కాలేదు. అంట్లు తోమేసి పోతే, మళ్లీ కాఫీగిన్నెలు ఉండిపోవూ? అవి నేను కడుక్కోనా?" అంటూ.

నూకాలు దీనంగా నిలుచుండిపోయింది. "గాదమ్మగోరూ, ఇంటికాడ సిటిక పనుందియేల," అంది.

"ఇవాళ సింహాద్రి వస్తున్నాడమ్మా" అంది అమ్మాయి, ఆ ఒక్కముక్కలోనూ పూర్వాపరాలు విశదం చేస్తూ.

"సరేలే, ఏదో ఓ వేళప్పుడొచ్చి ఆ కాఫీగిన్నెలు కడిగేసి పో," అందావిడ దయ తలచి.

నూకాలు సంతోషపడిపోతూ "అట్టాగేనండి," అని పావుగంటలో మళ్లీ ఇంటిదారి పట్టింది. సగందూరం వెళ్లేసరికి దానికి జ్ఞాపకం వచ్చిందేమో మళ్లీ వెనక్కొచ్చింది.

"అమ్మాయిగోరూ," అంది తలుపుచాటున నిలబడి.

చదువుకుంటున్న అమ్మాయి తలెత్తి చూసింది ఏవిటంటూ.

"రొండు సంపెంగపూలు కొస్కుంట్నండి," అంది ఆశగా.

అమ్మాయి చిరాకు ప్రదర్శించింది. "నీకెప్పుడూ ఆ సంపెంగచెట్టుమీద కళ్లు. కావలిస్తే బజారులో లేవూ?"

"ఈ ఒక్కపాలేనండీ. బజార్ల వోడిపోయుంటాయండి" అంది నూకాలు దీనంగా.

"సరేలే," అంటూ సాయంత్రం జడలో పెట్టుకోడానికి పొద్దున్నే కోసుకుని దాచుకున్న దండ దానిమీదకి విసిరింది అమ్మాయి.

నూకాలు మురిసిపోతూ దండ అందుకుని ఇంటివేపు పరుగుల్తీసింది. దానిమనసు ఇవాళ దాట్లగుర్రంలా ఉరకలేస్తూంది.

ఇంటిదగ్గర ఎల్లమ్మ చాలామటుకు వంట పూర్తి చేసింది. కానీ నూకాలికి సంతృప్తి కలగలేదు. మళ్లీ మళ్లీ చూడసాగింది ఒక్కొక్క గిన్నే తీసి. అరకోడి కూర చేసింది. చేపలపులుసు చేసింది. అమ్మగారు రెండురోజులక్రితం ఇచ్చిన ఊరగాయముక్క జాగర్తగా దాచిపెట్టింది. సన్నబియ్యం మల్లెపువ్వులా వార్చిపెట్టింది.

"మూడ్రోజులు రెయిల్లోనే అవుతాదంట. ఒప్పుడు తిన్నడో? పాడు రెయిల్లో ఏటి దొరుకుతాది. సాంబారొణ్ణం ఆల్లే కలిపి పొట్టాలు కట్టి ఎడతారంట. శ. అదేటి బావుంటది. నేపోతే కారీజీ ఉచ్చుకుంటె రూపాయ ముప్పయేడు పైసలు తీస్కోని రొండు మెతుకులెడ్తరంట," అని బాధ పడింది. "పోనీ, ఇంకేదయిన చేదునా,"అని మనసు పీకింది. దండుబజారులో ఓ బేడ బంగాళదుంపలు తెచ్చి వేపుడు చేస్తేనో అని మనసు ఉవ్విళ్లూరింది. చూరులో పెట్టిన డబ్బీలోంచి ఓ బేడ తీసుకుని, "నానిప్పుడే ఒస్త, పొయ్‌మీద కూర సూడు," అని అత్తకి పురమాయించి, దండుబజారువేపు దౌడు తీసింది.

"ఉప్పుడెక్కడికే?" అంటున్న అత్తమ్మ మాటకి జవాబు చెప్పనేలేదు.

పదినిముషాల్లో నూకాలు బంగాళదుంపలు తెచ్చి కూర చేసేసింది. పెద్దాసుపత్రి గంటస్తంభంలో మూడు చూపేవేళకి అది కనీసం ఆరుమార్లయినా వీధిచివరిదాకా వెళ్లి వచ్చి వుంటుంది. రైళ్లు రోజు ఆలస్యంగా వస్తాయి కదా ఈ ఒక్కరోజు ఓ గంట ముందు రాకూడదూ అనిపించింది. కాలు కాలినపిల్లిలా నూకాలు తిరుగుతూంటే ఎల్లమ్మ నవ్వుకుంది. "ఈదిచివరిదాకా ఒచ్చినోడు ఇంటికి రాడేటే? రంగులరాట్నంలా తిరుగుతున్నవు," అంది.

నూకాలుకి కోపోద్ధృతంచేత మాట నోట రాలేదు. మళ్లీ వీధి చివరిదాకా వెళ్లి అక్కడున్న రిక్షావాణ్ణి అడిగింది, "అన్నా, మేలుబండీ ఇంకా రానేదా?" అని.

"నేదప్పా, గంటన్నర నేటంట," అన్నాడు రిక్షావాడు దిక్కులు చూస్తూ.

"శ, ఎదవబల్లు" అని కసిగా తిట్టుకుంది. మరో గంటన్నరతరవాత అదే చోట మరో రిక్షావాడు మేలుబండి వచ్చి వెళ్లిపోయిందని చెప్పేడు. సింవాద్రి జాడ లేదు.

కోడల్ని వేళాకోళం చేసిన ఎల్లమ్మ కూడా కొడుక్కోసం వీధి చివరిదాక వెళ్లి చూసి రాకుండా ఉండలేకపోయింది.

ఉస్సురనుకుంటూ ఎందుకు వాడు రాలేదో ఊహించుకుంటూ గుడిసెలో అడుగెట్టిన ఇద్దరికీ ఓరబంపుగా ఉన్న తడికె తోసుకుని లోపలికి ప్రవేశించి సుష్టుగా విందారగించి వస్తున్న గ్రామసింహం ఎదురైంది. నూకాలికి కానీ ఎల్లమ్మకి గానీ ఆ ఊరకుక్కని కొట్టాలనిపించలేదు.

తడిగుడ్డలో చుట్టి పెట్టిన సంపెంగపూలు వాడి మొహం వేలాడేసేయి.

నూకాలు కట్టుకున్న కొత్తకోక నలిగిపోయింది.

మర్నాడు దానిమొహం చూసి "రాలేదేమిటే?" అనడిగింది అమ్మాయిగారు.

"సేదండీ," అంది నూకాలు నిరామయంగా.

ఆ రోజు మధ్యాన్నం కూడా ఊరకుక్క విందుకొచ్చింది. తనకోసం కాచుకున్న గంజి దానికి పోసి చూస్తూ కూచుండిపోయింది నూకాలు.

ఆ రాత్రి ఎవరో పిలిచినట్టయి ఉలిక్కిపడి లేచింది. "ఎవురే?" అంది ఆ పిలుపుకే మేల్కొన్న ఎల్లమ్మ.

"ఎవురది?" అంది నూకాలు అత్తమాటలు యాంత్రికంగా ప్రతిధ్వనిస్తూ.

"సేసేలేయే" అన్నాడు సింవాద్రి లోపలికొస్తూ.

"ఉప్పుడేన్నుంచి? ఇంతరేతిరేటి?" అంది నూకాలు పూర్తిగా మేలుకొని. అప్పుడు రాత్రి రెండున్నరయింది.

సింవాద్రి మంచందండెమీద కూర్చుని బూట్లిప్పుతూ, "పాసింజరులో ఒచ్చినా. సేటయింది. ఎదవబండి. నాటుబండి నయం దానికన్నా," అన్నాడు.

"అవ్తే నిన్నసెందుకొచ్చినావు కావూ?" అనడిగింది నూకాలు, అంతవరకూ ఆనందాతిరేకంచేత మూగవోయిన బుద్ధి తేరుకున్నాక.

"నిన్నసే వొచ్చినా. అనకాపిల్లికాడ మావోడే ఓడు దిగినాడు. ఆడితో నన్నూ దింపీసినాడు. ఒద్దురా, తరువాతొస్తలే అంటే ఇంటేనా?"అన్నాడు సింవాద్రి తనకి అంతటి ఉదాత్తుడయిన స్నేహితుడు ఉన్నందుకు కించిత్ గర్వం వెలిబుచ్చుతూ.

మర్నాడు పొద్దున్నే లేచి, పనిలోకి వెళ్లబోతున్న నూకాల్ని ఆపి, "మాసెడ్డ ఆకలేస్తంది. తింటానికేపైనా పెట్టెల్లు. మల్ల ఏమజ్జానానికొస్తవో," అన్నాడు సింవాద్రి.

నూకాలు నిస్సహాయంగా చూసి పొయ్యి రాజేసింది. గంజి కాచి, ఓ ఉప్పురాయేసి వాడికి అందిస్తుంటే దానికళ్ల నీళ్లు తిరిగేయి.

"నిన్న నివ్వొస్తవని ఏటేటో సేసిందది. నువ్ రానేలేదు," అంది ఎల్లమ్మ.

“ఏటిస్తే ఏటుండే. అంతా నీసేతిలోనుంది గానీ,” అన్నాడు సింవాద్రి నూకాలుమొహంలోకి చూస్తూ.

“నీముకంలే” అంది నూకాలు మూతి ముడుచుకుని.

ఆ మాటలో తీవ్రతకి తుళ్లిపడ్డాడు సింవాద్రి. వాడిది మిలిటరీ డిసిప్లిన్. “కమనీయ భూమిభాగములు లేవె పడియుండుటకు, దూదిపరుపులేల” అని పోతనగారు చెప్పేరని వాడికి తెలీదు కానీ వాడి అభిప్రాయం అదే.

000

(ఆంధ్రప్రభ, సెప్టెంబరు 2, 1964 లో ప్రచురితం.)

# 18. నిరుద్యోగి ఉద్యోగం

నాపేరు వెంకటలక్ష్మీనరసింహసీతారామవరప్రసాదు. వెంకూ అన్నా పలుకుతాను. లక్ష్మీ అన్నా పలుకుతాను. నర అన్నా పలుకుతాను. సింహ అన్నా పలుకుతాను. సీతా అన్నా పలుకుతాను. రామా అన్నా పలుకుతాను. వరప్రసాదూ అన్నా పలుకుతాను. ఏమీ అనకపోయినా పలుకుతాను.

నేను పలక్కపోయినా, చిటిక వేసి, చూపుడువేలుతో పిలచి, ఉత్తరం పోస్టు చెయ్యమనో, మెంతులు తెమ్మనో, ఆవుమీద కాంపోజిషన్ చిన్నచెల్లికి రాయమనో చెప్తారు. నేను చెయ్యడమో, తేవడమో, రాయడమో చేసేస్తాను.

అంతమాత్రంచేత నేను చిన్నారి పొన్నారి చిరుతకూకటినాటినుండీ ఉత్తరం పోస్టు చెయ్యడమో, మెంతులు తేవఢమో తెలుగు కాంపోజిషను రాయడమో చేస్తూ ఉన్నాననుకుంటే పొరపాటు.

మధ్య మధ్యలో కాలేజీకెళ్లడం, భోజనం చెయ్యడం, నిద్రపోవడం వంటి చిన్న చిన్న పనులు కూడా చేసేవాణ్ణి. ఇవన్నీ ఇలా ఉండగా, ముచ్చటగా మూడేళ్లు "హానర్సు" చదివి, మూడోక్లాసు తెచ్చుకుని, మూడే నెలలయింది. కథాకాలంనాటికి మరో మూడు నెల్లయిందనుకోండి.

పరీక్షలయిన మొన్నాటినుండీ రోజూ పొద్దున్నే లేచేవాడిని. పళ్లు తెల్లగా తోమేవాడిని. జుత్తు నున్నగా దువ్వేవాడిని. లాల్చీ, పైజమా కొంచెం మాసినా, కొత్తవి అంటే ఇస్త్రీవి తీసి తీరా ఫలితాలు వచ్చేక ఉద్యోగానికి అర్జీ పెట్టుకుంటే, ఇంటర్వ్యూకి వెళ్లడానికీ, ఆపైన వాళ్లు నిల్చున్నపాళాన డ్యూటీలో చేరిపొమ్మంటే చేరిపోడానికీ ఇబ్బంది పడాల్సి వస్తుందేమోనని కొద్దిగా మాసినబట్టలతోనే రోడ్డెక్కి, ఎండెక్కేక ఇల్లు చేరేవాడిని. ఆమధ్యకాలంలో పలకరించినవాళ్లందరికీ నేను "హానర్సు" పరీక్ష వ్రాసేననీ, రిజల్ట్సు వచ్చేక ఏం చెయ్యాలో

ఆలోచిస్తాననీ సన్నగా నవ్వుతూ, సగం సిగ్గుపడుతూ, ఆమీదట సగం గర్వపడుతూ చెప్పేవాడిని.

ఇట్లుండ, కొండొకరోజు సదరు రిజల్టులు వచ్చేశాయి.

"అబ్బో, యమ్మే కామాలు," అన్నాడు ఎదురింటి నాయుడు కళ్లెగరేస్తూ.

నేను మందహాసం చేసేను కామాలూ, ఫుల్‌స్టాపులూ అక్కర్లేదని.

"రిజల్ట్సు వచ్చేసినట్టున్నాయే," అన్నారు అఫిలియేటేడ్ కాలేజీలో ఫిజిక్స్ లెక్చరరు రామారావుగారు.

"ప్చ. థర్డ్ క్లాసు వచ్చిందండీ," అన్నాను, నామీద నాకే జాలి కలిగి.

"ఫరవాలేదులే," అన్నారాయన ఓదార్పుగా.

ఆరోజు త్రిపాద నక్షత్రాన్ని ఇంటికి మళ్లించాను.

నెలాపదిహేనురోజులు గడిచిపోయేయి. వాచీ అక్కర్లేకుండానే మూడేసి గంటల కొకమారు "వస్తుంది. తొందర పడితే ఎలా? అందరికీ ఉద్యోగాలు కావాలి. మరి ఉద్యోగాల్లో ఉన్నవాళ్లు రిటైరవడమో, హరీమనడమో అయితే కానీ ఖాళీలు కావు కదా," అనేది అమ్మ.

"ఆఁ. ఉద్యోగాలకేమిటి కొదవ. నలుగురికి నాలుగు ప్రైవేట్లు చెప్తే నాలుగు పదులు నలభై." అనేది అక్క. దానికి నాలుగో ఎక్కం క్షుణ్ణంగా వచ్చు.

నాన్నగారు నాపక్కనించి నడిచి వెళ్తుంటే, నేనక్కడ ఉన్నానో లేనో ఆయనకి తెలిసినట్టు లేదు.

"ఒరేయ్, మాకాలేజీలో పి.యు.సి. వాళ్లకిట ట్యూషను చెప్తావా?" అడిగాడు అన్నయ్య.

"ప్రైవేట్లా?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఏం? ప్రస్తుతానికి అడుగు పెడితే, పడుకోడానికి జాగా తరవాత చూసుకోవచ్చు. పొద్దున్నోగంటా, సాయంత్రం ఓగంటా చెప్పావంటే బాచికి పదిహేనుమందిని వేసుకున్నా, పదిహేను పదులు నూటయాభై. రెండు నూటయాభైలు మూడొందలు. లెక్చరరుకన్నా ఒకటిన్నర రెట్లు ఎక్కువ" అన్నాడు.

వీడికి కూడా ఎక్కాలు బాగా వచ్చు.

“ఓ ఇరవైమంది వచ్చినా రెండు వందలు కళ్ల చూస్తాం,” అంది అమ్మ. అమ్మకి కూడా ఎక్కాలు బాగా వచ్చు.

“సరే, చూద్దాం,” అన్నాను. నాకు ఎక్కాలు రావు. సరేననేసి వీధిన పడ్డాను. లెక్క పెట్టి నాలుగడుగులు వేసేలోపున ఓ పెద్దమనిషి ఎదురుపడి, “ఏరోయ్, ప్రైవేట్లు చెప్తున్నావటగా” అన్నాడు ఆనందంతో.

నేను తెల్లబోయి, “ఇంకా మొదలు పెట్టలేదండీ,” అన్నాను భయభక్తులతో.

ఇలా చాలామందికి చెప్పవలసివస్తుంది. ఈలోపున చాలా రోజులు అయిపోతాయి. రెండూ అయేక అన్నయ్య వచ్చి “ఒక్క స్టూడంటు కూడా రాలేదు,” అని చెప్పేడు.

“బాగుంది,” అన్నాను.

“అయ్యో,” అంది అమ్మ.

“ప్చ్,” అంది చెల్లాయి.

మళ్లీ ఊరుమీద బలాదూర్ తిరగడం మొదలు పెడతాన్నేను.

పదిగజాలకోమారు ఓ పెద్ద మనిషి కనిపిస్తాడు. మాఊరినిండా పెద్దమనుషులే!

“ఏరా, ఎక్కడా కనిపించడంలేదు. చదువుకున్నవాడివనా?” అంటారు ఒకాయన మందహాసం చేస్తూ, జరీకండువా సవరించుకుంటూ.

“అదేఁవిటండీ. నేనెంత? నాచదువెంత?” అంటాన్నేను. మరి నేను నాలుగున్నర అడుగులూ, నాచదువు యం.ఏ. థర్డుక్లాసూ.

“మరి కనిపించడంలేదేం?” అంటారాయన చిరుకోపంతో.

“మొన్న మీయింటికొచ్చేనండీ.”

“మరి నాకెందుకు కనిపించలేదూ?” అంటూ గర్జిస్తారాయన.

“ మీజవాను గేటుదగ్గర అడ్డుపడి పొమ్మన్నాడండీ,” అంటాను నసుగుతూ, వణుకుతూ.

“సరేలే. ఎక్కడైనా పని చేస్తున్నావా,” అంటారాయన శాంతించి.

“అందుకనే వచ్చేను మీయింటికి,” అంటాను సాహసించి.

“బాగుంది. వస్తా,” అంటారాయన ముందుకి సాగుతూ.

“మీరెందుకండీ. ఎప్పుడో చెప్పితే, నేనే వస్తా,” అంటా ఆయన వెంటబడుతూ.

“ఎందుకులే. నేనే కబురు పెడతా,” అంటారాయన వెనక్కి తిరిగి చూడకుండా, పెద్ద పెద్ద అంగలేస్తూ.

నేను కాళ్లీడ్చుకుంటూ ముందుకు సాగుతాను. పన్నెండయేక ఇంటికి చేరుతాను. అది పండుగరోజయితే ఓ ఉత్తరం అందిస్తుంది అమ్మ, “నీకొచ్చిందిరా,” అంటూ. హాసరేఖలు అమ్మమొహంమీద లాస్యం చేస్తాయి.

అది ఇంటర్వ్యూకి రమ్మని ఆహ్వానం. నా నూటపదిహేడో అప్లికేషనుకి జవాబు. ముప్ఫైతొమ్మిదో ఇంటర్వ్యూ ఇది.

సరే, ఇంటర్వ్యూ ప్రారంభమవుతుంది.

“నీపేరు?”

“మీ ఊరు?”

“ఏం చదువుకున్నావు?”

“చిత్తం” అన్నంత వినయంతో జవాబులు చెప్తాను. అయితేనేం?

“అదేమిటయ్యా, యమ్.యే. చదువుకున్నవాడిని ఎలా వేసుకోను ఇంత చిన్న పనికి?”.

“నాకేం ఫరవాలేదండీ,” అంటాను.

ఆయన జాలి పడతాడు.

“ఇంటరు ఫైయిలయినవాళ్లకింద పని చేస్తావా?” అంటాడాయన నా ఆత్మగౌరవాల్ని రెచ్చగొట్టడానికి తలపడుతూ.

“మీరు ఆ ఉద్యోగం ఇస్తానని మాటిస్తే, నేను అప్పుచేసి వెళ్లి కాశీలో వదిలేసి వస్తానండీ నాడిగ్రీని,” అంటాను ఆశగా.

“నీకు భలే సెన్సాఫ్ హ్యూమరుందే,” అంటూ మెచ్చుకుంటారాయన. ఆయనభూషణకి (ఇలాంటి దూషణలకీ) పొంగిపోను.

‘‘దానికేం లెండి. కాళిదాసుకి కవిత్వంలాగే నాహ్యూమరు కూడా దానంతచే వస్తుంది,’’ అంటాను ఇంకా ఆశ చావక.

ఆయన మళ్లీ నవ్వి, ప్యూనుని పిలిచి కూర్చీ వెయ్యమంటారు.

‘‘నాకు మరో అయిడియా తడుతోంది. వెంటనే చెప్పేస్తా, చూడండి. మీరు కుర్చీ వేయించడానికి ప్యూనుని పిలిచారు. ఆ పని చెయ్యమన్నా చేస్తానండీ,’’ అంటాను.

పర్వతం బద్దలయినట్టు ఆయన మరోమారు హోరెత్తిపోతూ నవ్వుతారు.

‘‘మరి మేం ఈ ఉద్యోగానికి హోల్ మొత్తం ఎనభై రూపాయలిస్తున్నాం. నీకు చాలా?’’ అంటారాయన నేనివ్వబోయే హ్యూమరసాన్సరుకోసం చూస్తూ.

‘‘నాకు యాభై చాలండీ,’’ అంటాను వస్తున్న ఏడుపు ఆపుకుంటూ. ఈసారి ఆయన ప్యూనుని పిలిచి రెండు కప్పులు కాఫీ తెప్పిస్తారు. మరో అరగంట నాచేత వాగించి, తృప్తిగా నవ్వి, ‘‘నీ ఎడ్రెసియ్యి. నీకు తగిన ఉద్యోగం వస్తే తప్పకుండా నిన్నే తీసుకుంటా,’’ అంటారాయన.

నేను లేచి నిలబడి, నిటారుగా నిలుచునే, టేబుల్‌మీద, కాగితంమీద నా ఎడ్రెసు రాసి, ‘‘మరి రేపు ఇదే వేళకి రమ్మంటారా?’’ అని అడుగుతాను.

‘‘ఎందుకు?’’ అంటారాయన ఆశ్చర్యంగా.

‘‘ఇప్పుడు మిమ్మల్ని ఎంటర్టయిన్ చేసినందుకు కప్పు కాఫీ ఇప్పించేరు కదా. ఈలెక్కన నెలకి సుమారు నాలుగు రూపాయలు గిడుతుంది. మీరు నాకిచ్చే ఉద్యోగం ఏమీ లేదని నాకు తెలుసు.’’

‘‘అదేమిటి? ఎడ్రెసు తీసుకున్నది ఎందుకనుకున్నావు?’’

‘‘అదంతా ఓ తమాషాలెండి. అయినా ఇది మటుకు ఉద్యోగం కాదండీ? రోజుకి పదిహేను నయాపైసల చొప్పున సంవత్సరానికి యాభైఒక్కరూపాయిఇరవైఅయిదు పైసలవుతుంది. లీపు సం. అయితే మరో పదిహేను పైసలు అవుతుంది.’’

‘‘హోర్నీ, భలేవాడివయ్యా! ఆఫీసులో ఉద్యోగం లేదు సరి గదా ఇంట్లో ఎదిగిన ఆడపిల్లయినా లేదు కదోయ్,’’ అంటారాయన వెనక్కి చారబడి.

‘‘అది మాయింట్లో ఉందిలెండి,’’ అంటాను లేచి నిలబడి.

ఆయన ముందుకి వంగి, నా ఎడ్రెసు పర్సనల్ ఫైలులో పెట్టుకుంటూ, ‘‘ఆర్యూ ఎ బ్రాహ్మిన్? నువ్వు బ్రాహ్మణుడివా?’’ అంటారు హఠాత్తుగా ఏదో జ్ఞాపకం వచ్చినట్టు.

‘‘అవునండీ, యస్సార్,’’ అంటాను నేను కూడా ద్విభాషల్లోనూ.

‘‘అహం స జాతిః ప్రత్యక్తా అంటూ తెంపి పారేయడానికి నామెళ్లో యజ్ఞోపవీతం లేదు. (ఇదివరకు ఉండేదిలెండి). గాయత్రి మానాన్నగారు ఉపదేశించిన మర్నాడే మర్చిపోయేను. హోటల్లో నాజాతికానివాడి సహపంక్తిన ఏ ఒరియావాడో వడ్డించిన వంటలు పబ్లిగ్గా తింటాను. ఐతే ఏం గాక. నేను ప్రభుత్వంవారిచే రికగ్నైజు చేయబడిన శుద్ధశ్రోత్రియ బ్రాహ్మణకుమారుణ్ణి! భూసురవరుణ్ణి!

‘‘సారీ, ఎనీవే దట్ డోంట్ మేటర్, అదేమంత లెఖ్ఖలోకి రాదు ఉద్యోగంవిషయంలో.’’

‘‘వస్తే మటుకు ఏంచేస్తాం లెండి. జన్మ దైవాధీనం,’’ అనేసి, ఇంటికొస్తాను.

‘‘ఏమన్నార్రా?’’ అని ప్రశ్నించేవాళ్లకి ఏం చెప్పాలో ఆలోచిస్తూ.

కానీ, కథాంతం సుఖాంతం కావడం కోసం … … గారు నాకు ఉద్యోగం వే.యిస్తారనీ, నాలాగే మీరూ ఆశ పడితే, నాకులాగే మీకూ నిస్పృహ ఎదురవుతుంది.

ఏది ఏమైనా ‘‘ఫలం’’ మనది కానప్పుడు ఎందుకీ తాపత్రయం? అందుకే నిశ్చింతగా నాలాగే మీరు కూడా …

000

(1965 జ్యోతి మాసపత్రికలో ప్రచురితం)

# 19. గుణాలూ, దోషాలూ

"కారణం అడక్కూడదు కానీ కార్యార్థిపై వచ్చేవని నీముఖమే చెప్తూంది," అన్నారు వెంకటపతిగారు చిర్నవ్వుతో పట్టాభితో.

"అవునన్నా కాదన్నా అసత్యమే అవుతుంది మాష్టారూ! నిజం చెప్పాలంటే మిమ్మల్ని కలుసుకుని చాలా రోజులయింది కనక ఓమారు చూసి పోదాం అని చుక్కానిటు తిప్పేను. తీరా వస్తున్నాను కదా అని ఒకథ కూడా పట్టుకొచ్చేను," అన్నాడు పట్టాభి తన లౌక్యం తెలియజేస్తూ.

"నేనూ అదే అనుకున్నాను," అన్నారు పతిగారు.

పట్టాభి గంభీరవదనుడై విషాదం ధ్వనింపజేస్తూ, "ఈమధ్య ఒక దుస్సంఘటన జరిగింది. హరిహరరావుగారని మన సబ్‌పోస్టాఫీసులో పోస్టుమాస్టరుగా పని చేసేవారు పరమపదించేరు. నెల రోజులవుతోందేమో ఆ ఇల్లాలు, ఇద్దరు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు మిగిలిపోయేరు ఈ భూమ్మీద."

"పాపం,"అన్నారు వెంకటపతిగారు సానుభూతిగా.

"నాకు వాళ్లని చూస్తే జాలి వేస్తూంది మాష్టారూ. ఆ పెద్దమనిషి ఓ ఇల్లంటూ నిలబెట్టగలిగేడే కానీ వీళ్లకోదారంటూ చూపించలేకపోయాడు. ఆ ఇల్లాలు పరమసాధ్వీ, అమాయకురాలూను. ఆడపిల్లల్లో పెద్దపిల్ల యస్సెల్సీ పాసయి ఊరుకుంది. రెండోపిల్ల ప్రీయూనివర్సిటీ మొన్న మార్చిలో పాసయింది. మగపిల్లలిద్దరూ ఇంకా గింజ పట్టని పింజలే. వీళ్లు నిటారుగా నిలబడే రోజెప్పుడొస్తుందా? ఎప్పుడు, ఎలా? అని ఊః ఇదయిపోతున్నాను మాష్టారూ."

"కష్టమే."

‘‘కష్టమేనంటూ వెష్ట పడ్డవాళ్లున్నారు. కానీ ప్రపంచపుతీరు. అయ్యో అన్నవాళ్లెవరూ చెయ్యందించడానికి ముందుకి రావడంలేదు. అందుకే ఆ మునిగిపోతున్నఓడని ఒడ్డుకి చేర్చడానికి నాచేతనైన సాయం చెయ్యదలుచుకున్నాను.’’

‘‘మంచిదే.’’

పట్టాభి ఒక్క క్షణకాలం విరామం తీసుకుని మళ్లీ మందరస్థాయిలో అందుకున్నాడు, ‘‘అందుకు మీరు కూడా తోడ్పడాలండీ,’’

వెంకటపతిగారు నిండుగా నవ్వేరు. ‘‘ఏదో నాకు మాట దక్కించాలని కాకపోతే నువ్వు చెయ్యలేనిదీ, నేను చెయ్యగలిగిందీ ఏముందోయ్,’’ అన్నారు.

‘‘అలా అనకండి. బంగారుపళ్లెరానికయినా గోడచేరుపు కావాలి. అసలు విషయం ఆ మ్యునిసిపల్ స్కూల్లో అటెండరు ఉద్యోగం ఒకటి ఖాళీ అని విన్నాను. మ్యునిసిపల్ కౌన్సిలర్ మీకు బాగా తెలుసని నాకు తెలుసు. ఆ ఉద్యోగం మీరు హరిహరరావుగారి అమ్మాయి కస్తూరికి ఇప్పించగలిగితే నేను కూడా సంతోషిస్తాను. వాళ్లు మీకు ఆజన్మాంతం కృతజ్ఞులయి ఉంటారు.’’

పతిగారు గంభీరంగానే, ‘‘ఈమాత్రపుమాటకి అంత పరిచయం కావాలా పట్టాభీ, కానీ మనం మరొకచోట ప్రయత్నిస్తే బాగుంటుందేమో,’’ అన్నారు.

‘‘ఏం?’’

‘‘ఏమీ లేదు. అది లీవు వేకన్సీ. అప్పుడే నెలాపదిహేనురోజులయిపోయాయి. ఇహ మిగిలిన ఒకటిన్నర నెలరోజుల్లోనూ మనం ప్రయత్నం చేసి కాగితం పుట్టించేసరికి మరో పదిహేనురోజులు పట్టొచ్చు. మీవాళ్లఅవసరం చూస్తే అంతకంటె స్థిరమయిన ఉద్యోగం కావాలనిపించడం లేదూ?’’

‘‘కాదనను. కానీ ప్రస్తుతం కాలూనడానికి కమ్మరేకయినా చాలునన్న పరిస్థితులు.’’

‘‘కాదనను కానీ మనం కూడా అలాగే ఆలోచిస్తామా అనీ?’’

‘‘నిజం చెప్పాలంటే ఇప్పటికిది దొరికితే మరొక ప్రయత్నానికి కొంత గడువు దొరుకుతుంది కదా అని నేనాలోచిస్తున్నాను.’’

పట్టాభి కృతనిశ్చయుడై వచ్చేడని రూఢి అవడంతో, వెకటపతిగారు, "సరే, చూస్తా. కాని ఇలా అడుగుతున్నానని మరోలా అనుకోకు. నీకు వాళ్లేం అవుతారు?"

"అదేమిటండీ, సాటిమానవులు. కష్టాల్లో ఉన్నారు. అన్యులకి ఉపకరించడంలోనే ఈ కాయం నాశం పొందాలని నాఅభిమతం," అన్నాడు పట్టాభి.

పట్టాభి వెళ్లిపోయేక కస్తూరివిషయమే ఆలోచిస్తూ ఉండిపోయారు వెంకటపతిగారు.

తను కావాలనుకుంటే ఆ పోస్టు కస్తూరికిప్పించగలమాట నిజమే కానీ పాత్రులు అని తోస్తే తప్ప ఆయన తనమాట పోగొట్టుకోరు. అది తగినవిలువ లేనిదే మార్కెట్టులోనికి తేకూడని వస్తువు అని ఆయన స్థిరఅభిప్రాయం. కస్తూరి థర్డుఫారం, ఫోర్తుఫారం చదువుతున్న రోజులలో ఆయనకి పరిచయమే. యోగ్యురాలే! కాని ఒక్క నెలరోజులఉద్యోగానికి ఎందుకింత ప్రయాస అని. క్షణం వేషానికి గడ్డాలూ, మీసాలూ తీయించుకున్నట్టు!

"పొద్దున్నే కూనిరాగాలు తీస్తూ కుర్చీలో కూచోపోతే అలా బజారువేపు వెళ్లి రాకూడదుటండీ. మామిడికాయలు కాదు కానీ కాయగూరలు వీధులోకి రావడమే లేదు," అంటూ వంటింటిలోంచి వరలక్ష్మి కేకలెయ్యడంతో వెంకటపతిగారు లేచి లోపలికెళ్లేరు.

కండువా, కళ్లజేడూ, కాళ్లజోడూ - అవరోధవ్రాతాన్నంతటినీ అందిపుచ్చుకుని, "సిరి"తో "ఏం తెమ్మని శలవు?" అన్నారు.

"తెల్లారేసరికి ఊడిపడ్డాడు తోకచుక్కలా. ఏం ములిగిందిటా?" అంది వరలక్ష్మి తీరిగ్గా.

"మంచిదానివే. కుంపటిమీద గిన్నె పడేసి కూరలకోసం కూచున్నట్టు కేకలేసేవు. తీరా నేను లేచొస్తే కాకమ్మ కబుర్లా? ఆడలక్షణం పోనిచ్చుకున్నావు కావు."

"సరేలెండి. నన్ను దెప్పడానికే కాసుక్కూచున్నారు మీరు."

"అది కాదోయ్ విషయం చెబుతున్నా. ఆ పోస్టమాస్టరుగారిఅమ్మాయికి ఏదేనా ఉద్యోగం ఇప్పించమని అడగడానికొచ్చేడు. చాలా బాధలు పడుతున్నారుట. పెద్దపిల్లకంత ధైర్యం లేదు. చిన్నపిల్ల మటుకు ఆ మ్యునిసిపల్ ఆఫీసులో బిల్లులు రాసి రోజుకి రెండూ, మూడూ తెస్తుందిట. పుస్తకానికి రూపాయి చొప్పున ఇస్తారు వాళ్లు."

“అవున్ట, పాపం. నేనూ అదే విన్నాను. మరీ నడిసముద్రంలో వదిలేసి పోయేట్ట,” అంది వరలక్ష్మమ్మ అదేదో అయన కోరి చేసినట్టు.

ఆమాటే పతిగారు ప్రవచించి వీధిన పడ్డారు. బజార్నుంచి వెనక్కి మళ్లుతుంటే “వాళ్లనోమారు పలకరించి వద్దునా?” అనిపించి అటువేపు వెళ్లారు.

పంచలో కూచుని తమ్ముళ్లిద్దరిచేత అక్షరాలు దిద్దిస్తున్న కస్తూరి మాష్టారిని చూడగానే లేచి నిలబడింది తొట్రుపాటుతో.

“కూచోమ్మా, కూచో. ఊరికే ఇలా బజారువేపొచ్చేను కదా అని ఇటు వచ్చేను.”

కస్తూరి లోపలికి చూస్తూ, “అమ్మా! వెంకటపతి మాష్టారొచ్చేరు,” అంది.

“కూచోండి బాబుగారూ,” అంది తలుపుచాటునించి రుద్ధకంఠంతో కస్తూరితల్లి.

వంటింటిలో తల్లికి సాయం చేస్తున్న తులసి వచ్చి, “నమస్కారం, మాష్టారూ,” అంది చేతులు జోడించి.

“నమస్కారం,” అన్నారు వెంకటపతిగారు.

స్తబ్ధత బలంగా విస్తరించుకుంటోంది. తలుపు చాటునున్న నిర్భాగ్యురాలు అనన్యవేదన ననుభవిస్తూందని పతిగారికి తెలుసు. ఆ సమయంలో ఎవరు ఏం మాటాడినా వికృతంగా ధ్వనిస్తూందేమో అనిపించి ఎవరూ మాటాడలేదు. సెకన్లు నిముషాలుగా చుట్టుకుంటున్నాయి. చిన్నపిల్లలిద్దరూ నల్లనిమబ్బులు ప్రతిఫలిస్తూన్న నళినీదళసంస్థితతరళబిందువుల్ని తలపింప జేస్తున్నారు.

“ఈ నాటికీగతి పడుతుందని ఏనాడూ అనుకోలేదు. ఏ జన్మలో ఏ పాపం చేసుకున్నామో ఇప్పుడిలా అనుభవించమని నుదుట వ్రాసేడు. ఆయన మహరాజులా వెళ్లిపోయేరు నీపటం నీ నెత్తిన కొట్టుకోమని .. నేనూ, నోరూ వాయీ లేని ఈ పసివాళ్లూ మిగిలిపోయేం ...” వెలి రాసుకుపోయిన కంఠంలోంచి వెలువడినవాక్యాలు విని వెంకటపతిగారు చలించిపోయేరు.

‘‘ఊరుకోండమ్మా. మీరే ఇలా అధైర్యపడితే పిల్లలకెవరు ధైర్యం చెబుతారు? ఇప్పుడు మీరే తల్లీ, దండ్రీ వాళ్లకి. ఎంత దుఃఖమైనా తట్టుకు నిలబడక తప్పదు వాళ్లకోసమయినా,’’ అన్నారు కంపితస్వరంతో, పిల్లలవేపు చూస్తూ.

కస్తూరి స్తంభంచాటున నిలబడి కళ్లు తుడుచుకుంటోంది. కస్తూరితల్లి కొంచెం కొంచెంగా తేరుకుంటోంది దుర్భరవేదన తాలూకు తొలితరంగం మలుపులో.

‘‘అందుకే బాబుగారూ, ఈ బొందిలో ఈప్రాణం ఇంకా ఉంది. అందరం పోయేవాళ్లమే. కాని వీళ్లు ... కన్నందుకు వీళ్లకోమార్గం అంటూ చూపడం మా బాధ్యతే కదా! ఆ మొక్కు కాస్తా తీరిపోతే నేను ఉన్నా పోయినా విచారం ఉండదు.’’

‘‘అంతే మరి,’’ అన్నారు పతిగారు మరేఁవన్లేక.

కస్తూరి ఏదో మాటాడబోయి ఊరుకుంది.

తులసీ, పతిగారూ కూడా గమనించారది.

‘‘చెప్పూ,’’ అంది తులసి కస్తూరితో.

కస్తూరి మాటాడలేదు.

‘‘ఏఁవిటి?’’ అంది తల్లి.

‘‘అదేనమ్మా, ట్రైనింగుసంగతి మాష్టారితో చెప్పమంటున్నాను,’’ అంది తులసి చొరవగా.

‘‘ఏం ట్రైనింగమ్మా?’’ అని ప్రశ్నించారు పతిగారు కస్తూరివేపు తిరిగి.

కస్తూరి తలొంచుకుని సతీదేవిలా నిలబడడంతో తులసే మళ్లీ కలగజేసుకోవలసి వచ్చింది.

డిస్ట్రిక్ట్ బోర్డువాళ్లు ఏదో టీచర్స్ ట్రైనింగ్ ఇస్తారుటండీ రెండేళ్లు. నెలకి 75 రూపాయలు స్టైపెండు కూడా ఇస్తార్ట. ఉద్యోగం కూడా వాళ్లే ఇస్తార్ట. దానికి వెళ్లమని పట్టాభి మామయ్య అంటున్నారు,’’ అంది తులసి.

కస్తూరి నోరు విప్పింది ఆఖరికి, ‘‘నాకిష్టం లేదండీ.’’

తల్లి నిట్టూర్చింది. ‘‘ఇదీ వరస. జ్ఞానం వచ్చిందగ్గిర్నుంచి వీళ్లిద్దరూ ఇలా వేధించుకు తింటున్నారు. ఇది ఉద్యోగం చెయ్యనంటుంది. పాపం ఆ పట్టాభి ఎంత అచ్చి ఉన్నాడో

వారంరోజులనించి ఒక్కలా తిరుగుతున్నాడు కాలికి బలపం కట్టుకుని. చిలక్కి చెప్పినట్టు చెప్తుంటే, నన్ను కాదన్నట్టు నోరు బిగించుక్కూచుంటుంది. గట్టిగా ఏదైనా అంటే 'నన్నిందుకే చదివించేరా?' అంటుంది. మీరైనా చెప్పండి బాబుగారూ. ఇలాటి పరిస్థితులు ఎవరైనా కోరుకుంటారా? ఊహిస్తారా? మన ఖర్మ కాలి ఇలా అయింది కానీ ఏ తల్లి మాత్రం ఆడపిల్ల సంపాదనతో - ఏపిల్లసంపాదనతోనైనా - జీవించాలని కోరుకుంటుందా? ఏ తల్లయినా, తండ్రయినా పిల్లలు విజ్ఞానవంతులు కావాలని చదివిస్తాం. ఎవరిబతుకు వాళ్లు బతకాలని ఆశ పడతాం. తలరాతలు వంకరైతే ఏం చెయ్యగలం?''

ఆవిడ కళ్లు తుడుచుకుంటూ లోపలికి వెళ్లిపోయింది. కస్తూరి వదనం బాధతోనూ దుఃఖంతోనూ ఎర్రవారినట్టు గమనించారు పతిగారు.

''కస్తూరీ, నువ్వేమీ తెలివితక్కువదానివి కాదు. వయసుకి చిన్నదానివైనా ఇంటికి పెద్దదానివయావు. తమ్ముళ్లనీ, చెల్లెళ్నీ పెద్దవాళ్లని చెయ్యవలసినబాధ్యత నీమీదుంది. ఆలోచించుకో తల్లీ. ఇటువంటి విషయాలు స్వయంగా ఆలోచించుకోవలసినవే కానీ ఒకళ్లు చెప్పవలసినవి కావు. ఇప్పుడు అమ్మ చెయ్యగలిగిన స్థితిలో లేదని వివాహానికి అంగీకరించకపోతే, తగిన ఆత్మబలం లేదని ఉద్యోగానికీ అంగీకరించకపోతే మీ అమ్మగారి మనసు ఎలా ఉంటుందో ఊహించుకో. మా అమ్మాయివంటిదానివని చెప్తున్నాను. అపార్థం చేసుకోకు. ఒక నిర్ణయానికి రావాలి నువ్వు. మీ అమ్మైనా ఎన్నాళ్లు ఈదగలరు ఈ లోతు తెలీని ఈత? ఆవిడకైనా తగిలిందేమీ చిన్నదెబ్బ కాదు కదా.'' పతిగారు రెండు నిముషాలు మౌనం వహించేరు. ''ఏఁవమ్మా?'' అన్నారు ఆ తరవాత.

''సరేనండీ,'' అంది కస్తూరి.

వెంకటపతిగారు లేస్తూ, ''సరే, వస్తానమ్మా. మరోమాట. ఆ టీచరు ట్రైనింగుకి వెళ్లడం మంచిది కాదేమో. వాళ్లు ఆ తరవాత ఏ పల్లెటూరిలోనో వేస్తే నువ్వొక్కదానివీ వెళ్లలేవు, కుటుంబాన్ని తీసుకెళ్లలేవు. ఇక్కడ కమిషనర్ శేషశాయి మనక్కావలసినవాడే. వాడితో చెప్పి నేను కాయితం తీసుకొస్తాను. మ్యునిసిపల్ స్కూల్లో ఎటెండరుగా ఇప్పుడు చేరేవంటే, ఈలోపున మరొకటి చూదాం. నేనింక వస్తాను,'' అని ఆయన వీధివేపు నడిచేరు.

కస్తూరి అంతసేపూ ఆపుకున్న దుఃఖం మరి ఆపుకోలేకపోయింది. విసురుగా లోపలికెళ్లి మంచంమీద వాలిపోయింది. ప్రళయప్రభంజన వర్షపాతహతనవవల్లరి చందాన.

వెంకటపతిగారు శేషశాయి ఇంటివేపు నడిచారు.

మలుపు తిరుగుతూనే పట్టాభి ఎదురుపడ్డాడు. ఎదురు పడుతూనే వ్యాకులపడినట్టు తేటతెల్లం చేస్తూ, ''ప్రాణం విసిగిపోతూంది మాష్టారూ. నాపాలిట ఒక నక్షత్రకుడు దాపురించాడు,'' అన్నాడు.

పతిగారు నవ్వి, ''ఎవరా నిక్షేపరాయుడు?'' అన్నారు తేలిగ్గా.

పట్టాభి నిట్టూర్చి, ''ఉన్నాడులెండి ఓ అగస్త్యభ్రాత. ఇప్పుడేం చెయ్యమంటారు?'' అన్నాడు.

''పెంచుకోవయ్యా! కొండమీద దొరికితే సింహాద్రి అప్పన్న. సముద్రుపొడ్డున దొరికితే కుంతినందనుడూ,'' అన్నారు పతిగారు.

పట్టాభి కించిదప్రసన్నుడై, ''మీకు నవ్వుగానే ఉంటుంది కానీ నాకు ప్రాణాంతకంగా ఉంది. పెంపుడుకొచ్చినవాడైతే మీకంటగట్టకపోదునా? పోస్టుమాస్టరుగారు పోగానే ఆఇంట్లో మొగదిక్కు లేదు కదా. కస్తూరిని నేనొప్పిస్తే వాడు చేసుకుంటాడుట.''

పతిగారికి అందులో అసంగతమేమీ స్ఫురించలేదు. అందుకే ఆయన, ''అయితే కానియ్. ఏం కస్తూరి కాదంటూందా?'' అన్నారు.

పట్టాభి మటుకు అమంగళం ప్రతిహతమగుగాక అన్నట్టు మొహం పెట్టి, ''అదేమిటండీ అలా అంటారు. వాడొక అప్రాచ్యుడు. వీధుల్లో బలాదూర్ తిరుగుతున్న వెధవని నేనే పట్టుకుని ఓ ఉద్యోగం అంటూ వేయించకపోతే, ఈపాటికి అడుక్కుతింటుండేవాడు.'' అన్నాడు. జరిగిన దాన్నిబట్టీ, జరగనిదాన్నిబట్టీ కూడా ఆ ''నక్షత్రకుడి'' చరిత్ర చెబుతూ.

పతిగారు ముందూ వెనకా చూశారు, ''పట్టాభీ, నేనొకమాట అడగనా?''

''అడగండి.''

''ఏంలేదు. ఇందాక బజార్లో ఎవరో కనబడి నన్నడిగేరు. కస్తూరిని నువ్వు చేసుకోవాలనుకుంటున్నావని, నిజమేనా?''

“రామరామ. ఎవరైనా అంటే అన్నారు, మీరెలా అనుకున్నారు మాష్టారూ? పెళ్లి చేసుకుని ఉంటే ఈపాటికి నాకు కస్తూరంత కూతురుండేది కదా.”

పట్టాభి అన్నిమాటల్లాగే ఈ మాట కూడా పూర్తిగా నిజం కాదు. కస్తూరికన్నా అతను పదిహేను, పదహారేళ్లు పెద్ద, అంతే. పతిగారికీవిషయం తెలుసు.

“సరే. నేను శేషశాయిదగ్గరికి వెళ్తున్నాను. కస్తూరిని రేప్పొద్దున్న మాఇంటికి పంపించు. లేకపోతే, నువ్వొచ్చినా సరే. అపాయింట్‌మెంటు ఆర్డరు సిద్ధంగా ఉండేలా చూస్తాను,” అనేసి పతిగారు పట్టాభిని దాటి శేషశాయి ఇంటివేపు నడక సాగించేరు. తరవాత ఇంటికి చేరేసరికి పన్నెండయింది.

“ఇవాళ రారేమో అనుకున్నాను. ఇప్పటికైనా ఇల్లు జ్ఞాపకం వచ్చిందే,” అంటూ వరలక్ష్మమ్మ చదివింపులు సాగించారు ఆయన్ని గేటులో చూస్తూనే.

“ఈ మంగళావాచకాలకేం గానీ లోపలికి దారియ్యి,” అన్నారాయన కూరలసంచీ అందిస్తూ.

భోజనం చేస్తూ పతిగారు వరలక్ష్మమ్మతో జరిగినసంగతి చెప్పారు. అంతా విని ఆవిడ, “అంతేమరి. గొడ్డు గోతిలో పడితే నలుగురూ నాలుగురాళ్లు రువ్వడం లోకసహజం. ఇంతకీ వాళ్ల రాతలెలా ఉన్నాయో,” అంది తనకు తానే ఫిలాసఫీ బోధించుకుంటున్నట్టు.

వెంకటపతిగారు భోజనం ముగించుకుని, కొంచెంసేపు పేపరు చూసి, మంచంమీద వాలేరు. మాగన్నుగా నిద్ర పడుతుండగా, “మాస్టారున్నారాండి?” అంటూ ఎవరో పిలవడంతో, ఆయన ఆ క్షణికసుఖానికి నోచుకోకుండానే లేవవలిసివచ్చింది.

“ఎవరు నాయనా?” అంటూ ఆయన వరండాలోకి వచ్చి, గేటుదగ్గర నిల్చున్న కుర్రాడిని పరికించి చూడసాగేరు. ఎంత చూసినా ఆయనకెక్కడా ఇదివరకెక్కడా చూసిన ఆనవాలు దొరకలేదు.

“నమస్కారం మేష్టారూ! మిట్టమధ్యాహ్నం వచ్చేను. మీకు నిద్రాభంగమయితే క్షంతవ్యుణ్ణి,” అన్నాడా కుర్రాడు చొరవగా లోపలికి ప్రవేశిస్తూ.

మిట్టమధ్యాహ్నంవేళ ‘మాష్టారూ’ అంటూ వెతుక్కుంటూ వచ్చినవాడిని పొమ్మనడం ధర్మం కాదు కనక, పతిగారు సౌమ్యంగా, “ఫరవాలేదు. లోపలికి రా,” అని ఆహ్వానించేరు.

“నన్ను మీకు తెలియకపోవచ్చునండీ. కాని పట్టాభి ఎప్పుడయినా ఓ నక్షత్రకునిగుర్చి మీకు చెప్పి ఉంటే, వాడే వీడు,” అన్నాడు అతను బొటనవ్రేలు తనగుండెమీద ఉంచి.

పతిగారు అతనిని అవలోకించారు, “అలాగా” అంటూ. అనకాపల్లి బాణాకర్రలా, కరగబోసి సాగ్గొట్టిన కమ్మెచ్చులా ఉన్నాడు. నల్లనివాళ్లమధ్య తెల్లగానే కనిపించే రంగూ, చురుగ్గా తగిలే చూపూ, అమాయకంగా కనిపించే నవ్వూ చూపరులనిట్టే ఆకర్షిస్తాయి నిస్సందేహంగా.

“అయితే నీకు పట్టాభి ఏమవుతాడు?” అనడిగారు యదాలాపంగా.

“ఎవరైనా ఏమవుతారండీ? పాత్తే మన్నూ, తగలేస్తే బూడిదాను,” అన్నాడా కుర్రాడు తొణక్కుండా.

“పదునే!”

“అదేనండీ. పట్టాభి ఇంకా గ్రహించలేదు.”

“ఇంతకీ నీపేరు చెప్పేవు కావు.”

“రమాకాంత్ అంటారండి.”

“ఆఁహ్ఁ.”

“ఏంలేదు. అయితే రమాకాంతుడివా?” అన్నారాయన పేరు చమత్కరిస్తూ.

““రమాకాంతుడిని కాను గానండీ కస్తూరివిషయం మాట్లాడడానికి వచ్చేను,” అన్నాడు అతను సీరియస్‌గా మొహం పెట్టి.

పతిగారికి పొద్దున్న పట్టాభి చెప్పినవిషయం జ్ఞాపకం వచ్చింది. ఆయన రెండునిముషాలు మాటాడలేదు. తరవాత నెమ్మదిగా అన్నారు, “చూడు, రమాకాంత్, నీ అంతట నువ్వొచ్చి కదుపుతున్నావు కనక అడుగుతున్నాను.”

“దానికేం, అడగండి.”

“నువ్వసలు కస్తూరిని చేసుకోవాలనుకోడానికి కారణం ఏమిటి?”

“చంపేశారు మాష్టారూ! ఫండమెంటల్సులోకి వెళ్లిపోయారు. ఏ శిఖిపింఛమౌళో, సీతామనోభిరాముడో దిగి వచ్చి, థీసిస్ రాయవలసిన విషయం అది. అల్పుణ్ణి, నేనేం చెప్పగలనండీ?”

“అది కాదోయ్,”

“ఓ విధమయిన మమకారం అనుకోండి. ఈఊళ్లో పుట్టి పెరిగినవాణ్ణి. కస్తూరిని నాకు పన్నెండేళ్లుగా తెలుసు. మీరు మరోలా అనుకోకండి. తెలుసు అంటే తెలుసు. అంతే.” అని ఓ క్షణం తటపటాయించి, మళ్లీ అన్నాడు, “మీరు ఈ కేసుకి పనికొస్తుందనుకుంటే మరొక విషయం కూడా చెబుతాను. నాకు పట్టాభిని కూడా తెలుసు,” అన్నాడు చివరివాక్యం రెడ్ ఇంకుతో అండర్లైను చేసినట్టు ఒత్తి పలుకుతూ.

రెండు నిముషాలు ఈదురుగాలి కసకస శబ్దం చేసి వెళ్లిపోయింది.

“సరే, రేపు వెళ్లి మాటాడతాను,” అన్నారు పతిగారు.

“వస్తానండీ, పట్టాభికి మీమాటమీద గౌరవం అని నాకు తెలుసు. అందుకే నేనిక్కడికి వచ్చేను. మీకు విషయం తెలియజేశాను. ఇహ మీదయా, దైవేచ్ఛాను!” అని రమాకాంత్ నమస్కరించేడు.

“మంచిది, వెళ్లిరా,” అని లేస్తూ ఇంకా అక్కడే నిలుచున్న రమాకాంత్‌ని చిత్రంగా చూశారు.

ఆ చూపు అర్థం అయినట్టు, రమాకాంత్, “నమస్కరిస్తే దీవిస్తారనుకున్నాను,” అని నవ్వేసి వెళ్లిపోయాడు.

పతిగారు కూడా నవ్వుకుంటూ లోపలికి నడిచారు, “రాధేశ్యాం, రాధేశ్యాం,” అనుకుంటూ.

“మళ్లీ ఇతగాడెవరు కస్తూరంటున్నాడు?” అని ప్రశ్నించింది వరలక్ష్మమ్మ.

“మరోపాత్ర అనుకో ఈ నాటకంలో. కస్తూరి అనే చిన్నదాన్ని రక్షించడానికి పట్టాభికి పోటీగా వచ్చిన ఉపకథానాయకుడు.”

''వాళ్ల పాట్లేవో వాళ్లు పడతారు. మీరూరుకుంటే సరి,'' అందావిడ.

''నువ్వు నన్ను రక్షించడానికి ప్రయత్నిస్తున్నావా?''

''అవును, రక్షణకైనా, శిక్షణకైనా మీరే తగుదురు కానీ నేనెంతటిదాన్ని,''

పతిగారు అలవాటుననుసరించి, నవ్వుకుంటూ పక్కగదిలో పక్కమీద వాలిపోవడంతో అక్కడికా అధ్యాయం ముగిసింది. ఏ రోజెలా ఉంటుందో చెప్పలేం. ఒక్కరోజులో ఎంత కథ నడిచింది అనుకుంటూ విస్తుపోయారాయన.

సాయంత్రం నాలుగయింది పతిగారు నిద్ర లేచేసరికి. లేచి స్నానం చేసి, కాఫీ తాగి బయల్దేరుతుంటే, వరలక్ష్మమ్మ, ''మళ్లీ బయల్దేరారు? మళ్లీ అర్ధరాత్రిదాకా దర్శనం లేనట్టేనా?'' అంది రూక్షణంగా.

''ఏం? అర్ధరాత్రి వస్తే తలుపు తీయవా?'' అని, ఆవిడమొహం కెంపుచాయ తిరగడం చూసి, ''లేదు బీచికి వెళ్తున్నా. చీకటి పడకముందే వచ్చేస్తా,'' అని చెప్పి వెళ్లిపోయారు.

ఆయన మళ్లీ వచ్చేసరికి చీకటి పడింది. దీపాలు పెట్టేరు. గేటు తీసుకుని లోపలికొస్తుండగా, వరలక్ష్మమ్మతోపాటు నడవలో మరొక అమ్మాయి కూడా కనిపించింది. ఈ వేళప్పుడు ఇంటికి వచ్చే ఆడపిల్లలెవరై ఉంటారా అనుకుంటూ లోపలికి ప్రవేశించారు.

''అదుగో, ఆయనా వచ్చేరు,'' అని వరలక్ష్మమ్మ ఆయనరాక ప్రకటించడంతో వెనక్కి తిరిగి చూసింది తులసి.

తనని చూసి లేవబోతున్న తులసిని వారిస్తూనే, ''ఎంతసేపయింది వచ్చి. ఇలా వచ్చేవేం?'' అని పలకరించేరు.

''మీరూ అటు వెళ్లగానే ఈ పిల్ల ఇలా వచ్చింది. మాష్టారొచ్చేవరకూ కూచుంటానులెండి అంటూ కూచుంది,'' అంది వరలక్ష్మమ్మ తులసి తరఫున వివరణగా.

''అయ్యో, చాలాసేపు కూచోపెట్టేశానే,'' అని సంతాపం వెలిబుచ్చారు పతిగారు.

''ఫరవాలేదులెండి మాష్టారూ, ఇంటిదగ్గర నాకోసం ఎదురు చూసేవాళ్లెవరూ లేరులెండి,''

చివరివాక్యం వృద్ధదంపతులనిద్దరినీ నిశ్చేష్టులని చేసింది. "అదేమిటమ్మా అలా అంటున్నావు?" అన్నారు ఇద్దరూ ఒక్కమారే కూడబలుక్కున్నట్టు.

"అవును మాష్టారూ! పొద్దున్న మీరు వచ్చి వెళ్లింతరవాత ఇంటిదగ్గర చాలా గొడవే జరిగింది. మీతరవాత పట్టాభి మామయ్య వచ్చి కస్తూరిని నానా చీవాట్లూ వేశారు. అమ్మ కూడా అక్కయ్యనే అంది. మీకు తెలియదు కానీ మాఇంటికి రమాకాంత్ అని ఒక అబ్బాయి వస్తూంటాడు. అతన్ని రానియ్యవద్దని మామయ్య వాదన. అక్కయ్యకి నిజానికిపేమీ తెలీదు.

ఇవాళ పొద్దున్న మీరు చెప్పినమాటలు మనసులో నాటుకున్నాయి. మావయ్య గట్టిగా కేకలెయ్యడంతో ఒళ్లు తెలీనిక్షణంలో, క్షమించండి మాష్టారూ, కనీసం నేనలా అనుకుంటున్నా - పిచ్చిగా మావయ్యని పెళ్లి చేసుకోడానికి నిర్ణయించుకున్నట్టు అక్కయ్య ప్రకటించేసింది. నాకంటె పెద్దది కనక నేనేం చెప్పలేకపోయాను. అమ్మ అదేదో ఘనకార్యం చేసినట్టు పొంగిపోతూంది. అదయేక, నామీదకి తిరిగేరు. అదెక్కడో లైబ్రరీలో సార్టరుగా చేరమని. నేను చేరనన్నాను. నాన్నగారు నన్ను యమ్.బి. చదివిస్తాననేవారు. చదవాలని నాకూ ఉంది. ఎలాగో అయిదేళ్లు కష్టపడితే, నాతమ్ముళ్లని పెద్దచదువులు చదివించవచ్చు. అంతే కానీ, నేను 60 రూపాయల ఉద్యోగంలో చేరి, నాతమ్ముళ్లని 40 రూపాయల ఉద్యోగంలో చేర్పించి, అందరం ఓ ఒడ్డున పడ్డాం అని చేతులు కడుక్కోడం నాకు చేతకాదు. నాకది ఇష్టం లేదు అన్నాను. దాంతో, అమ్మా, మావయ్యా నన్ను నోటికొచ్చినట్టు తూలనాడేరు. నాన్నగారు దాచిపెట్టిన ఆస్తులేం లేవన్నారు. నేను స్వార్థం చూసుకుంటున్నాను అన్నారు. కానియ్యండి, మాష్టారూ, ఇలాటి మాటలకి భయపడి నేను నానిశ్చయాన్ని మార్చుకోలేను. మీరు చెప్పండి, మాష్టారూ, నాదా తప్పు? గవర్నమెంటు బోలెడు స్కాలర్‌షిప్పులు ఇస్తోంది. కనీసం లోన్ వచ్చినా ఎలాగో అయిదేళ్లు గడపొచ్చు. మీరు చెప్పండి, నేను చెప్పింది కరెక్టు కాదూ?"

వెంకటపతిగారు ఈ ఆడపిల్ల మనోధైర్యానికి అబ్బురపడుతూ, "కరెక్టేనమ్మా!" అన్నారు మెల్లిగా.

"అందుకే వచ్చేశాను, మాష్టారూ, నాకు తెలుసు. నానిర్ణయాన్ని హర్షించేవారెవరైనా ఉంటే మీరేనని. అమ్మతో చెప్పేను. ఇంతటి విశాలవిశ్వంలో నాకోరిక నెరవేర్చుకునే దారి

దొరక్కపోదు. ఎలాగైనా యం.బి.బి.యస్ చదువుతాను. అది పూర్తయేకే ఇంటికి వస్తాను. అప్పుడైనా రానివ్వరా?''

పతిగారు నవ్వడానికి ప్రయత్నిస్తూ, ''ఆవేశపడుకు, తులసీ. అన్నీ సవ్యంగా జరుగుతాయి. నీకు తప్పకుండా స్కాలర్‌షిప్పు వస్తుంది. పద. ఇంటిదాకా దిగబెట్టి వస్తాను,'' అన్నారు చెప్పులు తొడుక్కుంటూ.

''మాష్టారూ!''

''మరేఁ ఫరవాలేదు. నేనున్నాను కదా, పద.''

000

ఆ రాత్రి భోజనం ముగిస్తూ, వెంకటపతిగారు భార్యతో, ''రేపు పొద్దున్న జ్ఞాపకం చెయ్యి. ఆ స్కాలర్‌షప్ సంగతి కనుక్కుంటాను,'' అన్నారు.

''పెద్దపిల్లకయింది, ఇహ ఈ పిల్లకా?'' అంది వరలక్ష్మమ్మ ఎత్తిపొడుపుగా.

''నీదృష్టిలో కస్తూరి బుద్ధిమంతురాలు. నాదృష్టిలో తులసి ధీమంతురాలు.''

''అంటే కస్తూరి తులసిలా తిరగబడలేదని?''

''గుణదోషాలెంచడానికి మనమెవరం వరలక్ష్మీ? నేను అన్నదల్లా తులసి స్వయంనిర్ణీత అన్నాను. అదే నీకు దోషమయింది. నాకు సుగుణం అయింది. కస్తూరిలో దేన్ని నువ్వు సుగుణం అనుకుంటున్నావో దాన్నే నేను వ్యక్తిత్వంలో లోపం అనుకుంటున్నాను, అంతే.

000

(సాహితి. 1964-65 ప్రాంతాల్లో ప్రచురితం)

# 20. ఆడమనసు

గరల్ స్కూల్ టీచరు రవణమ్మ సిగ్నల్ పోస్టుదగ్గర ఆగిపోయిన రైల్లో థర్డుక్లాసు కంపార్ట్‌మెంటులో లోకానికీ తనకీ మధ్యనున్న సూక్ష్మాతిసూక్ష్మమయిన సంబంధంగూర్చి ఆలోచిస్తూ కూచుంది. కంపార్ట్‌మెంటులో పాలవాళ్లూ, పిల్లలూ, పిల్లలు గల తల్లులూ - అన్నిరకాలవాళ్లూ తలో రకంగా విచారిస్తున్నారు. ఈ బండీ ఎప్పుడూ ఇంతే. ఉన్న స్టేషన్లు చాలనట్టు నాలుగేసి మైళ్లకో హాల్టు పెట్టేరు. అదీ చాలనట్టు ఈ సిగ్నలుపోస్టుదగ్గర ఓమారు మొక్కు తీర్చుకోందే ముందుకు కదలదీ బండీ.

బటానీలు కొనమని పిల్లలేడుస్తున్నారు. పిల్లలఏడుపు చూసి, బఠానీలవాళ్లు రెట్టించి అరుస్తున్నారు. సీటుకోసం పేచీల్లేని మగాళ్లు రైలు దిగి పచార్లు చేస్తున్నారు కులాసాగా. టికెట్ లేనివాళ్లూ, సామానులేనివాళ్లూ రైలుదిగి నడిచి వెళ్లిపోతున్నారు.

రవణమ్మ మటుకు ఇవేమీ ఆలోచించడంలేదు. కిటికీలోంచి దూరంగా ఏరాడకొండ, కొండమీద లైటుహౌసూ, కొంచెం ఇటువైపుగా సున్నపుబట్టిల్లా గుండ్రంగా కాల్టెక్స్ ఆయిల్ రిఫైనరీ కనిపిస్తున్నాయి. మీద ఆకాశం మబ్బులు పట్టివుంది.

కంపార్టుమెంటులోకి చూసింది రవణమ్మ. ఎదురుసీటుమీద గుక్కపట్టి ఏడుస్తున్న పిల్లని ఊరుకోబెట్టడం ఎలాగో తెలీక ఏడుపు మొహం పెట్టిన అమ్మాయి కనిపించింది. రవణమ్మ ఆర్ద్రంగా చూస్తూ వుండిపోయింది. ఆ అమ్మాయికి మహా వుంటే పదిహేను వుంటాయి. ఆ పాపకి ఏడాది దాటినట్టుగానే కనిపిస్తోంది. రవణమ్మదృష్టి ఆకాశంమీదికి మళ్లింది. ఇలాటి సంఘటననేమో బసవరాజుగారు మనోహరంగా వర్ణించారు, "ఆకాశమధ్యాన అటనొక్క చిరుమబ్బు ... "

రవణమ్మ ఉలికిపడింది. "పాట పాడనా అండీ?" అని అడిగి మరీ పాడేవాడు మురళి. ఇదే పాట. ఎక్కడ వున్నాడో!

రవణమ్మదృష్టి రైలు పక్కనే పచార్లు చేస్తున్న కూలిజనంమీద పడింది. మురళివాళ్లలో ఉన్నా ఆశ్చర్యం లేదు. ఏ జేబుదొంగగానో ప్రసిద్ధికెక్కినా, ఏగుంపులోనో తన్నులు తింటూ ఉన్నా విచారపడవలసిందే కానీ ఆశ్చర్యపడనక్కర్లేదు.

000

రవణమ్మ కళ్లలో మెదిలాడు ఆనాటి మురళి - పన్నెండేళ్లవాడు, పచ్చగా రాజపుత్రుడిలా వుండేవాడు. పదేళ్లవుతోంది కాబోలు ఇదే ట్రైనులో ఇలాగే తను ప్రయాణం చేస్తోంది. ఆరోజు ఇలా జనం లేరు. మురళీ, మరో ఇద్దరు మగవాళ్లూ, ఓ ముసలాయనా వున్నారు. ఆవేళ తను అనకాపల్లినించి వస్తోంది. ఎందుకనో విపరీతంగా తలనొప్పి వచ్చింది. చిన్న చలికూడా వున్నట్టు తనకి అనుమానం. ఆవేళా ఇలాగే రైలు సిగ్నలుపోస్టుదగ్గర ఆగిపోయింది. అధికమాసంలో దుర్భిక్షంలా. కణతమీద మోచెయ్యి తగిలినట్టయి, "అబ్బా" అంది వేళ్లతో కణతలు నొక్కుకుంటూ.

"అయ్యో, పొరపాటున తగిలిందండీ. గట్టిగా తగిలిందాండీ?" అన్నమాటలు విని రవణమ్మ అటు చూసింది. అప్పటిదాకా తనపక్కన ఎవరున్నారో చూడసేలేదు.

దబ్బపండుఛాయలో, గుండ్రటిమొహం, సన్నగా పెన్సిలుతో గీసినట్టున్న కనుబొమ్మలూ, స్థిరంలేని నల్లని కనుపాపలూ - ఆడపిల్ల మొహం - అనుకుంది రవణమ్మ, తనలో తను చిన్నగా నవ్వుకుంటూ.

"అది కాదండీ. మీదని సంచి పడిపోయేట్టుగా వుంటే వెనక్కి తొయ్యడానికి చెయ్యి ఎత్తితే మీకు తగిలిందండి. గట్టిగా తగిలిందాండీ?"

రవణమ్మ నవ్వుకుంది. "లేదులే" అంది దీనాతిదీనంగా వున్న అతనిమొహం చూస్తూ. అందేకానీ నుదుటిమీదనించి చెయ్యి తియ్యసేలేదు. దానికి సమాధానం చెప్పాలనిపించింది అబ్బాయికి. "తలనొప్పిగా వుంది. వెధవరైలు ఎప్పటికి కదుల్తుందో."

"నాదగ్గర అమృతాంజనం వుంది, రాయమంటారా?"

"వద్దు. అదే పోతుంది." అంది రవణమ్మ కించిత్తు చకితురాలై.

“లేదండీ. నిజంగానే అమృతాంజనం రాసుకుంటే ఇట్టే పోతుంది.  మాఅన్నయ్య కూడా ఇలాగే అంటాడు. వెంటనే నేను అమృతాంజనం రాస్తాను. అయిదునిముషాల్లో తగ్గిపోతుంది. కావలిస్తే చూడండి.”

రవణమ్మకి అమృతాంజనంకంపెనీ ఏజంటుకంటే సిన్సియరుగా ప్రాపగండా ఇస్తున్న ఆ కుర్రాణ్ణి చూస్తే ఏమనాలో తెలీలేదు. అప్పుడే అడిగింది, “చదువుకుంటున్నావా?” అని.

ఫోర్తుఫారం చదువుతున్నాట్ట. వాళ్లమ్మ, నాన్నగారు, తమ్ముళ్లు, చెల్లెళ్లు అంతా అనకాపల్లిలో వున్నారుట.

“విశాఖపట్నంలో మీరెక్కడ వుంటారండీ?” అని అడిగేడు.

రవణమ్మ చెప్పింది, “మునిసిపల్ గరల్సు హైస్కూలికి దగ్గరగానే చిన్నసందులో ఎత్తరుగులమేడ. అందులో ఒకగది అద్దెకి తీసుకుని ఉంటున్నదట.

రైలు దిగేక ఆ అబ్బాయి రవణమ్మసంచీ తనే పట్టుకుని రిక్షా ఎక్కించి పంపించేడు.

“ఎంత మప్పితం” అనుకుంది రవణమ్మ.

అయినా మర్నాడు సాయంత్రంవేళ తలుపు తీసేసరికి ఎదురుగా నిలబడివున్న మురళిని చూసి ఆశ్చర్యపడకపోలేదు.

“రా,” అంది రవణమ్మ లోపలికి నడుస్తూ.

మురళి చనువుగా లోపలికి నడుస్తూ, “మీయిల్లు బాగుందండీ. మాయిల్లు ఇంతకన్న పెద్దదే అయినా నానాకంగాళీగా వుంటుందండీ. ఎక్కడపడితే అక్కడ బట్టలూ, బ్లేడ్లూ అవీ ..”

రవణమ్మకి నవ్వొచ్చింది. “మాయింట్లో ఎలా వస్తాయి బ్లేడ్లు,” అంది.

మురళి నవ్వలేదు. “అది కాదండీ. మాచెల్లెలుందా. అదన్నా ఇలా నీటుగా వుండదు. ఇంటినిండా బట్టలూ, కాయితాలూ, మన్నూ వుంటాయి. .. ఏం చేస్తున్నారు? వంట అయిపోయిందా? ఏంకూర? మరి మీకు కొబ్బరిపచ్చడి చెయ్యడం వచ్చా?”

రవణమ్మ అన్ని ప్రశ్నలకీ ఓపిగ్గా జవాబులు చెప్పింది. “నువ్వు ఎలా చేస్తావు?” అని అడిగింది.

మురళి కొబ్బరిపచ్చడి తను కొత్తగా కనిపెట్టి తయారుచేసినంత ఘనంగా చెప్తూంటే వింటూ కూర తరుక్కుంది. పదినిముషాలు కూచుని, మురళి "వస్తానండి" అంటూ లేచాడు.

"కూర్చో. వెళ్లి ఏంచేస్తావు?" అంది.

"మాఅన్నయ్య తంతాడండీ. నే చెప్పలేదు ఇక్కడికి వస్తానని."

రవణమ్మ తెల్లబోయింది. "ఇక్కడికా? ఏంవని చెప్పడం?"

"ఏంవనీ చెప్పనండీ. అదికాదండీ. నిజంగా తన్నడండీ. మరి నేనిలా ఎక్కువగా వాగుతాను కదండీ. చెప్పేవీ చెప్పకూడనివీ అన్నీ వాగేస్తాననీ ఎక్కడికీ వెళ్లొద్దంటాండీ."

రవణమ్మ ఈమారు నవ్వకుండా వుండలేకపోయింది. "వాగుతున్నానని తెలిసినప్పుడు నోరు కొంచెం కట్టుకోలేవూ?"

"వీల్లేదండీ. మర్చిపోతాను. అయినా మీరు కనక ఇలా మాటాడేశాను కానీ అందరిదగ్గిరా ఇలా మాటాడతానేంటండీ?"

మంచివాడే అనుకుంది రవణమ్మ మురళి వెళ్లిపోయేక.

ఆతరవాత మురళి దాదాపు రోజూ వచ్చేవాడు. పొద్దున్నో మధ్యాన్నమో సాయంత్రమో ఏదో ఒకవేళ వచ్చేవాడు. ఒకొకప్పుడు స్కూలునించి మధ్యాన్నం లీజరువేళప్పుడు ఏ ఫ్రెండుసైకిలో తీసుకువచ్చి చూసి వెళ్లిపోయేవాడు. "తినడానికేమైనా వుందాండీ?" అంటూ అన్ని గూళ్లూ డబ్బాలూ వెతికేసి ఏదైనా వుంటే తినేసి వెళ్లిపోయేవాడు.

ఒకమారు "మూడు నయాపైసలుంటే ఇవ్వండి," అన్నాడు.

"ఎందుకూ?" అంది రవణమ్మ.

"అదికాదండీ. నాదగ్గర ఇరవైరెండు నయాపైసలున్నాయి. మరోమూడు కలిపితే పావలా అయిపోతుంది కదండీ," అన్నాడు.

"మరో ముప్పావలా కలిపితే రూపాయి అవుతుందేమో," అంది రవణమ్మ.

"అవుతుందనుకోండి. మరి మీరు మూడు పైసలయితే ఇస్తారు కానీ ముప్పావలా ఇస్తారా?"

‘‘ఇవ్వను,’’ అంది రవణమ్మ పర్సులోంచి విచ్చుపావలా తీసి ఇస్తూ. మురళి అది తీసుకుని తనదగ్గిరున్న ఇరవైరెండు పైసలూ ఆవిడకిచ్చేసి వెళ్లిపోయేడు.

రవణమ్మ ఆతరవాతినించీ ఏది చేసుకున్నా మురళికి దాచి వుంచడం అలవాటయింది. ఒకమారు అలాగే పనసముక్కలు దాచి వుంచింది కానీ మూడు రోజులయినా మురళి రాలేదు. రవణమ్మకి ఆ ముక్కలు తినబుద్ధి పుట్టలేదు. పారేయబుద్ది పుట్టలేదు. నాలుగోనాడు మురళి వచ్చేవేళకి అవి బూజు పట్టిపోయేయి.

ఇన్నాళ్లూ రాలేదేం అంటే ‘‘మా అమ్మ వచ్చిందండీ,’’ అన్నాడు జేబులోంచి ఓ జామపండు తీసి ఇస్తూ.

‘‘ఇదెందుకూ?’’ అంది రవణమ్మ.

‘‘తినడానికండీ. మీరెప్పుడూ జాంపండు తినలేదాండీ? చాలా బాగుంటుందండీ. కావలిస్తే తినిచూడండి,’’ అన్నాడు మురళి ‘‘కత్తి, కత్తి’’ అంటూ చాకుకోసం అటూ ఇటూ చూస్తూ.

‘‘మీ అమ్మగారు ఉన్నారా?’’ అంది రవణమ్మ జాంపండు ముక్కలు కోస్తూ.

‘‘ఉండకపోతే ఎలా వస్తుందండీ?’’

‘‘అది కాదోయ్. ఇప్పుడు ఇక్కడ వున్నారా, అనకాపల్లి వెళ్లిపోయారా అనడిగితే అలాటి అర్థం తీస్తావేం?’’ అంది రవణమ్మ కోపంగా.

‘‘అదేంటండి నేనేం కొత్తగా తీసేసేంటండీ ఆ అర్థం. పోనీ మీరు అలాగే అడక్కూడదా?’’ అన్నాడు, శ్లేషభాష ఎరగని పసివాడిలా.

రవణమ్మ మాట్లాడలేదు.

‘‘ఏమండీ! ఓ పాట పాడనా?’’ అడిగేడు మురళి.

‘‘వద్దులే,’’ అంది రవణమ్మ దరహాసంతో.

‘‘కాదండీ. నిజంగానే నేను పాడగలనండీ.’’

‘‘గ్రూపులోనా?’’

‘‘కాదండీ. ఒక్కడినే పాడతాను. ఎంతోమంది మెచ్చుకుంటారు కూడా.’’

‘‘అంతటి స్వోత్కర్ష కూడదోయ్,’’ రవణమ్మ అంది మందలిస్తున్నట్టు.

‘‘సరేలెండి. మీకు తెలీదు. నేఁ చెప్తే వినరు. తరవాత ఎప్పుడేనా అందరూ నాపేరు చెప్పుకుంటుంటే అప్పుడు మీరే నువ్వు పాడతావని నాకెందుకు చెప్పలేదూ అని అడుగుతారు. అప్పుడు చెప్తాలెండి,’’ అనేసి వెళ్లిపోయేడు.

మర్నాడు మురళి ఒక ఉత్తరం తీసుకొచ్చి రవణమ్మ చేతికిచ్చాడు ‘‘వెళ్లనాండీ?’’ అని అడుగుతూ.

అది ‘‘మీరు సినిమాస్టారు కాదల్చుకున్నారా?’’ అంటూ ఇంగ్లీషులో లేక హిందీలో ఉత్తరాలు రాయమనే ఒక బోగస్ సినీ కంపెనీది.

‘‘మీ అన్నయ్య ఏమన్నారు?’’ అంది రవణమ్మ.

మురళి వాళ్లన్నయ్యకి చెప్పలేదన్నాడు.

రవణమ్మ ఉత్తరం మళ్లీ మురళికి ఇవ్వలేదు. ముక్కలుచేసి కుంపటిలో పడేస్తూ, ‘‘ఇంకెప్పుడూ ఇలాటి వేషాలు వెయ్యకు. ఈ కంపెనీలన్నీ నిజంగా నిన్ను నాగేశ్వరరావుగానో, రాక్ హడ్సనుగానో చేసేస్తాయనుకుంటున్నావు. అలా అయితే ఈపాటికి ప్రతివాడూ సినిమాస్టారే అయిపోను. అయినా మీఅన్నయ్య నిన్ను డబ్బుపెట్టి చదివిస్తూంటే నిక్షేపంలా చదువుకోక నీకిదేంబుద్ధి?’’ అంది.

మురళి బిక్కచచ్చిపోయి. ‘‘అదికాదండీ. నేను పాడతాను,’’ అన్నాడు.

రవణమ్మ మురళిని పాడమని ‘‘కాని కొంచెం మెల్లిగా పాడు. మేడమీద చదువుకునే స్టూడెంట్లున్నారు. పక్కభాగంలో పసిపిల్లలున్నారు,’’ అంది.

మురళి గళం విప్పి పాట మొదలుపెట్టేక రవణమ్మ విచారించింది అలా అన్నందుకు. మురళి నిజంగా పాటగాడే!

ఆతరవాత కూడా మురళి మామూలుగానే వస్తూ వుండేవాడు రవణమ్మ ఇంటికి. ఎన్నోమార్లు రవణమ్మకి మురళిమీద కోపం వచ్చింది. ఎన్నోమార్లు విసుక్కుంది. కసురుకుంది. మనిషికి అంత గ్రిట్ వుండకూడదు అనుకుంది. మురళి మటుకు మనసులో

ఏమనుకున్నాడో రవణమ్మకి తెలీలేదు. కానీ పైకి మటుకు నాలుక తిరిగినట్టు వాగేవాడు. అలిగి వెళ్లిపోయేవాడు. "నాకు గతిలేక మీయింటికి వచ్చేను," అన్నాడు ఒకరోజు.

రవణమ్మ మనసులోనే బాధ పడింది. ఆతరవాత అతన్ని ఏమీ అనేదికాదు.

మురళి మటుకు ఆవిడని వూరుకోనిచ్చేవాడు కాదు. కవ్వించి రెండుమాటలు అని నాలుగుమాటలు పడి కానీ ఊరుకునేవాడు కాదు.

రెండేళ్లు గడిచిపోయేయి. మురళి ఫిఫ్తుఫారం ఫెయిలయేడు. సరిగ్గా చదవడంలేదని వాళ్లన్నయ్య చావగొట్టేట్ట.

మురళి సాయంత్రం రవణమ్మయింటికి వెళ్లేడు, "నేను వెళ్లిపోతున్నానండి."

"ఎక్కడికి? మరి చదవ్వా?" అని అడిగింది రవణమ్మ.

"రాదండీ నాకు చదువు. ఇంటికెళ్లిపోతాను," అన్నాడు మురళి.

మురళి వెళ్లిపోయిన రెండునెలలకి ఒక ఉత్తరం వచ్చింది రవణమ్మకి. పోస్టుకార్డు. రవణమ్మ నవ్వుకుంది my dear sisterly Ravanamma garu అన్న సంబోధన చూసి. ఉత్తరంలో విశేషాలేం లేవు. తాను క్షేమం. మళ్లీ స్కూల్లో చేరాట్ట. జవాబివ్వమని తన ఎడ్రెసు ఇచ్చాడు. ఏనాడూ ఎవరికీ ఉత్తరాలు రాయడం అలవాటు లేని రవణమ్మ ఆకార్డు పారేసింది. మురళికి ఓ కార్డు దొరికి కొత్తగా ఉత్తరం రాయడం నేర్చుకుని, ఎవరికి రాయాలో తెలీక తనకి రాశాడు అనుకుంది

ఉత్తరం చించిపారేసినా మురళిని మర్చిపోలేదు. ఎన్నిమాట్లో అనుకుంది మురళి ఏంచేస్తున్నాడో అని. ఏ మగపిల్లవాడైనా కనిపిస్తే మురళేమోనని తిరిగిచూసేది. మురళి మటుకు మళ్లీ ఏవుత్తరమూ రాయలేదు. మనిషి కనిపించలేదు.

000

ఈవేళ మురళి ఏం చేస్తుంటాడో అని ఆలోచిస్తున్న రవణమ్మ పాతికేళ్ల కుర్రాడొకడు మరొక సమవుజ్జీతో సిగరెట్లు కాలుస్తూ ఇంజినువేపు వెళ్లడం చూసి, "మురళీ," అంది అప్రయత్నంగానే.

మురళి చటుక్కున సిగరెట్ దాచేసి, "ఏంవండీ, మీరా?" అన్నాడు.

"నువ్వేం చేస్తున్నావు?" అనడిగింది మోటు దేరిన ఆ మొహం చూస్తూ.

"ఏ.యస్సంగా వున్నానండీ. కాంటాబాంజీలో వేశారు." అన్నాడు. "మీరు అక్కడే వున్నారా?" అనడిగేడు.

"ఆఁ" అంది రవణమ్మ.

ఆ తరవాత ఏం మాటాడాలో ఇద్దరికీ తోచలేదు.

"వస్తానండీ," అన్నాడు మురళి.

"ఆఁ" అంది రవణమ్మ.

"ఎవర్రా?" అనడిగిన స్నేహితుడితో, "ఇక్కడ వాల్తేరులో వుండేదిలే రవణమ్మ అనీ" అన్నాడు మురళి నిర్లక్ష్యంగా సిగరెట్టు విసిరేస్తూ.

వెళ్లిపోతున్న మురళిమీంచి రవణమ్మ చూపులు బలవంతాన శూన్యంలోకి మరల్చింది. ఎన్నిమారు పేరు తన్నలేదు ఈ శిశిరశీతవాతశర్వదాశాలత ....

అప్రయత్నంగా వెలువడిన నిట్టూర్పొకటి బరువుగా కదలిన ఇంజనుకూతలో కలిసిపోయింది.

000

(1965-6 ప్రాంతంలో రచన పత్రికలో తొలి ప్రచురణ.)

# 21. విషప్పురుగు

నన్ను ముత్యాలపేట జిల్లా పరిషత్తు హైస్కూలికి బదిలీ చేశారని తెలిసినప్పుడు, నన్ను తెలిసినవాళ్లందరూ విచారించారు.

"మంత్రిగారి మేనల్లుడుగారి తోటమాలి రికమెండేషనే ఔగాక, తోటమాలికొడుకు ఈఊరే ఎందుకు కోరుకోవాలి? కోరుకున్నాడు పో. మిమ్మల్ని ముత్యాలపేటకే తోలనేల?" అంటూ రుసరుసలాడేరు మునసబుగారు.

"పోన్లెద్దురూ. మీరు నాయందున్న అభిమానంచేత ఈవిధంగా నొచ్చుకుంటున్నారు. కానీ అక్కడున్నది మాత్రం మనుషులు కాదుటండీ. కాకపోతే కాస్త ఆవేశంపాలు ఎక్కువే కావొచ్చు. నాకు మాత్రం లేదూ రోషం? నిజానికి ఏవరేజి కంటె ఎక్కువే కదండీ నాకు," అన్నాను నవ్వుతూనే, వాళ్లు నాయందు చూపుతున్న అభిమానానికి రిచ్చవడుతూనే.

"అదేనండీ మాభయం కూడాను. మీరేమో ముక్కుకి సూటిగా పోయేకోవకి చెందుతారు. ముత్యాలపేటలో మనుషులు ముత్యాలలాంటి వాళ్లు కాదండీ. కడప నాపరాళ్లలాటి వాళ్లు. మీరు మరీ అంత నిక్కచ్చిగా ఉన్నారంటే ..." ఆపైన జరిగేది తలుచుకోడానికే భయపడినట్టు ఆగిపోయేడు ఫస్టసిస్టెంటు రఘునాథరావు.

"శివాజీల వంశంలోనుంచి వచ్చినవాడివి. నువ్వు బెదిరిపోవడమే కాక నాకు కూడా పిరికితనం నూరిపోస్తావా?" అని సన్నగా అతన్ని చీవాట్లు పెట్టి, మొత్తమ్మీద వారందరిదగ్గిరా శలవడిగి పుచ్చుకుని ముత్యాలడొంక దారి పట్టాను.

బండిలో కూర్చుని వెనక్కి పోతున్న ఊరుని మసకబారిన కళ్లతో చూస్తుంటే, ఆ బంధం ఎంత గట్టిదో తెలిసినట్టయింది.

నేను ఫలానా బస్సుకొస్తున్నానని ముందే కలగన్నారేమో ముగ్గురు టీచర్లు, ఇద్దరు ఎటెండర్లు, ప్యూనుతో సహా బస్సుదగ్గరకొచ్చేశారు. పరస్పరం పోల్చుకోడానికి అరక్షణం కూడా

పట్టలేదు. సీనియారిటీప్రకారం తమతమ గోత్రనామాలు నివేదించుకున్నాక, బసకి బయల్దేరేం. నా అలవాటుననుసరించి రెండో మూడో అక్షరాల పొడిమాటలతో వాళ్లని వాగిస్తూ, నాపాటికి నేను అంచనా వేయసాగాను. నా అంచనాలకి పావుగంట కాలం సరిపోయింది. అరగంట దాటకుండా, వారికి శలవిచ్చి పంపేయడం సాధ్యమయింది.

మర్నాడు స్కూలికి వెళ్లేసరికి అందరూ ఆతృతగా ఎదురు చూస్తూ కనిపించేరు. నేను మాటాడకుండా వారివారి క్లాసులకి పొమ్మని పంపేశాను. పదిగంటలు దాటి పది నిముషాలు అయినతరవాత ప్యూను ఎటెండెన్సు రిజిస్టరు తీసుకుని వచ్చి నాబల్లమీద పెట్టేడు. నేను అందరి సంతకాలూ సరి చూసుకుని, నా సంతకం పెట్టబోతుండగా, ఆఖరిపేరుదగ్గర సంతకం కనిపించలేదు.

"రోశయ్య రాలేదా?" అనడిగేను తలెత్తి చూస్తూ.

"నేనేనండీ రోశయ్యని" అన్నాడు రిజిస్టరు తెచ్చిన ప్యూను.

ఆలస్యంగా - అంటే అదే అప్పుడే - వచ్చేడు. తన నిజాయితీకి నిదర్శనంగా ఆలస్యం అయినసంగతి నాతో చెప్పి సంతకం పెట్టదలుచుకున్నాడు.

"ఎందుకు ఆలస్యంగా వచ్చేవు?" నేను ప్రశ్నించేను. కోరి సంజాయిషీ ఇవ్వదల్చుకున్న ముద్దాయిని ఆ మాత్రం ప్రశ్నించకపోతే ఎలా మరి?

"లేటయిందండి" అన్నాడు రోశయ్య.

"అదేనోయ్. ఎందుకు లేటయిందీ అనడుగుతున్నాను," అన్నాను చిరాగ్గా.

"ఆలిస్సెమయిపోయిందండీ."

నాకు చటుక్కున కోపం వచ్చింది. "చూడు, నీ అలవాట్లు ఏమిటో నాకు తెలీవు కానీ నేను మాత్రం సూటి సమాధానాలకీ, క్రమమయిన నడవడికీ అలవాటు పడినదాన్ని. వేళాకోళాలూ, వికృతచేష్టలూ సహించను. ఇంకొకసారి లేటయినా ఆలస్యమయినా శిక్ష అరరోజు కాజువల్ లీవు పోగొట్టుకుంటావు. నీప్రవర్తన తదనుగుణంగా మార్చుకోడం మంచిది," అన్నాను రిజిస్టరు అతనిముందు పడేస్తూ.

రోశయ్య మనసులో ఏమైనా అనుకుని ఉంటే, ముఖంలో మాత్రం తెలియజేయలేదు. నిర్వికారంగా సంతకం పెట్టి, రిజిస్టరు తీసుకుని వెళ్లిపోయేడు.

అయితే అది అంతటితో ముగిసిపోలేదని నాకు అరగంటలోపునే అవగతమయింది. ఆ అరగంటలోనూ నాకు అందించబడిన సందేశాలూ, హితబోధలూ - వాటి సారాంశం నేను రోశయ్యని ఓకంట కనిపెట్టి ఉండడం మంచిదని. భవబంధాలకీ, లౌకికవ్యాపారాలకీ చిహ్నమయిన నియమాలకి వాడు కట్టుబడి ఉండడు. వాణ్ణి మీరు తిట్టినా, ఛార్జిషీటు దాఖలు చేసినా, బేఖాతరుగా తనపని తాను చేసుకుపోతూనే ఉంటాడు. అన్నిటికంటే ముఖ్యమైనవిషయం వాడు పాముల్ని పట్టడంలో దిట్ట. ఆ చుట్టుపట్ల పది, పన్నెండు పల్లెలకీ వీడొక్కడే పాములపాలిట యముడు. పరీక్షిన్మహారాజు మూలమూలల దాక్కున్న నాగసంతతిని యాగం చేసి పట్టేడు. రోశయ్య గారడీ చేసి పట్టేస్తాడు. అంతే తేడా. అంచేత వాడితో తగువుకి తలపడ్డం కొండతో ఢీకొనడమో, కొరివితో తల గోక్కొనడమోగా పరిగణింపబడుతోంది ఆ ప్రాంతాల్లో.

''అటువంటి కాకమ్మకథలు నాకు చెప్పకండి,'' అని సాధ్యమయినంత సౌమ్యంగా చెప్పి వాళ్లని పంపించేశాను. అయితే రోశయ్య మాత్రం రోజూ పది దాటి ఓ రెండు నిముషాలయినా ఆలస్యంగానే కానీ సమయానికి వచ్చేవాడు కాడు. ఏమైనా అంటే, ఎనిమిదిమైళ్లదూరం నుంచి వస్తున్నాననేవాడు. పైగా, ఏరోజుకారోజే వచ్చేవరకూ వస్తాడన్న నమ్మకం లేదు. రానిపక్షంలో శలవుచీటీ అందుతుందన్న భరోసా లేదు.

నేను వాచా చెప్పగలిగినంత చెప్పి చూశాను. ఒకటి, రెండు మెమోలు కూడా ఇచ్చి చూశాను. కానీ రోశయ్య ధోరణిలో మార్పు లేదు. మనిషి కనిపిస్తే మాత్రం అదేదో సామెత చెప్పినట్టు కాలితో చెప్పినపని తలతో చేసేవాడు. నాకు అనుభవంలోకి రాకపోయినా, ఇతర అసిస్టెంట్లు మాత్రం అడపా తడపా ఏదో ఓ కథ తెస్తూనే ఉన్నారు - తాము చెప్పినపని చెయ్యనన్నాడనీ, అసలు అయిపే ఉండడనీ ... ఏదో ఒకటి. నెలయినా తిరక్కముందే నాకు వాడొక పెద్ద సమస్యగా తయారయేడు.

స్కూలికి రావలసిన పార్సిలొకటి అందకపోవడంతో మొదలయింది తగువు.

సాధారణంగా స్కూలు ఉత్తరాలూ, నాఉత్తరాలూ రోశయ్యే పోస్టాఫీసునించి తెస్తాడు. పోస్ట్‌మానవుడు అనేవాడు ఒకడు కలడో లేడో, ఉంటే ఏం చేస్తున్నాడో నాఊహకందని విషయం.

ఓరోజు మధ్యాన్నం ఇంట్లో అతిథులున్నారని ఇంటికి వెళ్లేను. భోజనానికని వెళ్లిన రోశయ్య కూడా మళ్లీ తిరిగి రాలేదని తెలిసింది నాకు. ఆరోజునే స్కూలుకో పార్సిలు తగలడిందిట. అదెప్పుడు తెలిసిందంటే, పోస్టుమాస్టరుగారి కుమారరత్నం ఆ రిజిస్టర్డు పార్సిలుతాలూకూ రసీదుకోసం స్కూలికి వచ్చినప్పుడు. రోశయ్యచేతికి పార్సిలుతోపాటు ఆ రసీదు కూడా ఇచ్చారుట నాచేత సంతకం చేయించుకురమ్మని. క్లర్కునడిగితే రోశయ్య అసలు మధ్యాన్నం స్కూలికి రానేలేదనీ, అంచేత ఆ పార్సిలూ, రసీదూ కూడా లేవనీ చెప్పేడు. వాకబు చేసి, తరవాత ఆ రసీదు పంపిస్తానని ఆ కుర్రాడికి చెప్పి పంపించేశాను.

రోశయ్యకి మెమో ఇవ్వమని క్లర్కుకి ఓ ఆజ్ఞ పడేసేను.

అతను వెనుదిరుగుతూ పెదవి చప్పరించేడు. "ఇలాటివి చాలా తిన్నాడు వాడు. వాడికిదో లెఖ్ఖలోనిది కాదు," అన్నట్టు శిరఃకంపనం చేసేడు.

"నేను చెప్పలేదుటండీ, వాడొక irresponsible fellow," అన్నారు తెలుగు మేష్టరు.

"మీరు ఏదయినా తీవ్రచర్య తీసుకొనకపోయినచో లాభము లేదు," అన్నారు ఇంగ్లీషు మేష్టరు.

హెడ్డు గోతిలో పడ్డందుకు జాలిపడుతూ తలో బెడ్డా విసిరేరు.

"రానియ్యండి," అన్నానేన్ను పళ్లు నూరుతూ.

"జాగ్రత్తండోయ్. వాడు పాములపాలిటా, మనపాలిటా కూడా యముడే," అని వాడి specialtyనీ, పొదలమాటు ప్రమాదాన్నీ పరోక్షంగా తెలివిడి చేశారు డ్రాయింగ్ మేష్టరు.

రోశయ్య మర్నాడు మధ్యాన్నం మూడుగంటలకి వచ్చేడు.

"ఏం, అందరికీ ఆరుగంటలకి తెల్లారితే నీకు మూడుగంటలకి పొడిచిందేమిటి పొద్దు?" అన్నాను కఠినంగా.

"ఇయాల్టికి గూడ లీవు రాసేత్తానండీ," అన్నాడు వినయంగానే.

“నీలీవులెటరు ఒక్కటే ముఖ్యం కాదు. ఇక్కడ పని కూడా జరిగాలి కదా. నిన్నపొద్దున్నే ఎందుకు చెప్పలేదూ మధ్యాన్నం రానని?”

“పొరుగూల్ల ఆల్లు అపటికపుడు పిల్సారండీ పాంవుని పట్టాలని.”

నాకు చటుక్కున headmistressకి రావలసినంత కోపం వచ్చింది. పాముల్ని పట్టడమే ముఖ్యం అనుకుంటే వేరే ఉద్యోగాలు చేపట్టడం ఎందుకు? స్కూల్లో చేరినతరవాత, జీతం పుచ్చుకుంటున్నపుడు, ఇక్కడ మాత్రం పని సక్రమంగా చెయ్యఖ్ఖర్లేదా? ఊళ్లో పనులన్నీ చక్కబెట్టుకుని, తీరికసమయాల్లో స్కూలికి రావడానికి ఇదేమయినా హాబీనా?

రోశయ్య ఒక్కమాట కూడా మాటాడలేదు. చేతులు కట్టుకుని నిల్చుని విన్నాడు.

“నిన్నటి రిజిస్టర్డ్ పార్సిలేదీ?” ఆఖరికి మొదటిప్రశ్నకి వచ్చేను.

“ఈడ్నే మీబల్లమీద ఎట్టేనండీ,” అన్నాడు తొణక్కుండా.

పార్సిలు తెస్తూండగా ఎవరో పిలిచేరుట పక్క పల్లెలో పాముని పట్టాలని. అంచేత, పార్సిలూ, రసీదూ నాబల్లమీద పెట్టేసి వెళ్లిపోయేట్ట. నాపర్మిషను అడగడానికి నేను లేను. ఫస్టసిస్టెంటుని ఎందుకు అడగలేదూ అంటే జవాబు లేదు.

“పోయినపార్సిలుకి ఏం సంజాయిషీ ఇచ్చుకుంటావో రాసియ్యి. లేకపోతే పై అథారిటీస్‌కి రిపోర్టిస్తాను.”

“సంజాయిసీ ఎందుకండీ. అత్తెచ్చీవరికే గదండీ నాడూటీ,” అన్నాడు వాడు.

నాకింకా కోపం వచ్చింది. “సరే, నీడ్యూటీ ఎంతవరకో తెలియజేస్తాను,” అన్నాను. అప్పటికప్పుడు క్లర్కుని పిలిచి ఛార్జిషీటు తయారు చేయించేను. రోశయ్య సర్విసులో చేరిందగ్గర్నుంచీ ఎన్ని మెమోలో, ఎన్ని వార్నింగులో, ఎన్ని బ్లాక్ మార్కులో ఎత్తి చూపించేను. అంతా పకడ్బందీగా తయారయింది. ఇంగ్లీషు అసిస్టెంటునీ, తెలుగు అసిస్టంటునీ పిలిచి చూపించేను ఇంకా ఏపైనా నాకు తెలీనివి ఉన్నాయేమోనని. నేను అంత బాగా ఫ్రేం చేసిందుకు వాళ్లు మెచ్చుకున్నారు. ఈదెబ్బతో రోశయ్య దిమ్మ తిరిగి దారికొస్తాడన్నారు. “కోడెత్రాచులాటివెధవని గరికపోచలా వంచేసిన కీర్తి మీకు దక్కుతుందండీ,” అన్నారు.

"కీర్తికోసం కాదండీ. స్కూలుకోసం, డిసిప్లిన్‌కోసం," అని, ఛార్జిషీటు టైపు చెయ్యమని క్లర్కుకి మళ్లీ చెప్పి ఇంటికి బయల్దేరాను.

ఇంటికొచ్చి, వరండాలో వాలుకుర్చీలో కూర్చున్నాను కళ్లు మూసుకుని. ఎందుకో కళ్లు మండుతున్నాయి.

"అక్కా, పాం, పాం."

నేను ఉలిక్కిపడి కళ్లు తెరిచాను. ఎదురుగా రోశయ్య. నవ్వుతూ నిలుచుని ఉన్నాడు. చేతిలో చిన్న తువాలుమూట ఉంది.

పొరిగింటికుర్రాడు హుషారుగా చూస్తున్నాడు.

"ఇట పోతంటే పాంవుని సూపియమని అబ్బాయిగోరు అడిగేరండీ," అంటూ రోశయ్య తువాలుమూట నేలమీదికి విసిరేడు. దబ్‌మని చప్పుడయింది. ఉండలా ముడుచుకునున్న నాగరాజు శిరసు మూరెడెత్తు గాలిలోకి లేచింది. సిసలైన జాతి సర్పం కాళీయఫణినుండీ సంతరించుకున్న పదచిహ్నాలతో సహా.

ఇరునాలుకలతో లయబద్ధంగా తల ఊపుతోంది. అంతసేపు మూసిపెట్టడంచేత ఊపిరాడక ఒగరుస్తోందో, రోషంతో బుసలు కొడుతోందో నాకు సరిగ్గా తెలియలేదు. రోశయ్య తువాలుతో దాన్ని రెచ్చగొట్టేడు. అది మరో అడుగు పైకి లేచింది.

నాకు ఒళ్లు జలదరించింది.

"కోరలు చూపించు," పొరుగింటి అబ్బాయి అడుగుతున్నాడు హుషారుగా.

"రొండు తీసీసేనండీ. ఇంకో రెండున్నయ్." రోశయ్య దాన్ని ఒడుపుగా పట్టుకుని, నోరు పెగలదీసి చూపుతున్నాడు. ఏవి కోరలో, ఎందులో విషం ఉంటుందో ...

అంతసేపూ నామనసులో మెదులుతున్నది ఒక్కటే ప్రశ్న - ఇంటికి పాముని తీసుకురావడంలో రోశయ్య ఉద్దేశ్యం?

"ఫుటో తీస్కుంటే బాగుంటాదండీ," అన్నాడు రోశయ్య మళ్లీ దాన్ని నేలమీదికి వదుల్తూ.

"నేనూ, అదీ కలిశా?" అన్నాను నవ్వుతూ.

"అట్ల గాదండీ," రోశయ్య కూడా నవ్వేడు. పాముని మళ్లీ తువాల్లో మూటగట్టుకు వెళ్లిపోయాడు వాడు.

"జాగ్రత్తండోయ్" అంటూ హెచ్చరించిన డ్రాయింగుమేష్టరు గుర్తుకొచ్చేరు నాకు.

రోశయ్య బలప్రదర్శనకోసమే తీసుకొచ్చేడా ఆ పాముని? ఇదోరకం బెదిరింపా? ఏమైనా సరే, నేను నాధర్మం నెరవేర్చక తప్పదు. తప్పు చేసినవాడు శిక్ష అనుభవించవలసిందే!

రోశయ్యమీద రాసిన ఛార్జిషీటుమీద సంతకం పెడుతుంటే ముందురోజు చూసిన సరీసృపంలా కదుల్తున్నట్టనిపించింది నాచేతిలో కలం. తగినచర్య తీసుకోవాలంటూ హెచ్చరించిన అసిస్టెంట్లనందరినీ తల్చుకుంటూ, నా విధ్యుక్తధర్మం నెమరేసుకుంటూ డిస్మాచికిచ్చేశాను.

000

వేసవిశలవులకి ఊళ్లో ఉన్న సైన్సుఅసిస్టెంటుని ఇన్‌ఛార్జిగా పెట్టి మాఊరికి బయల్దేరేను. ఇరవైమైళ్లు బస్సులో వెళ్లాలి.

బస్సుప్రయాణం నాకు మహ చిరాకు. ఆమాటకొస్తే ఏ ప్రయాణమయినా అంతే. "ఎందాకా?" అంటూ అడిగి తెలుసుకునేవారకూ కుదుటబడని సహప్రయాణీకులంటే నాకు చిరాకు. "మాయమ్మ ఈడుండది. ఆడు నాతమ్ముడు, నన్ను బండెక్కించనానికొచ్చినాడు" అంటూ వాళ్లగొడవలన్నీ ఏకరువు పెట్టే జనాల్ని చూస్తే విసుగు. అందుకే కిటికీపక్కన కూర్చుని, తల కిటికీలోకి పెట్టేసి కూర్చుంటానెప్పుడూను. ఆవేళా అలాగే కూర్చున్నాను. అయినా ముందుసీటులోంచి గాల్లో దూసుకువస్తూ వినిపించేయి మాటలు.

"బారిడు పొడుగున్నాది. సూస్తుంటె గుండె గుబేలుమన్నాదనుకో ..."

అటువేపు చూడకుండా ఉండలేకపోయేను. తూర్పుమనిషి ఏడాదిపిల్లాడిని ఒళ్లో వేసుకుని పాలిస్తూ చెప్తోంది, "పోయ్ని సుక్కరోరం ఉయ్యాల్లో పిల్లగాడున్నడు. ఎల ఎక్కిందొ ఉయ్యాలకి సుట్టుకునుంది. పిల్లగాని తియ్డానింకి బయ్యం. ఒదిలీనానికి బయ్యం. అదుగ, సరీగ్గ ఉప్పడె పొరుగూరాయ్ను ఆ పాములోని తీసుకొచ్చిండు. ఆమడసిక్కాడ ఒకంతాట సిక్కనేదు మాయదారి పురుగు ... పానం కడగట్టిపోనాదన్కో"

ఆ తల్లిమాటలు వింటూ ఆలోచిస్తున్నాను. “వాడొట్టి దొంగవెధవండీ. మనని భయపెట్టడానికలా ఏదో చెప్తూనే ఉంటాడు,” అన్న పొట్టి మేష్టరుమాటలు గుర్తుకొచ్చేయి. క్షణకాలం నేను ఆ ఛార్జిషీటు రాయకుండా ఉంటే బాగుండు అనిపించింది.

శలవులయేక తిరిగి వచ్చేసరికి రోశయ్య బదిలీ ఆర్డర్లు సిద్ధంగా ఉన్నాయి. వాడి నేరాలన్నిటికీ శిక్షగా వాణ్ణి జిల్లా ఆ చివరికి విసిరిపారేశారు.

“బదిలీ శిక్షలా అవుతుందండీ? ఇక్కడ పని చెయ్యనివాడు అక్కడ మాత్రం సవ్యంగా చేస్తాడా? ఉద్యోగం ఊడగొట్టి పంపాల్సింది వెధవని,” అన్నారు సైన్సుమేష్టరు తన అసంతృప్తిని వెల్లడి చేస్తూ.

“పోన్లెద్దురూ. on human grounds. నిజానికి, వాడు చేసినపనికి పరమవీరచక్ర ఇవ్వొచ్చు కదా. ఒక ప్రాణిని రక్షించేడు,” అన్నాను.

“అయ్యో రామ, ఆ కాకమ్మకథలన్నీ మీరు కూడా నమ్ముతారుటమ్మా!”

కొందరిఅభిప్రాయాలు మార్చడానికి ప్రయత్నించడంకన్నా మనమే మౌనం వహించడం ఉత్తమం.

రోశయ్యని రిలీవ్ చేశాను. అదే రోజు మాయింట్లో పనిమనిషి మానేసింది. అప్పుడు తెలిసింది ఆ మనిషీ రోశయ్యా పెళ్లి చేసుకుంటారుట. వాడు దానికోసమే ఈ ఊళ్లో ఉద్యోగం చేస్తున్నాట్ట. లేకపోతే రోశయ్య పాముల్ని పట్టగా వచ్చిన ఆదాయంతో వాళ్లిద్దరూ “రాజా, రాణీల్లా” బతగ్గల్రుట. వాడంటే అందరికీ భయం. “మాచెడ్డ బయ్యం. ఆల్లకాల్లే బెదరిపోతా వుంతరు”ట.

ఇంతవరకూ వాడు ఎవర్నీ ఏవిధంగానూ బాధించిన దాఖలాల్లేవు. కానీ వాళ్లల్లో ఉన్న పిరికితనం అలాంటిది. దాంతో వాళ్లు వాడిమీద కక్ష కట్టి సాధించడానికి పూనుకున్నారు. నాకు తెలియకుండానే, నాప్రయత్నం లేకుండానే, నేను వాళ్లకి ఆయుధం అయేను.

“పోన్లెండమ్మా. ఆల్లపాపాన ఆలే పోతరు. మాకిదీ మేలే అయ్యింది. అంతదూరంవెల్పోతన్నం గందని ఉప్పుడె ముఊర్తం ఎట్టీస్కున్నం.” అంది ముసిముసి నవ్వులు నవ్వుతూ.

మర్నాడు ఇద్దరూ ‘‘పెళ్లిపోతున్నాం’’ అని చెప్పడానికొస్తే, వాడు నాకంటె ఎంతో ఎత్తు ఎదిగిపోయినట్టు అనిపించింది. రోశయ్య ఒక్క ముక్కయినా అన్లేదు బదిలీగురించిగానీ ఛార్జిపీటుగురించి కానీ.

000

ఆ తరవాత inspection ఉందని, దగ్గరుండి గదులన్నీ శుభ్రం చేయిస్తుంటే, సైన్సు లాబొరేటరీలో ఓమూల సగం ఎలకలు కొట్టేసిన పార్సిలొకటి కనిపించింది.

కళ్లు చించుకుని పరీక్షగా దానిమీద పోస్టుమార్కు చూస్తే అది రోశయ్య పారేసేడనుకున్నదే!

‘‘ఆల్లకాల్లే కల్పిచ్చుకుని బెదరిపోతాఉంటార’’న్న పనిమనిషి మాటలు నామనసులో మెదిలేయి.

000

(1965-66 ప్రాంతాల్లో తరుణ మాసపత్రికలో ప్రచురితం.)

# 22. మామూలు మనిషి

"రాజేశ్వరి ఏదమ్మా?"

పదిహేనేళ్లతరవాత పుట్టినగడ్డమీద కాలు పెడుతూనే, గుండెలో కొట్టుకుంటున్న మొదటి ప్రశ్న.

తలవాకిలిలో అడుగు పెడుతూనే నాకళ్లు నలుమూలలా వెతికేయి ఆ మూర్తికోసం. ఆ సంగతి ఇంట్లో అందరూ గ్రహించేరు. అందరూ గ్రహించనట్టు నటించేరు. అందుకే నాకు నేనై అడక్కుండా ఉండలేకపోయాను.

"రాజేశ్వరి ఏదమ్మా?"

అమ్మ గిరుక్కున వెనుదిరిగి వెళ్లిపోయింది. వదిన కళ్లు ఆర్ద్రాలయేయి. అన్నయ్య మౌనంగా పేపరు చదువుతున్నాడు. నాన్నగారు మాట మారుస్తూ, "ముందు స్నానం చెయ్యవోయ్. ఎప్పుడనగా తిన్న అన్నమో. మాటలకేం, తరవాత మాటాడుకోవచ్చు," అన్నారు.

కాని, రాజేశ్వరి?

పరిగెత్తుకుంటూ వీధిలోంచి వస్తున్న పండు నన్ను చూసి, తలుపుచాటున ఆగిపోయాడు.

"రారా, లోపలికి రా. చిన్నాన్నరా. నీకు బొమ్మలు పంపలేదూ. .." నాన్నగారు వాణ్ణి కొత్త వాతావరణంలోకి లాక్కు వచ్చేరు. నేను తువాలు తీసుకుని స్నానానికి బయలుదేరాను.

తిరిగి వచ్చేసరికి పండు నా సామానుదగ్గిర ప్రదక్షిణాలు చేస్తున్నాడు.

"రాజేశ్వరి ఎక్కడుందో నీకు తెలుసురా?" అని వాడిని అడిగేను చుట్టూ ఎవరూ లేకుండా చూసి.

వాడు తెల్లమొహం వేశాడు.

అస్తవ్యస్తంగా భోజనం అయిందనిపించి మూలగదిలో మంచంమీద కళ్లు మూసుకుని పడుకున్నాను.

“చిన్నబాబు వచ్చేడటనే” అంటూ చుట్టాల పలకరింపులూ, “ఇప్పుడే నాలుగు మెతుకులు కతికి నిద్రకొరిగాడు. దగ్గిరా, దాపా?” ... నాన్నగారి విన్నవింపులూ వినిపిస్తున్నా లేవకుండా పడుకున్నాను.

వేపచెట్టునీడన, ఈ విశాలమయిన ఇంట్లో నాకేదో ఊపిరాడనట్టుగా ఉంది. నా ఒకే ఒక ప్రశ్నకు వీళ్లు ఎవరూ ఎందుకు జవాబు చెప్పరో నాకర్థం కాలేదు. బొత్తిగా చౌకబారు శవసాహిత్యంలో సస్పెన్సులా ఉంది ఈ స్తబ్ధత. అకారణంగా కన్నుల నీరు తిరిగింది. మాగన్నుగా నిద్ర పట్టింది కాబోలు, నవ్వుతూ రాజేశ్వరి “వచ్చావా?” అని అడిగినట్టయింది. తృళ్లిపడి లేచాను.

“ఇవాళ లేవవేమో అనుకున్నాను,” అంది వదిన నవ్వుతూ, ఒక ప్లేటులో పూతరేకులతోనూ, సేరుగ్లాసులో కాఫీతోనూ నిలుచుని.

“లేవొద్దు అనుకున్నాను గానీ, పూతరేకులు జ్ఞాపకం వచ్చి ... ” అన్నాను, గోడవేపు తిరుగుతూ. “పూతరేకులు రాజేశ్వరే చెయ్యాలి,” అని మనసులో అనుకుంటూ, నిట్టూర్చి.

అంతవరకూ నవ్వుతున్న వదిన కూడా ఒక వేడి నిట్టూర్పు విడిచింది. అంతలోనే నవ్వడానికి ప్రయత్నిస్తూ, “మేలుకో మహరాజ, మేలుకో, వేచియున్నారు వేలాది ప్రజలు,” అంది రాగయుక్తంగా.

లేచి కాఫీ, టిఫినూ ముగించి, పొలంవేపు బయల్దేరేను. ఆ విధంగానైనా కొంత మాట తప్పించవచ్చేమోనని. ఇంట్లో ఎవరూ వద్దనలేదు.

పాలికాపు పైడిగాడు నన్ను అల్లంత దూరాన్నే గుర్తు పట్టేడేమో కొండనందుకున్నంత సంతోషంతో పరుగెత్తుకు వచ్చేడు. “ఉండండి బాబూ! మంచి గంగాబోండాలుండయ్. కొట్టిత్తాను. సల్లగుంటయి,” అంటూ కోనసీమ రుచి చూపించేడు. కిందటేడే కూతురిపెళ్ళి చేసేడుట. అల్లుడు చాలా మంచివాడుట. కోడలు మాత్రం వట్టి దుర్మార్గురాలుట. కొడుక్కీ తనకీ

పడకుండా చేసిందిట. ఇంట్లో సంబంధం ఎందుకు పోనివ్వాలని బావమరిది కూతుర్ని చేసుకుంటే ఏకు మేకయిందిట -- ఏవేవో సంసారపు గొడవలు చెప్పుకువచ్చాడు.

అన్నీ విని ఆఖరికి అడిగేను, ''అయితే రాజేశ్వరి ఏమయిందిరా?'' అని.

వాడు ఒక్కమాటు నెత్తి కొట్టుకున్నాడు. ''ఇంకెక్కడి రాజేశ్వరమ్మ బాబూ? ఆ ఎదవ పొట్టనెట్టుకున్నడు గంద.''

''ఆ఼!'' నేను నిర్ఘాంతపోయేను. ''ఎవడు వాడు?'' తేరుకుని నాకు మాత్రమే వినిపించేంత మెల్లిగా అడిగేను.

''అదేటి బాబూ, అట్టా ఐపోనారు? పదండి. ఇంటికాడ ఒగ్గేసొస్తను. .. పాపిష్టోన్ని. మంచీ సెబ్బరా సూస్కోకండ మాటాడీసినాను,'' అన్నాడు.

పైడిగాడు నామాట విన్నాడో లేదో రెక్క పుచ్చుకుని ఇంటివేపు నడిపించుకు వచ్చీసేడు.

''ఏమైంది'' అని ఎవరూ అడగలేదు!

ooo

స్కూల్నించి వచ్చి పుస్తకాలు బల్లమీద పారేసి, వంటింట్లోకి వెళ్ళేను, ''అమ్మా, ఆకలి,'' అంటూ కేకలేస్తూ. లోపల ఎవరో కొత్తావిడ పప్పు రుబ్బుతూ కనిపించింది.

''ఉండరా, ఇంకా కాలేదు,'' అంది అమ్మ.

నాకు కోపం వచ్చింది కానీ కొత్తమనిషిని చూసి ఊరుకున్నాను.

ఆవిడపేరు రాజేశ్వరి అనీ, ఆ రాత్రి ఆవిడ మాయింట్లోనే అన్నం తింది అనీ తరవాత తెలిసింది నాకు. కానీ రాత్రి ఎక్కడ పడుకుందో తెలీదు. మర్నాడు పొద్దున్న ఆవిడే కాఫీ పెట్టింది. సావిట్లో కూచున్న నేను కాఫీకోసం చూసి చూసి విసుగేసి, ''ఏయ్, కాఫీ, తే'' అన్నాను.

పెరట్లోకి వెళ్లబోతున్న అమ్మ వెనుదిరిగింది. కళ్లలో నిప్పులు కురిపిస్తూ, ''మళ్లీ అను,'' అంది.

నేను భయంభయంగా అమ్మవేపు చూసి, లేచి వెళ్లి నాకాఫీ నేను తీసుకుని, ఆడుకోడానికి వెళ్లిపోయేను. కానీ, ఆ రోజంతా కోపంగానే ఉన్నాను.

"పోనీలేవమ్మా, పసితనం," ఆవిడ కనికరించడం నాకు మరీ కష్టంగా ఉంది. మరునాడు మరో సంఘటన నాకూ, అన్నయ్యకూ కూడా ఆవిడంటే మరీ అసహ్యం కలగజేసింది.

నేను లెక్కలు చేసుకుందాం అని నా నోటుబుక్కు తీసి చూస్తే, అందులో ఓ పదికాగితాలు చింపేసి ఉన్నాయి. ఇంట్లో సామాన్యంగా ఎవరూ నా పుస్తకాలు తియ్యరు. అందుకే అమ్మతో ఫిర్యాదు చేశాను. అమ్మకూ అర్థం కాలేదు.

"నీ పుస్తకాలు ఎవరిక్కావాలి? నువ్వే చింపుకుని ఉంటావు. లేకపోతే స్కూల్లో ఎవరైనా చింపేరేమో," అంది.

"అదేం కాదు. నిన్నరాత్రి కూడా చూశాను నేను, చిరిగి లేవు. ఇంట్లోనే నా పుస్తకం ఎవరో తీశారు," అన్నాను రోషంగా.

అమ్మకు విసుగేసింది. "పోరా, పో. వెధవగోలా నువ్వూనూ. తీస్తే మటుకు ఏం మునిగిపోయిందిప్పుడూ?" అంది

"చూడు," అంటూ రెండోవేపు ఊడిపోయిన కాయితాలు చూపించేను.

రాజేశ్వరి నామొహంవేపు చూసి, "నాకు కావలిసి వచ్చి నేనే చింపేను," అంది, అదేదో తన వ్యక్తిత్వానికి వన్నె తెచ్చే ఘనకార్యంలాగ.

నాకు పౌరుషం వచ్చింది, "ఈమారు తియ్యి," అన్నాను.

"నీ బోడికాయితాలు నువ్వే ఉంచుకో," అని రాజేశ్వరి ఆ కాయితాలు నామీద విసిరేయడమూ, నేను దానికి సమానమయిన సమాధానం ఇవ్వడమూ, అప్పుడే పెరట్లోంచి వస్తున్న అమ్మ నామాట విని, నా చెంప ఛెళ్లుమనిపించడమూ, నేను తూలి పడడమూ మాత్రమే నాకు తెలుసు.

ఎలా పడ్డవాణ్ణి అలాగే పడుకుని ఓపిక ఉన్నంతసేపు ఏడ్చి, నిద్రపోయేను. కళ్లు తెరిచి చూసినప్పుడు తెలిసింది ఆ మూడుగంటలసేపూ రాజేశ్వరి నాతల తన ఒళ్లో పెట్టుకుని అలాగే కూచుందని.

అమ్మ, "ఎంతసేపు అలా కూచుంటావు? వాణ్ణి అలా పక్కన పడుకోబెట్టు," అని ఎంత చెప్పినా ఆవిడ వినలేదుట. పైగా, "పైగా నాఒడిలోకి జారిన పండు, ఎలా వదిలెయ్యను?" అందిట.

మరునాడు రాజేశ్వరి మాయింటికి రాలేదు. మూడోనాడూ రాలేదు. వరసగా వారంరోజులు రాలేదు. అప్పటికి రెండురోజులనించి అమ్మ జ్వరంతో బాధ పడుతోంది. ఒకటి రెండుమార్లు, "రాజేశ్వరి ఎక్కడుందో చూడరా," అంది. ఎందుకో తెలీదు కానీ మాకూ మనసులో ఒకమారు ఆవిడ కనిపిస్తే బాగుండుననే ఉంది. ఆఖరికి రాజేశ్వరిని వెతకడానికి బయల్దేరేం నేనూ అన్నయ్యా, ఇద్దరమూను. మావూరి పెద్దకాపు రెడ్డెప్పగారి అరుగుమీద జీడిపప్పు తింటూ కనిపించింది. మమ్మల్ని చూసీ చూడనట్టు ఊరుకుంది. "చూడలేదేమోలే," అనుకుని, మేం దగ్గరికి వెళ్లేం. నాకు మాటాడబుద్ధి పుట్టలేదు.

అన్నయ్యే అన్నాడు, "అమ్మకి రెండురోజులనించీ జ్వరం."

రాజేశ్వరి అలవోకగా చూసి, "అయితే?" అంది.

"నువ్వు వచ్చి మాఇంట్లో రెండురోజులు ఉండమని అమ్మ చెప్పింది," అన్నాడు అన్నయ్య.

రాజేశ్వరి ఉగ్రురాలయింది, "ఏమిటీ? మీఅమ్మ అంతటి సామంతురాలా? నేను వచ్చి మీ అందరికీ వార్చిపెట్టాలా? కొంచెం ఒళ్లు వెచ్చబడితే మంచం దిగని మహరాజభోగమా? ఏం చూసుకుని అంత అదిరిపాటు? మీబాబు సంపాదనా? మీతాత హోదా? నేనేం కూలికి ఒప్పుకున్నానా? ఆమాత్రం చేసుకోలేదూ? దాసీదానికి కబురు చేసినట్టు కబురు పెడుతుందా?" రావడానికి మీకెంత లేకపోయిందీ? చేసుకోమను. మరేం ఫర్వాలేదు. కళ్లు తిరిగి పడే పరిస్థితిలో నేను వండలేదూ తద్దినపువంట?"

అన్నయ్యమొహం చూస్తే నాకు భయం వేసింది. బావురుమన్నాను. అన్నయ్య నాచెయ్యి పట్టుకుని ఇంటికి ఈడ్చుకు వచ్చేశాడు.

"ఏం? కనిపించలేదా?" అమ్మ నిస్పృహగా అడిగింది. అన్నయ్య లేదన్నట్టు తల ఊపి వెళ్లిపోయేడు.

మరోగంట తరవాత, గుమ్మంలో అడుగు పెడుతున్న రాజేశ్వరిని అన్నయ్య గుమ్మంలోనే అడ్డుకున్నాడు, "ఫో ఇక్కడినించి" అన్నమాటలు అన్నయ్య పెదిమలనించి వెలువడ్డాయి. నేను భయంగా చూస్తున్నాను.

రాజేశ్వరి కుడిచేతి మునివేళ్లు అన్నయ్యగుండెలమీద ఉంచి, "తప్పుకో," అంది.

అన్నయ్య తప్పుకున్నది ఆవిడ వాగ్ధాటికి కాక హస్తలాఘువంవల్ల అని నాక్కూడా అర్థం అయింది. జేగురించిన మొహంతో వీధిలోకి వెళ్లిపోయేడు.

అప్పటినించి రాజేశ్వరి సావిట్లో ఉంటే అన్నయ్య వరండాలోనూ, రాజేశ్వరి వరండాలో ఉంటే అన్నయ్య వంటింటిలోనూ ..

నాకు మాత్రం ఇష్టారాజ్యం భరతునిపట్నంగా ఉండేది, రాజేశ్వరి సుముఖంగా ఉంటేనే. రాజేశ్వరిది అదో లోకం. నేను భయంగా దూరంగా తిరుగుతూంటే పిలిచి, "ఇవ్వాళ స్కూల్లో ఏంచెప్పేరు?" అని అడిగేది. నేను హరివిల్లులో ఏడు రంగులు ఎలా వస్తాయో, ఊపిరితిత్తులు ఎలా పని చేస్తాయో, భూమి గుండ్రంగా ఉందని ఎలా నిరూపించడమో వివరించేవాణ్ణి. "ఒక బంతిమీద ఒక చీమని వదిలేం అనుకో. అది అలా తిన్నగా వెళితే, మళ్లీ బయలుదేరిన చోటికే వస్తుంది కదా! అలాగే భూమి కూడా గుండ్రంగా ఉంటుంది," అని కష్టపడి వివరించేవాడిని.

రాజేశ్వరి నవ్వేసేది, "బంతిమీద చీమ బయలుదేరిన చోటికే వస్తే భూమి గుండ్రంగా ఉన్నట్టేనా?"

నాకు కోపం వచ్చేది. "ఛీ, కంకర," అనేవాణ్ణి. ఆమాటకు నాకు బాగా అర్థం తెలియకపోయినా, అది మా సోషల్ మాష్టారు అనేమాట. అయన చెప్పిన పాఠం ఎవరికైనా అర్థం కాకపోతే అలా విసుక్కునేవారు ఆయన. నేను చనువుగా రాజేశ్వరిదగ్గరికి వెళ్లి, "కథ

చెప్పు" అంటే, "ఛో, ఛో, మరేం పని లేకపోతే సరి. నేనేం నీకు పేడుక చెలికాణ్ణా? మీఅమ్మ తెచ్చుకున్న అరణపుదాసీనా నీతో ఆడుతూ పాడుతూ కూర్చోడానికి?" అని కసిరి కొట్టేది.

అందుకే నాకు రాజేశ్వరి అంటే ఆశా, భయమూ, రెండూను.

రాజేశ్వరిని అర్థం చేసుకున్నది ఒక్క అమ్మేనేమో. అమ్మ రాజేశ్వరిని ఏమీ అనేది కాదు. ఒకరోజు అన్నయ్య మరో ప్రళయం తీసుకువచ్చేడు. తను అయిదురూపాయలనోటు బల్లమీద పెట్టేడుట. ఒక గంట పోయినతరవాత చూస్తే అది అక్కడ లేదుట. "అమ్మా, నా అయిదురూపాయలనోటు పోయింది," అన్నాడుట.

"ఎలా పోయింది? ఎవరో తీసి ఉంటారు. కనుక్కో," అందిట అమ్మ.

వదినను అడిగితే, తనకు తెలియదందిట. నేను కానీ, నాన్నగారు కానీ తియ్యడానికి అవకాశమే లేదు. మేము అప్పుడు ఇంట్లో లేము.

"ఇది రాజేశ్వరిపనే," అన్నాడు అన్నయ్య.

అమ్మ చాలా శాంతంగా, "తీసిందేమో," అంది.

అన్నయ్య ఉగ్రుడయిపోయేడు, "తీసిందేమో అంటావేమిటమ్మా నానుస్తూ. ఖచ్చితంగా చెబుతున్నాను రాజేశ్వరే తీసిందని. ఆ దొంగ .."

"నోరు ముయ్యి," అమ్మ అరిచింది. ఆ వెంటనే స్వరం తగ్గించేసి, "అలా అనవసరంగా ఎంత మాట పడితే అంత మాట ఎవర్ని పడితే వాళ్లని అనకుండా ఉండడం ఎప్పుడు నేర్చుకుంటావో కానీ చెబుతున్నా విను, రమణా, అదేమంత మంచిపని కాదు. ఇలాటి అయిదులు ఎడంచేత్తో విసిరేసిన సామంతురాలావిడ," అంది.

"అంతటి సామంతురాలయితే ఇలా ఇంటింటా అడుక్కుతినడం ..." అమ్మ మొహం చూసో, వరండాలో రాజేశ్వరి మొహం చూసో అన్నయ్య వాక్యం పూర్తి చెయ్యనే లేదు.

"నేనే తీశాను ఆ అయిదురూపాయలు. నీసంపాదన చూసుకునేనా నువ్వింత పేలుతున్నావు? నేను నడిసముద్రంలోనించి నడిచి వచ్చేను అరిపాదం తడి కాకుండా. అంత డబ్బు మొహం ఎరగనిదాన్ని కాను. పెద్దింట్లో పుట్టేవు. ఇంత చిన్నమాటలెలా వస్తున్నాయి నీకు?" అంది రాజేశ్వరి అసహ్యంగా చూస్తూ ఆ నోటు అన్నయ్యమీద విసిరేసి.

అన్నయ్య చాలాసేపయిన తరవాత ఆనోటు తీసి మళ్లీ ఆ బల్లమీదే పెట్టేసి వెళ్లిపోయేడు. ఆ తరవాత వదిన అన్నయ్య తరఫున క్షమాపణలు చెప్పుకుని రాజేశ్వరికి ఇచ్చిందిట ఆ డబ్బు.

అక్కడినించి అన్నయ్య మరీ తప్పించుకు తిరగడం మొదలు పెట్టేడు. రాజేశ్వరి కూడా ఎప్పుడో తప్ప కనిపించడం లేదు. అందుచేత ఏ ప్రమాదాలూ లేకుండా రోజులు గడిచిపోతున్నాయి.

నేను స్కూల్ ఫైనలుకి వచ్చేను.

రాజేశ్వరి మాత్రం ఎప్పటికప్పుడు ఏదో అవాంతరం తెచ్చి మాజీవితాలని చైతన్యవంతం చేస్తూనే ఉంది. వాటిలో అతి ముఖ్యమయినది ఓ రెండేళ్ల పసివాణ్ణి తీసుకురావడం.

"వీడెవడూ?" అంటే చెప్పలేదు. "ఇక్కడికెందుకు తెచ్చేవు?" అంటే వినలేదు. తను వచ్చి మాఇంట్లో ఉన్నంతసేపూ వాడిని సావిట్లో వదిలేసేది. వాడు ఇల్లంతా తిరిగి నానా కంగాళీ చేసేవాడు. ఇది అన్నయ్యకు మరింత కోపకారణం అయింది. రాజేశ్వరికీ, అమ్మకీ వినిపించకుండా సణిగేవాడు. వదినని చెప్పమనేవాడు వాడిని తీసుకురావద్దని చెప్పమని. అన్నయ్యకు జడిసి, నేను కూడా వాడిని దగ్గరికి తీసేవాడిని కాను.

అన్నయ్య పడే అవస్థ చూసి రాజేశ్వరి నవ్వేది. "విసుక్కుంటే విసుక్కోనీ. ఇది ఎన్నాళ్లుంటుంది," అనేది.

అలా ఎక్కువ రోజులు జరగనేలేదు. ఎవరూ లేని సమయంలో అన్నయ్య వాడి బుగ్గ గిల్లీ, చిటిక వేసీ పలకరించేవాడు. అన్నయ్య కుర్చీలో కూచుంటే, ఆ పసివాడు మెల్లిగా కుర్చీ వెనక చేరి సందుల్లోంచే అన్నయ్య చొక్కా లాగడం, అన్నయ్య మెల్లిగా ఒకటీ, రెండూ పిప్పరమెంటుబిళ్లలు వాడికి అందించడం క్రమంగా ఇంట్లో అందరికీ తెలిసిన రహస్యం అయిపోయింది. అఖరికి వాడికి పేరు కూడా అన్నయ్యే పెట్టి వదినచేత చెప్పించేడు, శిఖి అని.

నేను విశాఖపట్నం వచ్చేశాను కాలేజీలో చేరడానికి. అదే మొదలు కావడంచేత వారానికీ రెండువారాలకీ ఇంటికి వెళ్లకపోతే తోచేది కాదు. ఇంట్లో రాజేశ్వరి కనిపించకపోతే తోచేది కాదు. వెళ్లినప్పుడల్లా జీడిపప్పు తీసుకువెళ్లేవాణ్ణి రాజేశ్వరికోసం రహస్యంగా. ఇష్టం

అయితే తీసుకునేది. నన్ను మెచ్చుకునేది. లేకపోతే విసిరికొట్టేది. నేను చూస్తూండగానే అది ఇంకెవరికైనా యిచ్చేసేది. అయినా మళ్లీ వెళ్లేటప్పుడు ఒట్టి చేతులతో వెళ్లలేకపోయేవాణ్ణి.

ఆఖరికి యూనివర్సిటీవాళ్లు ఓ కాగితం నాచేతిలో పెట్టి, "నీబతుకు నువ్వు బతుకు," అని తగిలేసినతరవాత, పైవాళ్లేం చేస్తారో చూదాం అని పైదేశాలకి వెళ్లిపోవడం, మళ్లీ ఇప్పుడు ఆవురావురుమంటూ ఊరు చేరుకోవడం జరిగేయి. ఇక్కడ ఇంతలోనే ఊరు మారిపోతుందనీ, రాజేశ్వరి ఇలా కమ్మని జ్ఞాపకంగా మిగిలిపోతుందనీ నేను ఊహించలేదు. అది సంభవం అనుకోలేదు!

000

నేను సర్దుకుని "శిఖి ఏడీ?" అని అడగడానికి రెండు రోజులు పట్టింది.

"ఆ దౌర్భాగ్యుడిపేరు ఈ ఇంట్లో ఎత్తకు," అన్నాడు అన్నయ్య.

నాన్నగారిని అడగలేకపోయేను.

వదిన ఎవరూ లేకుండా చూసి మెల్లిగా చెప్పింది, "వాడు కనిపిస్తే ఈ ఊరివాళ్లు పిచ్చికుక్కని కొట్టినట్టు కొట్టి చంపేస్తారు. అంచేత అజ్ఞాతవాసం గడుపుతున్నాడు," అని.

ఆరోజు రాత్రి అందరూ పడుకున్నతరవాత అమ్మ లేచి చప్పుడు కాకుండా పెరట్లో ఎవరికో అన్నం పెట్టడం కనిపించింది. నేను లేచి వెళ్లి అమ్మవెనక నిల్చున్నాను. ఆ మసకచీకటిలో తుప్పజుత్తూ, పీలికలై వేలాడుతున్న లాల్చీ మాత్రమే చూడగలిగేను.

అమ్మ వెనుదిరిగి నన్ను చూసి గతుక్కుమంది. అంతలోనే నిట్టూర్చి లోపలికి నడిచింది.

నేను అమ్మను అనుసరించాను. నేను లోపలికి వచ్చినతరవాత అమ్మ తలుపు వేస్తూ అంది, "వాడే శిఖి" అని.

ఆ తరవాత అతిప్రయత్నంమీద అమ్మ దగ్గరినుంచి నేను రాబట్టగలిగిన భోగట్టా అతి స్వల్పం. శిఖి కనిపిస్తే ఊరివాళ్లు చంపేస్తారుట. రాజేశ్వరి ఆ గడ్డమీద సంపాదించుకున్న ఆదారాభిమానాలు అటువంటివిట. ఒక రాత్రివేళ శిఖి వచ్చి అమ్మను అన్నం పెట్టమని యాచించేడుట. ఆకలికి ఓర్వలేకో, అమ్మ పోల్చుకోలేదనో, పోల్చుకున్నా ఏమీ చెయ్యదనో.

అమ్మ ఓోల్చుకుంది. పెరటివేపుకి పిలిచి అన్నం పెట్టి పంపించేసిందిట. మరునాడూ అలాగే వచ్చేడుట. ఆరునెలలుగా అలాగే రోజు వస్తున్నాడుట.

"అసలు రాజేశ్వరి ఎలా చచ్చిపోయింది?"

అమ్మ నిట్టూర్చి, "నిజం ఒక్క శిఖికే తెలియాలి తెలిస్తే," అంది.

అప్పటికి నేను వచ్చి పదిహేను రోజులు అయింది. రోజూ సాయంత్రం పొలాలగట్లమ్మట నడిచి చీకటి పడిన తరవాత ఇంటికి చేరుకునేవాణ్ణి.

నడుస్తున్నవాణ్ణి అడుగులచప్పుడు విని వెనక్కి తిరిగ చూశాను. ఎవరూ కనిపించలేదు. ఈమధ్య రెండు మూడు రోజులుగా నన్నెవరో అనుసరిస్తున్నట్టు అనుమానంగా ఉంది. ఇవాళ ఈ విషయం ఖచ్చితంగా తెలుసుకోవాలని ఉంది. మళ్లీ అడుగుల చప్పుడు వినిపించింది. కనుచీకటి పడుతూంది.

"చినబాబూ!" గాలికి ఆకులు కదిలినట్టు వచ్చింది ఆ మాట.

"ఎవరు?"

"నేను బాబూ."

"శిఖీ!"

"అవును చినబాబూ," ఎదటికి వచ్చేడు. చీకట్లో కూడా వాడి దైన్యస్థితి స్పష్టంగా కనిపిస్తూంది.

నాలో ఒక తరంగంగా లేచిన కోపం అణిగిపోయిన తరవాత అన్నాను, "ఏఁరా?" అని.

వాడు ఒక్క క్షణం మాటాడలేదు. "నువ్వు కూడా నమ్ముతున్నావా చినబాబూ?" దీనంగా అడిగేడు.

నేను జాగ్రత్తగా అన్నాను, "నాకేమయినా తెలిస్తే కదా నమ్మడానికి," అని.

"నువ్వు ఢిల్లీ వెళుతున్నావుట. నన్ను కూడా తీసుకు పో, చినబాబూ. నన్ను వీళ్లు బతకనివ్వరు. నేనిక్కడ ఉండలేను," శిఖి బావురుమన్నాడు.

అప్రయత్నంగా నాచేతులు వాడిని నా వక్షానికి చేర్చుకున్నాయి. వాడు నాకు దారి తప్పిన అయిదేళ్ల తమ్ముడిలా గోచరించాడు ఆ క్షణంలో.

ఈఅర్భకుడిమీదికి ఉపయోగించడానికి నిర్ణయమయి ఉన్న బ్రహ్మాస్త్రాలు తలుచుకుంటే నామనసు ద్రవించింది. "ఊరుకోరా, ఆడదానిలా ఏడుస్తావా? నాతో వచ్చేద్దువుగానిలే. ఏడవకు. రేపుసాయంత్రం ఆరుగంటలకి స్టేషనుకి రా. టికెట్టు నేను కొంటాను. రెండు స్టేషనులు దాటినతరవాత నా పెట్టెలో ఎక్కుదువు గాని. ఆంతవరకూ వేరే పెట్టెలో ఎక్కు," అనేసి, ఇంటికి వచ్చేశాను, వాడిచేతిలో అయిదు రూపాయలు పెట్టి.

నేను చేసిన పని అమ్మకు మాత్రం చెప్పేను. "వెధవ, ఊరికి వెళ్తున్నానన్న సందడి కాబోలు, అన్నానికి రాలేదు," అంది అమ్మ ప్రేమా, బాధా కలిసి ధ్వనిస్తున్న స్వరంతో, పొద్దున కాఫీ ఇస్తూ.

నాగది తుడిచి వస్తూ, నూకాలు "ఇదేటో బాబూ, మంచంకాడ పడున్నాది," అంటూ ఓ కవరు నాకు అందించింది.

ఎక్కడో సంపాదించిన పాతకాగితాలమీద ఎవరో పారేసిన పెన్సిలుముక్కతో రాసినట్టుంది. అలవాటు లేనివాడు రాసినట్టు బోలెడు తుడుపులూ, కొట్టి వేతలూ ఉన్నా ఇంకా తప్పులు మిగిలిపోయే ఉన్నాయి.

కాయితం వీలయినంత సాపు చేసి వెనక్కి తిప్పి చూశాను. శిఖి రాసేడు.

"చినబాబూ,

ఇన్నాళ్లకి నువ్వు ఒక్కడివి నాతో చల్లగా మాటాడేవు. నాకెంత సంతోషంగా ఉందో తెలుసా! నేను ఇంక ఇలాగ దొంగ బతుకు బతకను. నన్నెవరూ ఏమీ చెయ్యలేరు. ఏమైనా చేస్తే నువ్వున్నావు కదా. అమ్మ కూడా ఉంది కదా (మా అమ్మ అన్నమాట). కానీ నేను నీతో రాను. చినబాబూ, ఇక్కడ నేను రోజూ అమ్మని (రాజేశ్వరిని) చూసుకుంటాను శ్మశానంలో. అక్కడ అలా కళ్లు మూసుకుని కూచుంటే అమ్మ నాకు కనిపిస్తుంది. ఓదారుస్తుంది. నేను అమ్మని వదిలి రాలేను. నిజంగా నేను అమ్మని చంపలేదు చినబాబూ. నేను చంపలేదు. అమ్మే చచ్చిపోయింది. నేను వట్టి వెధవని అని అందరూ అంటారు కదూ. నిజంగా వెధవనే. అందుకే అమ్మ చచ్చిపోతూంటే చూస్తూ ఊరుకున్నాను. కానీ నేను చంపలేదు. అసలు అమ్మని ఎవరు చంపగలరు? అమ్మది రాచపుట్టుక. ఆమాట అమ్మ అంది, 'నాది

రాచపుట్టుకరా. నేను చచ్చినా వెయ్యి, బతికినా వెయ్యి. అందుకే వెళుతున్నాను. ఈలోకం చూశాను. అవతల ఏముందో చూస్తాను' అంది చచ్చిపోతూ. మీకెవ్వరికీ తెలీదు అమ్మది రాచపుట్టుక అనీ, కత్తిసాములో అమ్మకి సాటి రాగల మొనగాడు ఊర్లోనే లేడు అనీ. ఇంతకీ అసలు సంగతి చెప్పలేదు కదూ. నాకు చెప్పడం బాగా రాదు. అందుకని కోపం తెచ్చుకోకు. మరి నేను నీలాగా చదువుకోలేదు కదా. ఆ యజ్ఞవరాహమూర్తిగారింట్లో చేరిన సైదులు లేడూ, వాడూ రోజూ అమ్మదగ్గరికి వచ్చేవాడు. 'పదిరూపాయలు ఇయ్యి. పట్నం వెళ్లి సినిమా చూసొస్తా' అనేవాడు. అమ్మ ఇచ్చేది. వాతో కూడా చాలా స్నేహంగా ఉండేవాడు. ఒకమారు నన్ను కూడా సినిమాకి తీసుకువెళ్లాడు. 'పేకాట వచ్చా?' అని అడిగేడు. రాదన్నాను. 'నేర్పనా?' అన్నాడు. ఒకరోజు వెళ్లేను వాడితో. నాకేం బాగులేదు. అప్పటినించీ మళ్లీ వెళ్లలేదు. సైదులు మాత్రం అప్పుడప్పుడు మాఇంటికి వచ్చేవాడు. ఒకరోజు వాడే అమ్మని అడిగేడు, 'అయితే ఎంత దాచేవత్తా?' అని. అమ్మ నవ్వింది. 'ఏం? కన్నం వేస్తావా?, కాదని దావా వేస్తావా?' అని. వాడు 'అబ్బే, అదేం లేదు. పెంపకానికి వచ్చేస్తాను,' అన్నాడు. 'అయితే నీకు దక్కేది అక్షయపాత్రే,' అంది అమ్మ. ఆ తరవాత కొన్నాళ్లు నన్ను వేధించుకు తిన్నాడు అమ్మ దగ్గర ఆస్తి ఎంత ఉందో చెప్పమని. నాకు తెలీదంటే నమ్మలేదు. నాకు తరవాత్తరవాత తెలిసింది ఈ విషయం ఊళ్లో కూడా చాలామందిని బాధించేడని. కానీ అమ్మ మాత్రం ఏమీ ఎరగనట్టు నటించేది. ఆఖరికి ఆ సైదులు మీరిపోయేడు. అమ్మ కూడా చిరాకు పడి, డబ్బు ఇవ్వను, పొమ్మనేది. అలా రెండు, మూడుమార్లు అయిందేమో, 'ఎందుకు ఇవ్వవో చూస్తాను' అన్నాడు సైదులు కఠినంగా.

ఆరాత్రి తలుపు చప్పుడయితే అమ్మే వెళ్లి తలుపు తీసింది. సైదులు కసాయికత్తి తీసుకుని వచ్చేడు. కొంచెం తాగి కూడా ఉన్నాడేమో కూడా. నాకు వణుకుతో కాళ్లూ చేతులూ ఆడలేదు.

అమ్మ మాత్రం కించిత్తయినా చలించలేదు. 'ఛీ, దుర్మార్గుడా! తులసివనంలో గంజాయిమొక్కలా ఇక్కడికి వచ్చావు. ఫో. తాగి తందనాలాడేవాళ్లకి ఇక్కడ చోటు లేదు' అంది.

'కబుర్లు కట్టి పెట్టి డబ్బు ఎక్కడుందో చెప్పు. రెండు వేలు కావాలి,' అన్నాడు సైదులు.

'ఎవడబ్బసొమ్ము దాచేవిక్కట. అవతలికి ఫో,' అంది అమ్మ.

'చెపుతా,' అన్నాడు సైదులు కత్తి ఎత్తి. అమ్మ క్షణంలో మెరుపులా కత్తి ఝుళిపించింది. సైదులు చెయ్యి తెగి తొక్కలా వ్రేలాడుతోంది. అమ్మ అంది, 'ఈ రాజేశ్వరి ఎవరనుకుంటున్నావో! రాచబిడ్డరా. రాణాప్రతాపులవంశపు మొలక. ఆ చెయ్యి నరికినట్టే, ఆ తల ఎగరేయడానికి కూడా ఎంతోసేపు పట్టదు. కానీ వదిలి పెడుతున్నాను, ఫో ఇక్కడినించి' అని అరిచింది. ఇంకేం జరుగుతుందోనని నేను భయంతో బిగుసుకుపోయేను.

సైదులు వెనక్కి తిరిగి వెళ్లిపోయేడు. అమ్మ వెంటనే తనని తాను పొడుచుకుంది అదే కత్తితో. చచ్చిపోతూ, 'ఒరేయ్ శిఖీ, ఈలోకం చూశాను. ఇంక అవతల ఎలా ఉంటుందో చూస్తాను' అంది. అమ్మ లేదింక.

నన్ను గాలిలోంచి తీసుకుని పెంచుకుంది. గాలిలోనే వదిలేసి వెళ్లిపోయింది. నాకు బుద్ధి తెలిసినప్పటినించీ అమ్మ ఒక్కతే. అందుకే అమ్మ నన్ను వదిలిపెట్టినా నేను అమ్మని వదిలి పెట్టను. నేను ఇక్కడే ఉంటాను. నామీద కోపం తెచ్చుకోవు కదూ.

శిఖి.''

''అయ్యో, నువ్వింకా ఏదో ఘనకార్యం సాధిస్తావనుకున్నాను కానీ ...'' కనపడని రాజేశ్వరినుద్దేశించి ఘోషించేను.

ooo

(ఆంధ్రసచిత్ర వారపత్రిక. జులై 12, 1966)

# 23. మా మే స్త్రీత్వమ్

ఆకునంటిపెట్టుకుని గూడు కట్టుకున్న గొంగళిపురుగులా భూదేవిని నమ్ముకుని పడుకున్న ఆ ఊరిప్రజల్లో చలనం కలిగించగలిగినవి చాలా తక్కువ. ఎలక్షన్లవంటి ప్రాపంచికవిషయాలూ, బాలయోగులవంటి ఆముష్మికచింతనలకూ కూడా అతీతులు వాళ్ళు. కళ్ళెదుట ఖూనీ జరిగితే ఓమారటు చూసి చుట్ట వెలిగించుకు వెళ్ళిపోయే జాతి అది. అక్కడ అన్యాయం లేదు. ఎందుకంటే ఎవడూ ఎవణ్ణీ కొట్టడు కనక. అక్కడ న్యాయం లేదు. ఎందుకంటే ఎవడికైనా దెబ్బ తగిలితే రెండోవాడు కలగజేసుకోడు కనక. స్వర్గమూ నరకమూ రెండూ తెలీవు వాళ్ళకి.

ఆ స్తబ్ధజగతిలో కించిత్ చలనం కలిగించింది ఆమె రాక. ఆమె అక్కడికి ఎలా వచ్చిందో ఎందుకు వచ్చిందో ఎవరికీ తెలీదు. ఒకానొక సుప్రభాతాన ఊరు ఆవులించి కళ్ళు విప్పితే ఆమె కనిపించింది. అంతే.

"ఎవరు నువ్వు?" అని ఎవరూ అడగలేదు. ఊరిచివర కూలిపోతున్న పాడు దేవాలయంలో ఆమె పాతచీర పరుచుకుని పడుకుంటే ఎవరూ కాదనలేదు.

మర్నాడు స్నిగ్ధత్వం విరిసే కన్నులతో, చిరునవ్వులొలికేవదనంతో వీధిలోకి వచ్చింది. ఆ వీధుల్లో ఎవరూ కొంపలంటుకుపోతున్నట్టు పరుగులు పెట్టడం లేదు. పని గట్టుకుని 144 సెక్షను వ్యతిరేకిస్తున్నట్టు రోడ్డుకడ్డంగా సైకిళ్ళు పట్టు నిలబడి అప్రస్తుతాలు చర్చించే గుంపులు లేవు. ఆమె ముందుకి సాగిపోతూనే ఉంది.

ఒకచోట ఆగింది. అక్కడ ఒక లేగదూడ పడి లేవలేక అవస్థ పడుతోంది. ఆమె చుట్టూ చూసింది. ఎవరూ లేగదూడని గమనించినట్టు లేదు. తనే వెళ్ళి మెల్లిగా దాన్ని లేవదీసింది. అతికష్టంమీద దాన్ని ఇంటికి చేర్చింది.

దారిలో ఒకరిద్దరు ఆమెని వింతగా చూసేరు. "నీకెందుకు ఈ బాధంతా?"

ఆమె మౌనంగా సాగిపోయింది. ఇంటికి దాన్ని తీసుకెళ్ళి ఆకుపసరు రాసింది. రెండు రోజులు పట్టింది దూడ లేచి తిరగడానికి. మూడోరోజు దూడయజమాని వచ్చి దాన్ని తోలుకుపోయేడు. వెళ్తూ వెళ్తూ తన విశాలమైన కళ్ళతో ఓమారు ఆమెవేపు చూసి వెళ్ళిపోయింది ఆ లేగదూడ.

000

మరొకరోజు, చాలా రోజులతరవాత, అలా వెళ్తుంటే ఒక పదేళ్ళకుర్రాడు ఏడుస్తూ కనిపించేడు.

"ఎందుకేడుస్తున్నావు?" అని అడిగింది ఆవిడ.

"నీకెందుకూ?" అన్నాడు ఆ కుర్రాడు.

"అవును. నీకెందుకూ?" అంది ఆ కుర్రాడిపక్కనే ఉన్న తల్లి.

"ఊరికే అడిగేను," అంది ఆమె మందహాసంతో.

ఆ కుర్రాడూ, తల్లీ ఇద్దరూ ఆశ్చర్యపోయేరు.

"మాయింటికి వస్తావా?" అంది ఆమె.

"సరే"నని ఆ బాలుడు ఆమెననుసరించేడు.

ఇది కొత్తవిషయమే. అయినా అందరికీ సహజంగానే తోచింది. ఆ కుర్రాడు వరసగా వారంరోజులు ఆమెయింటికి వెళ్ళేడు.

ఒకరోజు అడిగేడు, "ఎందుకు నన్ను ఇలా రమ్మంటున్నావు?" అని.

"నాకు నీలాటి కొడుకు ఉండేవాడు. నిన్ను చూస్తే వాడిని చూసినట్టు ఉంటుంది," అని ఆమె సమాధానం చెప్పింది.

"ఓహో," అన్నాడు కుర్రాడు సరిగ్గా అర్థం కాకపోయినా.

ఊళ్ళో అందరూ కొత్తమ్మ కోరుకున్నకొడుకు అని అతన్ని హేళన చేసేరు.

వాడికి రోషం వచ్చింది. ఆమెయింటికి వెళ్ళడం మానేశాడు. ఆరాత్రి ఆమె కన్నీటితో కనిపించింది, "మాయింటికి ఎందుకు రాలేదు?" అని అడిగినట్టనిపించింది. నిద్ర లేవగానే పరుగెట్టుకుంటూ అక్కడికి వెళ్ళేడు.

ఆమె చెంపన చేయి చేర్చి దిగంతాల్లోకి చూపులు నిగిడ్చి చూస్తూ కూర్చుని ఉంది.

"నేనొచ్చేనమ్మా!" అన్నాడు ఉద్వేత్తుగా పొంగుతున్న గుండెలను కంఠస్వరంలో విశదం చేస్తూ.

ఆమె అతడివేపు తిరిగింది, "ఫో, ఫో. ఎందుకొచ్చావ్. ఇక్కడేం దాచిపెట్టేవా రోజూ రావడానికి? నేనేమేనా అచ్చున్నానా నీకు చేసిపెట్టడానికి .. వేలు చూపితే మండ మింగే రకాలు. ఛీ. ఛీ. ఇంకెప్పుడూ ఈచాయలకు రాకు."

అబ్బాయికి అంతా అయోమయంగా ఉంది. ఆమెమాటలు ఏమీ అర్థం కాలేదు. "ఫో" అన్న మాట ఒక్కటే తెలిసింది. వాడు గిరుక్కున తిరిగి వెళ్ళిపోయేడు. దారిలో ఓ చెట్టుకింద కూచుని ఏడిచేడు కొంచెంసేపు.

తలెత్తి చూస్తే ఆమె రెండు పూతరేకులు పట్టుకుని నించుని ఉంది. "ఇంద," అంది.

"నాకేం అఖ్ఖర్లేదు," అంటూ లేచి పరుగెట్టుకు వెళ్ళిపోయేడు.

"పోతే ఫో. బ్రతిమాలితే గీరెక్కువవుతుంది. పుణ్యానికి పుట్టెడు బియ్యం ఇస్తే పిచ్చకుంచంతో కొలిచేవని పోట్లాడిందిట. నేనేమీ ఎవరికీ ఋణపడిలేను," అంటూ ఆమె గొణుక్కుంటూ వెళ్ళిపోయింది.

క్రమంగా ఆమెనుగూర్చి ప్రజలు గుంపులు గుంపులుగా చేరి చెప్పుకోసాగేరు. "ఎవరెలా పోతే నాకేం?" అన్న భావం మంచులా విడిపోతోంది వాళ్ళలో. ప్రతివాళ్ళూ మాటసాయం కావాలనో పనిసాయం కావాలనో ఆమెదగ్గరికి వస్తున్నారు. ఒక మంచిపని చేసి "కొత్తమ్మ"తో గొప్పగా చెప్పుకునేవాళ్ళు అనేకులు ఉన్నారు.

ఒకొకప్పుడు ఆమె హర్షం వెలిబుచ్చుతుంది. ఒకొకప్పుడు "అదీ గొప్పేనా?" అంటూ తేల్చిపారేస్తుంది. మరోసారి, "అలా కాదు, ఇలా చెయ్యాలి," అని చెబుతుంది. లేదా తనే చేసి చూపిస్తుంది. ఒకమారు పాలమనిషి ఆవు కొమ్ము విసిరి మంచం పట్టిందని వాళ్ళింట్లో వారంరోజులుండి సేవ చేసిందిట. మరోరోజు నారపరాజుగారి చిన్నకోడలు "కాస్త నలతగా ఉంది. చూసి పో," అని కబురు చేస్తే, "ఏం కావరం ఇంటికి రమ్మని కబురు చేయడానికి. ఫో, ఫో. రానని చెప్పు," అని కసిరికొట్టిందిట. అయినా ఆమె అంటే అందరికీ ఎనలేని ఆపేక్షా,

భయమూను. ఒకమారు కాకపోతే ఒకమారైనా ఎక్కువ చనువు చూపగలిగింది అబ్బాయి ఒక్కడే. వాటికి ఆమె కసుర్లూ, విసుర్లూ, ఆగ్రహమూ, అనుగ్రహమూ - అన్నీ ఒకటే. ఒక్కొక్కమారు వాడికి రోషం వస్తుంది. కోపం వస్తుంది. అవన్నీ వాడు ఆమెదగ్గర్నుంచే నేర్చుకున్నాడు.

అలాగ రోజులూ, వారాలూ, నెలలూగా నాలుగు సంవత్సరాలు జారిపోయేయి. అబ్బాయి కొంచెం పెద్దవాడయేడు. ఆమెలో కొంచెం వార్ధక్యపుఛాయలు కనిపిస్తున్నాయి. ఊళ్ళో ఉత్తేజం కనిపిస్తోంది.

ఆరోజు పోలేరమావాస్య. పోలి స్వర్గానికి వెళ్ళిన పర్వదినం. అబ్బాయి అప్పటికి నాలుగు రోజులుగా అమ్మదగ్గరికి వెళ్ళలేదు అలిగి. అదే మరోసందర్భంలో ఐతే ఆమె స్వయంగా వచ్చి పిలుచుకు వెళ్ళేది. కానీ ఈమారు రాలేదు. అబ్బాయికి ఓర్పు నశించింది. ఏ విషయం ముఖాముఖీ తేల్చుకోవాలనుకున్నాడు. విసురుగా లేచి నిముషాలమీద ఆమె జీర్ణకుటీరం చేరుకున్నాడు. అక్కడ ఆమె ఒంటరిగా లేదు. ఒక బాలుడిని అక్కున చేర్చుకుని లాలిస్తోంది. నెన్నుదురు మృదువుగా చుంబిస్తోంది. వాడి చెంపలు నిమురుతోంది.

ఒక మధ్యవయస్కుడు ఇదంతా ఇష్టం లేనట్టు గవాక్షం దగ్గర నిల్చుని సుదూరాల్లోకి చూస్తున్నాడు. ఆగి ఆగి తూచినట్టు ఒక్కొక్క మాటే పలుకుతున్నాడు, ''జరిగిపోయిందేదో జరిగిపోయింది. ఇప్పుడు వచ్చేయమ్మా అంటే నీకెందుకింత పట్టుదల? నిన్నేమైనా నేనక్కడ రాళ్ళు మొయ్యమన్నానా? అదీ నాకోసం అయితే నేనింతగా పాకులాడనే ఆడను. .. ఆ పసివాడికోసం ... ఇంతకీ నీకు ... మాకంటే .. ఈ పసివాడికంటే వీళ్ళే ఎక్కువయిపోయారు.'' చివరిమాటలు అంటుంటే అతడికంఠం గద్గదమయింది.

''చాల్లే, మాటలు నేర్చేవు,'' అని కసిరింది ఆమె. ఆ స్వరంలో కాఠిన్యంకంటే మార్దవమే హెచ్చు. గెలుపెవరిదో తెలిసిపోయింది.

అబ్బాయి గిరుక్కున వెనక్కి తిరిగేడు. ఝంఝంమారుతంలా ఊరివేపు సాగి, దారిలో చెట్టుకింద ఆగేడు. అతనికన్నులలో ఎరుపుజీర మెరుస్తూంది. హృదయం తీవ్రంగా కొట్టుకుంటూంది. ''సరే, సరే,'' అనుకుంటూ కదిలిపోయేడు. దారిలో అడిగినవాళ్ళకీ

అడగనివాళ్ళకీ వివరించి చెప్పేడు. కనిపించనివాళ్ళకి కబురు చేసేడు. కొందరు అతన్ని ఓదార్చేరు. కొందరు అతన్నే చీవాట్లు వేసేరు. మరి కొందరు ఉచితసలహాలు ఇచ్చేరు.

అబ్బాయికి తోచడంలేదు.

ఏదో అన్యాయం జరుగుతోంది.

అదేమిటో స్పష్టంగా చెప్పలేకపోతున్నాడు.

మాటలు దొరకడంలేదు.

తమస్సు కమ్ముకొస్తోంది.

లోకం నిద్రకొరిగింది.

... ... ...

"అమ్మా!" చీకట్లు చీల్చుకు ఒక పసివాడి ఆక్రందన దిక్కుల పిక్కటిల్లింది.

జరిగింది తనకి తెలీదంటూ కర్మసాక్షి అప్పుడే ఉదయించేడు.

ఆమె గదిమధ్య నిలబడి ఉంది నిశ్చలంగా.

మంచంమీద పసివాడు నీరసంగా పడి ఉన్నాడు.

వాడిని తీసుకువచ్చిన మధ్య వయస్కుడు దూరంగా గోడనానుకుని నిల్చుని ఉన్నాడు.

గోడవతల అబ్బాయి పశ్చాత్తాపంతో దహించుకుపోతున్నాడు.

ముగ్గురు మూర్ఖులు ఆమెపాదాలు పట్టుకు వదలడంలేదు. "నువ్వు క్షమించాను అన్నదాకా మేం వదలం. క్షణికమైన ఆవేశాలకు లొంగిపోయేం. మావంటి పాపాత్ములు లోకంలో మరి ఉండరు. మా పాపానికి ప్రాయశ్చిత్తం ఉండదు. చెప్పు తల్లీ, ఏ శిక్ష అయినా అనుభవిస్తాం. నీ కోపాగ్ని మాత్రం భరించలేం. ... చెప్పు .. క్షమించు."

ఆమె వాళ్ళవేపు చూసింది. వీళ్ళని ఈ స్థితికి తెచ్చిందెవరు?

మంచంమీద పసివాడివేపు చూసింది. "నాకెందుకు ఈ శిక్ష?" అని ప్రశ్నిస్తున్నట్టు అనిపించింది ఆమెకి.

కనురెప్పలు బరువుగా కదిల్చి కుడివేపు గోడవారకి దృష్టి మళ్ళించింది.

‘‘ఇప్పుడేం చెయ్యగలవు?’’ అని నిందిస్తున్నాడు అతను మౌనంగానే.

ఆమె కనులు మూసుకుంది. మనోఫలకంపైన అబ్బాయి చిత్తరువు అస్పష్టంగా కదిలింది. ఆమె పెదవులు కదిలేయి.

భగవాన్!

మా మే స్త్రీత్వమ్

మా మూర్ఖత్వమ్

మిధ్యా దృష్టిర్మా ..

జాతౌ జాతౌ ... మా మే స్త్రీత్వమ్ ...

000

(అక్టోబరు 1966 కృష్ణవేణి మాసపత్రికలో ప్రచురితం.)

# 24. కాశీరత్నం

"బాబూ, ఒక్కచుక్క కాఫీ పోస్తావా?"

అప్పుడే కాలేజీనుంచి వచ్చి వరండాలో కాఫీగ్లాసు పట్టుకుని ఆయాసపడుతున్న నేను ఆ కొత్త బిచ్చగాడివేపు చూశాను వింతగా. కాలపురుషుడి వినోదకేళి కాకపోతే మాదాకవళం, గుక్కెడుగంజినీళ్లూ, యాచించే రోజులు పోయి, కాఫీకీ, సిగరెట్లకీ చెయ్యి చాచే రోజు రావడం ఏమిటి? వృత్తికి యాచనైనా మనేది మనిషిగానే కదా అని కాబోలు ... కానీ, మరుక్షణం నాలో చిరాకు పరాకు చిత్తగించింది.

"ఏమిటయ్యా ఆలోచిస్తున్నావు? నువ్వు ఎంతమందికి ఎన్నిమార్లు హోటళ్లలో ఇప్పించేవో, ఎంతమందిదగ్గిర పుచ్చుకున్నావో? అంత ముందూ వెనకా చూడ్డానికి నేనేమైనా నీ ఆస్తి అడిగేనా? ఆదాయం అడిగానా? కాదూ పోదూ అంటే నీ ఇంటిపడుచుని కోరేనా?" పొదలమీసాల్లోంచి ముసిముసినవ్వులు కురిపించడం అంతచిరాకులోనూ నన్ను మురిపించింది.

మనిషిని మరోమారు చూశాను. అనకాపల్లి బాణాకర్రలా నిలవేస్తే నలుగురికి జవాబు చెప్పేలా వున్నాడు. ముసలితనం ముంచుకొస్తున్నా పడచుదనపు కొసమెరుపులు ఇంకా కొసరుతున్నట్టే వుంది. అరవై దాటేసినా హాయిగా నవ్వుతూ రాజెవరి కొడుకన్నంత ధీమాగా నిలబడి, గుక్కెడు కాఫీ కోసం వెండిగ్లాసు పట్టుకు వచ్చిన ఆ వృద్ధుడిని చూస్తే మనస్సు ఎందుకో క్షణకాలం పరవశించింది.

"ఏం కాఫీ లేకపోతే వుండలేవా?" అని అడగాలనిపించినా, పెదిమ కదిపే ఓపికలేక మౌనంగానే నాగ్లాసు అతనిగ్లాసులోకి వొంచేను.

నామనస్సులో మాట కనిపెట్టినట్టు, "నాక్కాదు బాబూ," అన్నాడు.

నాభావం కనిపెట్టాడన్న బాధా, అడగనిప్రశ్నకు జవాబు చెప్పేడన్న కోపం, ఇహ ఇప్పుడు "ఇంటికాడ జొరంతో పడున్న ఏముసిల్దాని" కథో మొదలుపెడతాడేమోనన్న చిరాకూ మేళవించగా, "సర్లే, వెళ్లు," అన్నాను.

"కోపం ఎందుకయ్యా? అసలు కథ తెలిస్తే అలా కసిరేవాడివా? కంట తడి పెట్టవా?"

"షటప్," అనబోయి ఆగిపోయాను. ఒక్కొక్క మొహం చూస్తే తిట్టడం కూడా కష్టమే.

తాత నవ్వేడు.

ఛీ, ఛీ, తల తీసినపని. మనస్సులో మాట మొహంలో చదివేస్తున్నాడు. పండితుడిలా మాటాడుతున్నాడు. అంతా వింతగా వుంది. తెగించి అడిగాను, "ఎవరు నువ్వు?"

"నేనా?" మళ్లీ అదే నవ్వు.

"ఏం, కేసు పెడతావా? రామదాసంటే తెలీని పోలీసు లేడు. పనిప్పిస్తావా? చేయలేని పని లేదు. నీకు కాలక్షేపం అని అడిగితే మటుకు నాసంగతి కనుక్కోలేవు," పందెంవేసినట్టు మందహాసం చేసేడు, కనుబొమ్మలు ఎగరేసి.

నేను మాటాడలేదు.

తాత వెనక్కి తిరిగి మళ్లీ గిరుక్కున ఇటు తిరిగేడు, "అయితే ఇది ఏనెల బాబూ?"

"నవంబరు," అన్నాను ముక్తసరిగా.

"తెలుగులో చెప్పు," అన్నాడు తాత.

"నాకు తెలీదు."

మళ్లీ అదే నవ్వు. "నెలలుకూడా తెలీక ఏం చదివావు? పిల్లలకి ఏం చెపుతావు?"

నాకు ఒళ్లు మండింది. "పంచాంగం కాదులే," అన్నాను పళ్లు గిట్టకరిచి.

తాత నామాట వినిపించుకున్నట్టు లేదు. వేళ్లు గుణించుకున్నాడు. కళ్లు మూసుకున్నాడు. ఏదో గుర్తుకొచ్చినట్టు గబగబా గేటువేపు నడిచాడు. ఏ గోడో అడ్డం తగిలినట్టు గతుక్కుమని కుడివేపు తిరిగి మూడడుగులు వేశాడు. అక్కడ ఓ చదరపుటడుగు మేర పరీక్షగా చూడసాగాడు.

రెండు నిమిషాలు గడిచాయి. అక్కడ మామిడిచెట్టే మొలిపిస్తాడో! చెవులపిల్లినే పుట్టిస్తాడో! ఎదురుచూస్తున్నాను.

"చూశావా ఇక్కడ? ఈవేళకి మూడోరోజున మొక్క మొలుస్తుంది. నామాట పొల్లు పోదు. జరిగింది చెరిగిపోదు. మణమ్మకథ కల్ల గాదయ్యా. ఆ తల్లి దేవత. నమ్మినవాళ్లు నమ్మేరు. నమ్మనివాళ్లకు ఆ తల్లే చెబుతుంది," తాత నావేపు చూడకుండానే గొణుక్కుంటూ చేతిలో కాఫీ అక్కడ పోశాడు.

"అదేమిటి, కాఫీ పారబోస్తావు? ఒంటిమీద తెలివి లేదా? బుద్ధి పనిచెయ్యడంలేదా?" గట్టిగా అడిగేను, నాకూ తనకూ కాకుండా నేలపాలయిన ఆ జీవనగంగను తలుచుకుని.

తాత మెల్లిగా వచ్చి అరుగుమీద స్తంభాన్ని ఆనుకుని చతికిలబడ్డాడు.

"బాబూ దేవుడంటే ఏమిటి? దేవుడంటే మంచితనమే. మనం ఉండిపోం. మాట ఉండిపోతాది. ఆలాటిపిల్ల మామణమ్మ. పేరులాగే రూపం. మణిదీపంలా మెరిసిపోయేది. గట్టిగా చూస్తే కందిపోతుందనిపించేట్టుండేది. దానికి తగినగుణం. ఎందుకయ్యా మనమూ బతికేం. తాను ఓబతుకే తవుడూ ఓరొట్టే అన్నట్టు. హంసలా ఆర్నెల్లు బతికినా చాలు. మామణమ్మ అలాగే మెరుపులా క్షణం బతికింది. ఆక్షణంలోనే అందరిచేతా అవుననిపించుకుంది. పెళ్లివాటికి పధ్నాలుగేళ్లు. పట్టుమని నాలుగు నెల్లయినా కాకుండా బూడిదయిపోయింది. ఈచేతులతోనే మట్టి చేసేశాను," తాత పైపంచె అంచుతో కళ్లు తుడుచుకున్నాడు.

"ఆమె నీకేం కావాలి తాతా?" అన్నాను. నామనసు ఆర్ద్రమయింది.

"ఏం కావాలి బాబూ? ఎవరైనా ఎవరికైనా ఏటవుతారు? ఎత్తింది మనిషిజన్మ. ఇన్సాన్ బాబూ. ఆటల్లోనైనా ఒకరిని మాట అని ఎరగదు. కలలోనైనా ఎదటి చెరుపు కోరలేదు. దేహి అన్నవాడికి నాస్తి అనలేదు. ఇల్లు గుల్లయిపోతోందని తల్లి గోలెడితే, నువ్వు సంపాదించేవా అని నిలదీసింది. నేనివ్వకపోతే ఉండిపోతుందా అని దండించింది. పదేళ్లయినా లేని ఆ పిల్ల తీర్పులకు అయినపెద్దలే తలలొంచుకునేవారు."

అంతలో ఏదో మునిగిపోయినట్టు తాత తుళ్లిపడి, "వస్తానయ్యా" అంటూ వెళ్లిపోయాడు. మరోపనిలేని నేను ముగ్ధమోహనమూర్తి, భువనైకసుందరి, సుగుణఖని, ధీమంతురాలు అయిన ఆ చిన్నారిని ఊహిస్తూ, ఆ చిరంజీవికీ మూడురోజులనాడు మొలవబోయే మొక్కకీ సంబంధం వెతుకుతున్నాను.

వారంరోజులయింది. పనిలేని నామనసు వెనక్కు తిరిగింది. వీధివాకిలికి మూడడుగుల దూరంలో కాంపౌండుగోడకి దగ్గిరగా జానెడుతీగె తోకమీద నిలబడిన పసిరికలా ఊగుతూ నాదృష్టికి తగిలింది. అట్టే చూస్తూ వుండిపోయేను. కొత్త స్ప్రింగులా కొన ఉంగరాలు తిరిగి నీరెండలో నిగనిగలాడతోంది. అప్పుడే విడ్డ మూడాకులు ముచ్చటగా ముదురురంగు పులుముకుంటున్నాయి అలవాటులేని ఆర్టిస్టులా. దేవుడు బొత్తిగా లేడన్నమాట నిజం కాదేమో! ఎక్కడా గొప్పు తవ్వినజాడ లేదు. విత్తు నాటిన ఆనవాలు లేదు. ఈ మొలకకు నారు పోసిన మాలి ఎవడు? నీరు పోసే దాత ఎవడు?

గేటుచప్పుడుకు అటు తిరిగాను. తాత! నాలుగు పాతవెదుళ్లు పట్టుకువచ్చాడు.

"దానికి పందిరి వేస్తావా?" అన్నాను. అందులో అతనికి వున్నఆసక్తి ఇంకా నాకు ఆశ్చర్యమే మరి!

"అవునయ్యా! ఇది ఇప్పటిదా? మీసాలు మొలవకముందు వచ్చానిక్కడికి. కొసకాలానికి కాకుండా పోతానా? ఆ తల్లి వెళ్లిపోతూ చెప్పింది, 'తాతా అదే నేననుకో. కనిపెట్టి చూసుకో' అని."

తాత పనిలో మునిగిపోయాడు. నేను కొంచెందూరంలో నిల్చుని చూస్తున్నాను.

"ఇంతకూ ఆ మొక్క ఎలా వచ్చిందో చెప్పేవు కావు," అన్నాను.

చేతిలో బొరిగె పక్కకు పెట్టి వెనక్కు తిరిగేడు తాత. "మాతల్లి వాక్శుద్ధి బాబూ. ఏ దేవతో శాపవశంచేత ఈ భూమ్మీద పుట్టిందనుకున్నాం. మొదట అందరిలాగే నేనూ నమ్మలేదయ్యా. చేసిన పాపం చెబితే పోతుందంటారు. గోరంతలు కొండంతలు చేస్తారు. అందిస్తే అల్లుకుపోతారు. ఇలాటి కతలు మొదలుపెడితే పాదరసంలా పాకిపోతాయనుకున్నాను. కాని ఒకరోజు బాబూ కడుపంతా కరకరలాడిపోనాది. ఆకిరికి బరించలేక బావిలోకి దూకేశాను.

బతుకుతానంటే గింజలెట్టదు పాడులోకం చస్తానంటే ఒల్లకుండదు. పదిమందీ కలిసి పైకి లాగేశారు. ఆ పక్కనే ఆడుకుంటున్న మణమ్మ నన్ను చూసి పక్కున నవ్వింది. 'నీకేం జబ్బు. ఈ పండు తిను, పరమాత్మను తలుచుకో. రేపు మాయింట విందుకు రా,' అంది తనచేతిలో పండు నాచేతిలో పెడుతూ. అంతే. అందులో మాయేంటో నాకిప్పటికీ అంతు చిక్కలేదు. మంత్రించినట్టు మాయమయిపోయింది నాకడుపులో నొప్పి. ఆ రోజు ఆరుబళ్ల బియ్యపు బస్తాలు అవలీలగా మోసేశాను.''.

నాకు కాళ్లు పీకుతున్నాయి. అసలు సంగతికి ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూస్తున్నాను. కర్రగుర్రంలా ముందుకీ వెనక్కీ ఎంత ఊగినా అంగుళం ముందుకి జరగలేదు కదా!

''వాడ వాడంతా ఒక్కతాటిమీద నడిచాం. ఆవిడ వాక్కే వేదం. పలుకే బంగారం. కాని ఎన్నాళ్లో జరగలేదలాగ. చెట్టు చెడేకాలానికి కుక్కమూతిపింజలని వూరికే అన్నారా? యాదవకులంలో ముసలం ఎవడో లేచాడు. చెరుకుగడలా ఎదిగిపోతున్న పిల్లని ఎన్నాళ్లు ఇంట్లో పెట్టుకుంటావంటూ.'' ఆ పిల్ల ఆమూర్ఖుణ్ణి చూసి నవ్వింది.

''నాకు పెళ్లేమిటయ్యా! నేను సతీదేవిని. ఆయుస్సే లేదు నాకు. సంసారం ఏమిటి? నీకు కావాలంటే నిక్షేపంలాటి పిల్ల వుంది. చూపిస్తాను. కాదంటే వాదే లేదు' అంది. కాని లోకం, బాబూ, ఆ తండ్రి తలెత్తుకు తిరిగేరోజు కరువైపోయింది.

'సతా, యతా?' అంటూ వేళాకోళాం మొదలుపెట్టారు జనాలు. ఏదో మాయ చేస్తూందని గోల పెట్టారు. అంతు తేలుస్తాం అని కొందరు ముందుకొచ్చారు. ఓరోజు తెల్లారేసరికి ఇంటిముందు పోగయ్యారు. ఏమిటి నీగొప్పని ఎదురు తిరిగారు.

తండ్రి వచ్చి ఆపిల్ల చేతులు పట్టుకుని కళ్లనీళ్లతో ప్రశ్నించాడు, 'అమ్మా, ఇప్పుడు మార్గం ఏమిటో నువ్వే చెప్పు. ఒప్పయినా పదిమందిని ఒప్పించినప్పుడే రాణిస్తుంది. ఇంత తెలిసిన నీకు ఇది తెలీదా?' అని.

''మణమ్మ అందర్నీ అవలోకించింది. మందహాసం చేసింది. 'సరే కాగల కార్యం గంధర్వులే తీరుస్తారు. మీఇష్టం వచ్చినట్టే కానివ్వండి. ఆపైన మీరు విచారించవద్దు.

అపనమ్మకం ద్వాపరయుగంలోనే ప్రారంభమయింది. ఇప్పుడు మిమ్మల్ని నేను తప్పుపట్టను. అయినా చెబుతున్నాను. ఈ కాఫీ ఇక్కడ పోస్తున్నాను. ఇవేళకి ఏడోరోజున ఇక్కడ కాశీరత్నం తీగె మొలుస్తుంది. దాని ఆయుస్సే నా ఆయుస్సు' అంది. ప్రజలు నిశ్చేష్టులయి నిలబడిపోయారు. ఒక్కరికీ నోట మాట రాలేదు. బుద్ధి పనిచేయలేదు. ఆ ముఖంలో దివ్యవర్చస్సు కన్నార్పకుండా చూస్తూ నిల్చుండిపోయారు. కాలిబొటనవేలితో నేల చివ్వి తాగుతున్న కాఫీ పారబోసింది. సరీగ్గా ఇదే స్థలం. ఉత్తములలీలలు చిన్నబుద్ధులకు అందవు. కాఫీ పోస్తే మొక్క మొలవడమేమిటని నలుగురూ నాలుగు విధాలా అనుకున్నారు. నిజం చెప్పొద్దూ, నాకూ చిత్రంగానే తోచింది. అదీకాక మా మణమ్మ విషయంలో కాఫీకీ ప్రాణానికీ లంకె. చెప్పానుకదా పెద్దలచైదాలు చిన్నలకగమ్యగోచరమని. నాలాటివాళ్లకర్థం అయ్యేదల్లా కాకి వాలడానకీ తాటిపండు రాలడానికీ లంగరెయ్యడమే.!

"ఆపెద్దాయన వేట సాగిస్తూనే వున్నాడు. ఈ పిల్ల చిదానందమూర్తిలా నిశ్చింతగా తిరుగుతూనేవుంది. అయితే ఆ అమ్మాయి అన్నరోజుకు కాశీరత్నం మొక్క మొలవడం అందర్నీ అవాక్ చేసింది. సవాలు చేసినవాళ్లంతా పరారి అయేరు. కాని, మాట పడినమనస్సు తిరగబడక ఊరుకోదు. ఊరూరా తిరిగి తిరిగి వేసారిన ఆ తండ్రి మణమ్మముందు దిగాలుపడి నిలబడ్డాడు. "నువ్వేదో మాయలమారివనీ, నీకు క్షుద్రదేవతలు వశం అనీ లోకమంతా గగ్గోలు పెడుతోంది. నిన్ను చేసుకోడానికి మగాడన్నవాడు ఎవరూ ముందుకు రావడంలేదు. ఇంత తెలిసినదానివి ఇది తెలీదా. నీకు తాళి కట్టే ధీరుడెవరో నువ్వే చెప్పు' అని అడిగాడు.

"కాశీరత్నం ననలు ఒడుపుగా పందిరిమీదికెక్కిస్తున్న మణమ్మ ఫక్కున నవ్వింది. 'ముందే అడగకపోయినావా? పొరుగుగ్రామంలో పాపయ్యగారిని కనుక్కో' అంది. తండ్రి తెల్లబోయాడు. నలుగురూ ముక్కున వేలేసుకున్నారు. ఆరా తీస్తే అబద్ధం కాదని తేలింది. ఆ ఊరిమోతుబరి పాపయ్య. ఆయనగారి మూడోకొడుకు ఉక్కుచువ్వలాటి యువకుడు అమ్మాయిని చూడకుండానే చేసుకోడానికి సిద్ధపడ్డాడు. 'నానెత్తిన పాలవాన పడిందని' ఆ తండ్రి ముక్కోటిదేవతలకూ దండాలు పెట్టుకున్నాడు. పెళ్లి అయిందనిపించేసరికి పెద్దలంతా తలపుకొచ్చేరు."

తాత నిట్టూర్చాడు, అలుపు తీర్చుకోడానికి కాబోలు. నేను మటుకు ఆలస్యం భరించలేకపోతున్నాను. డిటెక్టివ్ నవలలు కూడా చివరిపేజీ మొదట చదివేసే తత్త్వం నాది. ఎంత ముసలివాడైనా ఇంత నానిస్తే ఎలా భరించడం?

"అసలు ఆఖరికి ఏం జరిగింది?" అన్నాను.

"'అయిపోయింది," అన్నాడు తాత.

"అది కాదు," అన్నాను క్షమాపణగా.

తాత మటుకు తీవ్రంగానే వుండిపోయాడు. "నిజమేనయ్యా! ఆ రోజుతో అంతా అయిపోయింది. పోతూ పోతూ మణమ్మ 'మొక్క చూసుకో' అంది. అంతే. మళ్లీ ఆ తల్లి ఈ గడ్డమీద పాదం మోపలేదు. ఆనాడు ఋష్యశృంగుణ్ణి తీసుకొచ్చినట్టు ఈ భూమిమీద పంటలు పండడానికీ, మాగుండెల్లో వానజల్లు కురిపించడానికీ తెచ్చుకున్నాం. మాపని కాగానే పంపించేసేం."

జరిగిన అకృత్యాలకి స్వయంగా తను బాధ్యత వహిస్తూ బాధపడుతున్న ఆ వృద్ధుణ్ణి చూసి జాలి పడాలో నిరసించాలో నాకే తెలీలేదు.

"వస్తా బాబూ," అనేసి వెళ్లిపోయాడతను. నాకు విసుగేసింది. మరీ ఈమధ్య వచ్చే సీరియల్స్ లాగ ఇదేమిటి?

సూపర్‌ఫాస్ఫేట్ తోటలా కాశీరత్నం తీగె ననలు తొడిగి సాగి హుషారుగా అల్లుకు పోతూంది. తాత రోజు వచ్చి దానికి సకల సపర్యలూ చేసి వెడుతున్నాడు. దానికి కాఫీయే పోస్తున్నాడో గ్రైప్ మిక్స్చరే పోస్తున్నాడో ఎప్పుడైనా అనుమానం వచ్చినా అడిగే ఓపిక నాకు లేకపోయింది.

ఓనెల రోజులయిందేమో. ఆవేళ మామూలుగానే నేను వరండాలో కూర్చున్నాను.

తాత వచ్చి కాశీరత్నం పందిరిని పలకరించి, రోజూలా వెంటనే వెళ్ళిపోలేదు. అలా చూస్తూ నిలబడిపోయేడు.

"ఏం తాతా! నీ మణమ్మకి ఎక్కడైనా దెబ్బ తగిలిందా?" అన్నాను హేళనగా.

తాత మౌనంగా ఇటు రా అన్నట్టు సౌంజ్ఞ చేసేడు. ఆతని ప్రవర్తనలో నిర్లక్ష్యానికి నాఆత్మగౌరవం దెబ్బదిన్నా, మొదటితప్పుకింద క్షమించి అక్కడికి వెళ్లేను.

"చూడు. ఇది మొదలు. ఇలా వాడిపోతుంది. ఇంక పువ్వులుండవు," అన్నాడు.

నిజమే. కొన్ని కొసలు విరిగినట్టున్నాయి. కొన్ని రెమ్మలు రాలిపోయాయి. చాలామటుకు వసివాడి వుంది. కాని పందిరినిండా మొగ్గలు వున్నాయి.

"ఎందుకని?" అన్నాను, అతడివేపు తిరిగి. తరులతాగుల్మాదులగూర్చి నాకు తెలిసింది నిండు సున్నా.

"చెప్పేను కదయ్యా. మణమ్మ ముందే చెప్పింది పెళ్లికీ తనకీ పడదని. అలాగే అయింది. వారాలూ, వర్జ్యాలూ అన్నీ చూసుకుని, పసుపుకుంకుమలతో, సారెచీరెలతో అపురూపంగా పెంచుకున్న కూతుర్ని అత్తవారింటికి పంపించేరు. కాని అచ్చి రావద్దూ. కర్మశేషం ఉండిపోయి ఈ భూమ్మీద పుట్టినతల్లికి మానవధర్మాలతో పనేమిటి? అయితే అక్కడ ఆ సంగతి గ్రహించినవాళ్లేరీ? అమ్మాయి అదోలా ఉంటూందని హోరెత్తిపోయేరే కాని అసలు విషయం ఆరా తీసినవారే లేకపోయారు. అల్లుడు మటుకు ఏమీ అనేవాడు కాడట. అత్తగారూ, ఆడబడుచులూ, తోడికోడళ్లూ, బావగార్లూ, ఇరుగుపొరుగూ కాకుల్లా పొడిచేస్తున్నా, ఆమెభర్త మాత్రం అటుగానీ ఇటు గానీ పెదవి కదపలేదట. అలాగే పరమయోగిలా నిశ్శబ్దంగా వుండిపోయేట్ట. మిగిలినవాళ్లు మాత్రం ఉడికిపోయేరు ...

"మొదట్లో అంతా ఇంకా చిన్నతనం వదల్లేదు అనుకున్నారు. ధగ్గర కూర్చుని సుద్దులు చెప్పసాగేరు. కాని ఆ అమ్మాయిలో చలనం లేదు. వేళకి ఎవరైనా పెడితే తినేది, లేకపోతే లేదు. అలా పెరట్లో తులసిమొక్కదగ్గర కూచునేది. రాత్రి నిద్ర లేదు. పగలు భోజనం లేదు. 'ఇంటిమీద బెంగపెట్టుకున్నావా?' అని అడిగారు. లేదంది. ఆఖరికి మనసున లేనిమనుపేమోనని అనుమానపడ్డారు. కలకల్లాడుతూ నట్టింట నడయాడవలసిన కొత్తకోడలు మూతి ముడుచుకు కూచుంటే ఎవరికి మాత్రం మనసు విరగదా అని విసుక్కున్నారుట. ఆ పిల్ల మాత్రం దేనికీ జవాబు చెప్పలేదు.

"అలా రోజులు గడుస్తూ వున్నాయి. ఆ పిల్ల అక్కడ నిద్రాహారాలు మాని అలా శల్యమయిపోతూంది. ఇక్కడ ఈ మొక్క ఇలా వాడిపోతూనే వుంది,"

"అదేమిటి?" గతుక్కుమన్నాను.

"అదే బాబూ! అందరం ఆశ్చర్యపోయింది. అక్కడ ఆ అమ్మాయి భోజనం మానేసినరోజునే ఇక్కడ ఈ లత వాడిపోడం మొదలయింది. మరి పదిహేనురోజులనాడు అక్కడ మణమ్మ మొహం తిరిగిపడిపోయింది. అదే రోజున ఇక్కడ ఈ మొక్క పూలు పూయడం మానేసింది. అంతే ... ఆ తరవాత నెలరోజులైనా కాలేదు. ఒక్కరోజులో నిలువునా ఎండిపోయింది ..."

తాత గుక్కతిప్పుకోలేక మొహం కప్పుకున్నాడు పైపంచెతో.

నేను ఎంతసేపు అలా వుండిపోయేనో!

"రేపటినుండీ ఈ మొక్క పుయ్యదు," తనలో తను గొణుక్కుంటూ వెళ్లిపోయాడు తాత.

పందిరివేపు చూశాను. గులాబీముళ్లలా నిలువుగా, నున్నగా, నిగనిగలాడుతూ మొగ్గలు కనిపించాయి. కొన్ని ఇవాళ పూసి వాడిపోయేయి. కొన్ని రేపు విడాలి. విడితీరాలి. తాత సరిగ్గా చూడలేదా?

రాత్రంతా అవే ఆలోచనలు. ఎంత తొందరగా లేద్దామనుకున్నా, అలవాటయిన వేళ తప్పలేదు. ఇంగ్లీషులో వార్తలు వింటుంటే హఠాత్తుగా కాశీరత్నంపువ్వులసంగతి జ్ఞాపకం వచ్చింది. వరండాలోకి వెళ్తూ ఫలితాలకోసం చూసే పరిశోధకుడిలా కంగారుపడిపోయేను.

డామిట్! పువ్వులు లేవు!

"ఇంద, కాఫీ," అమ్మమాట విని వెనక్కి తిరిగేను.

అమ్మ తెల్లబోయి, "అదేమిట్రా, అలా వున్నావేమిటి? ఏమయింది?" అంది కంగారు పడిపోతూ.

అవును, ఏమయింది? ఏమయింది? "ఏంలేదు," అన్నాను.

"మరి అలా వున్నావేం?"

"ఏంలేదు," అని, కాఫీ తీసుకున్నాను. తాగబోతూంటే ఎవరో చేతిమీద కొట్టినట్టయింది.

అమ్మకి ఒకటే కంగారు. "ఏమిట్రా, ఒంట్లో బాగులేదా? ఏదీ చెప్పకపోతే ఎలా తెలుస్తుంది?"

"అది కాదమ్మా, మణమ్మకథ నీకు తెలీదు." ఆ కథ నేనే కనిపెట్టినట్టు అనిపించింది నాప్రాణానికి.

"మణమ్మెవరూ?" అమ్మకి ఇట్టే అనుమానం వస్తుంది.

"అదే .."

"ఏదీ?"

"అదే .. ఆ కాశీరత్నంమొక్కసంగతి తెలుసా?"

అమ్మ 'హమ్మయ్య' అన్నట్టు నిట్టూర్చింది. కాని ఇంకా ఆశ్చర్యమే. "ఏమయిందిప్పుడూ?"అంది. అంటే అమ్మకి కొంతలో కొంతయినా తెలుసన్నమాట.

కాలరు సర్దుకుని, కాలజ్ఞానతత్త్వాలు బోధించినట్టు ధ్వనిస్తూ, "అది ఎవరో ఒక సత్యచరిత వేసినమొక్కట. ఆ అమ్మాయికి ప్రతిరూపంట ఆ మొక్క," అని చెప్పాను.

అప్పుడే టిఫిను తీసుకొస్తున్న అక్కయ్య ఫక్కున నవ్వింది. "... అని ఎవర్రా చెప్పింది? తాతేనా?" అంది. ఇంకా నవ్వుతూనే వుంది.

నేను తెల్లమొహం వేశాను. నేను ఢోకా తిన్నానా?

"ముసిలాడయినా చిలిపితనం పోలేదు. కథలు చెప్పడంలో దిట్ట," అంది అమ్మ.

"కథా11"

" మరి అంతలో వుంది మన జనరల్ నాలెడ్జి. ఓనమాలు దిద్దనివాడు కాజాలు తినిపించాడు తమరిచేత," అక్కయ్య నవ్వుతూనే వుంది.

నాకు మటుకు నమ్మకం కలగలేదు. పైగా మరో సందేహం. మెల్లిగా అక్కయ్యపక్కన చేరి జవాబు రాబట్టేసరికి మరో మూడురోజులు పట్టింది. మురిపించి, మురిపించి అసలు రహస్యం చెప్పింది.

"పువ్వులా? ... ఇంటావిడ ఊరినించి తిరిగి వచ్చింది, చూడలేదూ? పూజకని తిరుక్షవరం చేసేస్తుంది తెల్లారగట్లే లేచి. తమరు దొరలఫాషనులో తొమ్మిదిగంటలకి లేచి చూస్తే మొండిమొక్క దర్శనమిస్తుంది ..."

000

(నవంబరు 5, 1966, ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో ప్రచురితం.)